శ్రీ రామాయనమః.

# ముముక్షు హితచర్య.

ఆంధ్ర వాల్మీకి

వాసుదాస ప్రణీతము.

## ప్రథమ, ద్వితీయ భాగములు.

శ్రీ మదొంటిమిట్ట కోదండరామ కైంకర్యార్థము
శ్రీమతి కస్తూరి వేంకటసుబ్బమ్మగారి భర్తయగు
రా॥ శ్రీ॥ కస్తూరి సుబ్బరావు గారిచే
ప్రకటితము.



THE ANDHRA BOOK HOUSE
SULTAN BAZAR, HYDERABAD-DN.

౧౯౩౯

శ్రీరామాయనమః

# పీఠిక.

---

శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవకసమాజ మంధ్రలోకంబునఁ జేయుకార్య మనేకులకు విదితవిషయమే. ఈసమాజమున సభ్యురాలైన శ్రీమతిచిరంజీవిని కస్తూరి వేంకటసుబ్బమ్మ యనంతపురనివాసిని. బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ॥ కస్తూరిసుబ్బరావుగారి ధర్మపత్ని. ఈకస్తూరి సుబ్బరావుగారు నాకుఁజిరపరిచితులు. కడపపురమున ననాదినుండి నేఁటివఱకు నుండు బ్రాహ్మణ కుటుంబములలో మాయుభయుల వంశమువారు చేరియున్నారు. వారితండ్రి మాతండ్రి తరమునుండి వారికి మాకు స్నేహముగలదు. ఇప్పుడు వీరుపవేతనము పుచ్చుకొని యనంతపురమున నున్నవారు:—

జిజ్ఞాసురాలగుటంజేసి శ్రీమతి వేంకట సుబ్బమ్మ సమాజములోఁ జేరి సాంగభక్తి సాధించుటకై పూని యప్పుడప్పు డుత్తరముల మూలమునఁ గొన్నిప్రశ్నము లడుగుచుండెను. జిజ్ఞాసువు లభివృద్ధికి రావలయు ననిన నిదేమార్గము "తద్విద్ధిప్రణిపాతేనపరిప్రశ్నేనసేవయా". యను శ్రీకృష్ణభగవానుల యుపదేశముప్రకారముతత్త్వ జిజ్ఞాసువులు గురువులకు సాష్టాంగ నమస్కారముచేసి సేవించి చక్కని ప్రశ్నము లడుగవలయును. సాధువు లగుగురువులు శిష్యులయోగ్యత తెలిసి కేవలకృపచే జ్ఞాన

ముపదేశింతురు. ప్రత్యుత్తరములు చెప్పఁజాలని గురువులట్టి శిష్యులపైఁ గోపింతురు. ఇది తమయజ్ఞానమును గప్పిపెట్ట వేయువేషమే కాని యితరము గాదు; శిష్యులు గానివారికిఁ జెప్పవలసినవిధి లేదు గాని శిష్యులని గ్రహించిన పిమ్మట వారికిఁదెలియనివన్నియుఁ దెలియఁజెప్పి సందేహములఁ దొలఁగించుట గురువులకువిధి. కావున శిష్యవంచనము మహాపాతకము. గురుద్రోహ మెట్టిదో శిష్యవంచన మట్టిదే.

నేను గురువనుగాను. నాకు శిష్యులును లేరు. నాకు స్త్రీలందఱుఁ దల్లిదోడులే. పురుషులు తండ్రులు సోదరులే. అయినను దెలియఁగోరి సద్బుద్ధితో నెవ్వరైన నడిగినపుడు తెలిసినది చెప్పుటనాకుఁ గర్తవ్యము.

విద్యాజ్ఞానధనబలము లాత్మార్థ మాత్మీయార్థము మాత్రమే యుపయోగించుకొమ్మని భగవంతుఁ డెవ్వరికి ననుగ్రహింపఁడు. వానికలిమికి లోకోపకారము ముఖ్యప్రయోజనము. అటు వినియోగింపక దాఁచుకొను లోభి బ్రహ్మరాక్షస ధనపిశాచాది రూపములై [illegible] దుఃఖ మనుభవించి మఱుజన్మమునఁ దద్గుణదరిద్రుఁడై జనించును. కావున నాయావానిని పాత్రమెఱింగి దానము చేయవలయును. శ్రీమతి వేంకటసుబ్బమ్మ యడిగిన ప్రశ్నములకు నుత్తరముల నెంతమాత్రము వ్రాయఁగూడునో యంతమాత్రమే వ్రాసి యామెకన్నీళ్లుతుడుచుచుంటిని గాని యవి పర్యాప్తము గాదని మనస్సులో వగ

చుచుంటిని. ఇట్టిసందేహములు గలవారయ్యు నడుగలేని వారు మఱియెందఱు కలరోయనియు నప్పుడప్పుడు స్ఫురించుచుండెను. ఆవిచారమే యీగ్రంథరచనకుఁ గారణమయ్యెను. ఒకగమ్యస్థానమును జేరుటకుఁ బలుమార్గములున్నప్పుడు శాస్త్రసమ్మతము పూర్వాచార్యానుష్ఠితము బహుజనసేవితము నిర్భయము నిరపాయము నిశ్చితము శీఘ్రగమనసాధ్యము నగుదానిఁ జెప్పుట బుద్ధిమంతుల లక్షణము.

ఇందు జెప్పఁబడిన మార్గము సర్వోత్కృష్టము, సర్వజనసేవ్యము, సర్వజనసాధ్యము, సర్వమతసమ్మతమునైనది.

మోక్ష మిచ్చునది కర్మానుష్ఠానము గాని విచారము కాదు వాదము గాదు. అన్నజ్ఞానము క్షుత్తు నణఁపదు. వంటచేసికొని తినిననే యాఁకలి శమించును కావున సర్వముముక్షువులకు భక్తియే కార్యము.

భక్తి యనుగరుత్మంతునకు నష్టాంగయోగము-జ్ఞానయోగము ననునవి రెండుఱెక్కలు. కర్మయోగము పాదములు. కావున భక్తుఁ డగువాఁడు స్వవర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానము మానరాదు. దీనిని భక్తికలవాఁడై భగవత్కైంకర్యబుద్ధితోఁ జేయవలయును-ఫలము, భారముభగవంతునిపై వైవవలయునుఅష్టాంగయోగము జ్ఞానసాధనమునకు భక్తిసాధనమునకుఁ గర్మసాధనమునకుఁ గూడ నుపయోగించును. అష్టాంగయోగము ప్రశ

స్త్రమే కాని భక్తులకు హఠయోగము-లయయోగము ననావశ్యకములు- హఠయోగమున స్వస్తిక-పద్మ-బద్ధ పద్మ సిద్ధాసనములు చాలును. తక్కిన వానికై ప్రయాసపడఁ బనిలేదు. ప్రాణాయామము గ్రాహ్యము. దీనియం దనేక భేదములు గలవు. ఫలోద్దేశము కోలఁది మార్గము సంగ్రహముగఁ జెప్పినను నిప్పటికే గ్రంథము పెద్దదగుటచే యోగమార్గ మిందు వివరింపఁబడలేదు-భగవత్సంకల్ప మనుకూలమై యుండెనేని యది వేఱొండు గ్రంథముగ వెలువడును. ఆత్మావలోకమున కది యెంతయు సాహ్యపడును. అయినను సర్వసాధనములు ఫలించుటకు దైవానుగ్రహము ప్రథమ మని యెఱుంగవలయును. కావున ముందు దానిని బదిలపఱుచుకొన యత్నించుచుఁ దక్కినవానికై శ్రమింపవలయును.

తైలధారావదవిచ్ఛిన్నధ్యాన రూపక భక్తి యీ కాలమున సుసాధముగాదు. కావున దానిని సాధింపఁ బూనిన వారికి

(౧) అనన్యశరణము (ఒక్క దేవతయందే భక్తి గలవారై యుండవలయు)

(౨) అనన్యప్రయోజనము (భగవత్ప్రాప్తి తప్ప వేఱొండు కోరరాదు.)

(3) అనన్యోపాయము-(భగవంతుఁడే రక్షణోపాయముగాని తాను జేయుసాధనములు గావనియు నవి కైంకర్యములనియుఁ దలఁపవలయును.

(౪) మహావిశ్వాసము-(భగవంతుఁడు తప్పక రక్షించునను దృఢమైన నమ్మకము గలిగియుండవలయు ను-ఇందుఁజలనము కూడదు.

(౫) ఆత్మనిక్షేపము. (తన్నుఁ దనవియును కొను సర్వ చేతనాచేతన వస్తువులు భగవంతుని కొఱకే యని స్వరూపము చేతనో సంకల్పముచేతనో సమర్పించుట.)

(౬) సాత్త్వికాహారము.

(౭) సదాచారము.

(౮) నవవిధభక్తులలో నేదైన నొకటియైనఁ జేయుచుండుట.

(౯) క్షణకాలమేని వ్యర్థపఱుపక యేయుపాయముచేతనైన మనస్సును భగవంతునియం దుంచుట.

(౧౦) సర్వము భగవత్స్వరూపముగఁ జూచుట.

ఇవి ముఖ్యములు.

ఇదివఱ కేమార్గము తెలియనివారి కొక్కరికైన నీగ్రంథ ముపయోగ పడెనేని నా కష్టము వ్యర్థముగాదు.

ఈగ్రంథమును బ్రచురించి జిజ్ఞాసువుల కుపకార మొనర్చిన బ్ర॥ శ్రీ॥ కస్తూరి సుబ్బరావుగారికిని, దీనికిఁ గారణభూతయైన వారిధర్మపత్నికిని భగవంతుఁడు దీర్ఘాయురారోగ్య శాశ్వతానందము లనుగ్రహించును గాక యని ప్రార్థించు

వాసుదాసుఁడు.

# విషయసూచిక.

విషయములు. పొరటలు.




శ్రీరామాయనమః.

# ముముక్షు హితచర్య.

గీతమాలిక.

అయ్య! వినిచెద మోక్షేచ్ఛు వైనభక్తు
వర్తనం బని యడిగితి; వానివిధము
రామచంద్రునిఁ గరుణాభిరాము, నాదు
తల్లియును, దోడునీడయుఁ, దండ్రి, భ్రాత
గురుఁడు, బంధుండు, సఖుఁడు, నాకొడుకు, దాత
ధాత సర్వస్వ మైనసీతాహృదబ్జ
ధాము నేకశిలాపురస్వామి భక్తిఁ
దలఁచి దాసోహ మని తత్పదముల వ్రాలి
నిలిచి మ్రొక్కెడి తత్కృపాబలముకతన
నాయన వచింపఁ జేసినయవ్విధమున
దేవహూతికిఁ గపిలుండు తెలిపినట్లు

సీత నీవని తలఁచుచుఁ జిత్తమందు
భక్తులకు నెల్ల సమ్మదప్రదము గాఁగఁ
దెలియఁ బఱచెద వినవమ్మ కలఁక లేక.

అస్మదాచార్యపదముల నాత్మ నిలిపి
హరికి, నరునకు, గోపికాతరుణులకును,
నుద్ధవునకును, బాడబయువతులకును,
శ్రుతులకును, ఋషివరులకు, స్మృతుల కెల్ల
జ్ఞానభక్తిసుధర్మ వెదచల్లిసాధు
జనములకు మార్గదర్శు లాచార్యవరుల
కందఱకుఁ బలుమాఱు సాష్టాంగ మెరఁగి
కరణకాయప్రదాతలై ఖ్యాతి గనిన
జనని జనకుని సద్భక్తి సంస్తుతించి
భాగవతులపాదంబుల వ్రాలి వ్రాలి
వారికరుణాలవంబునఁ బ్రాప్త మైన
దాని నెఱిఁగింతు భక్తు లుత్సాహపడఁగ
జానకీరాము లే దిక్కు సర్వమునకు
తెలియ నివియెల్ల వారలే తెలుపఁగలరు.

## మోక్షలక్షణము.

మోక్షలక్షణ మెఱిఁగింతు మొదట వినుము
ప్రకృతిబంధంబు మునుముట్టఁ బాయఁ దట్టి
మరలి జన్మంబులకు రాక మహితసుఖితఁ

బరఁగి పరిపూర్ణబ్రహ్మానుభవము సతత
మబ్బుటయె ముక్తి యండ్రు త్రయ్యంతవిదులు.
భక్తు లగువారి కీదశ ప్రాప్త మగును
వార లడిగిన నడుగక యూరకున్న.

నిండుయౌవనమునఁ బ్రౌలు నీరజాక్షి
నవనవవిలాసవిభవుఁ డౌనాథుఁ గూడి
తన్ముఖాలోకనక్రియఁ దనివిలేక
తద్వదనచంద్రపీయూషధార లోలిఁ
ద్రావుచుఁ దదీయపరిచర్యఁ దవిలి తవిలి
యవ్యయానందవార్ధి నోలాడుచుంట
వంటి దందురు సుచరిత్ర భక్తుముక్తి.

ఇట్టిసౌఖ్యంబుఁ గాంక్షింతు వేనిఁ దల్లి
నేను వచియించుత్రోవన నీవు చనుము
ఒండురెండుజన్మంబుల నొదవు నదియు.

భక్తిమార్గైకనిష్ఠుఁడౌ భక్తవరుఁడు
భక్తిచేయుట తనకు స్వభావ మనుచు
భక్తి చేయును గాని తత్ఫలము గాఁగ
దీని నైనను గోరఁడు తెలివిమాలి
కానఁ జేయుము భక్తిని గాంక్షమాని
ఫలము భారంబు రాముపైఁ బాఱవైచి
స్వామియె ఘటించు నీకట్టిసౌఖ్యపదవి.

నీకు మాత్రంబె కాదమ్మ నీదుపతికి
నీదుతల్లికిఁ దండ్రికి నిక్కముగను.

మరల జన్మంబులకు రానిమార్గ మన్య
మున్నయది దాని వినిపింతు నువిద వినుము.

వేనవేలుగ జన్మముల్ వెచ్చపఱిచి
యాత్మనిష్ఠైకనిష్ఠ దేహాంతమందుఁ
గేవలుండయి యొకచోటఁ గెవలువిధము
మగఁడు లేనట్టిసుందరి సొగను లెన్నొ
చేసికొని నిల్వఁటద్దాన భాసురంపుఁ
దనదువిభవంబుఁ జూచుచుఁ దనకుఁ దానె
మురియు చుండుటవంటిది ముగుదమిన్న!

ఆత్మ నవలోకనము చేసి యంతతోన
తృప్తిపడుజ్ఞాని కీదశ ప్రాప్త మగును
దానిఁ గైవల్యమందురు తత్త్వవిదులు.

తాను గలకండగా మాఱఁ దలఁచు జ్ఞాని;
దానిఁ దినఁగోరుచుండు భక్తప్రవరుఁడు
వీనికిని వాని కభ్యాసవిధము సమము
కర్మములఁ గీసభేదంబె కానిపించు
భావనాభేదముల వేఱుపడును ఫలము.

భావభేదంబు లేరీతి వచ్చెననుదె?
పెద్దప్రాకారమును గూడి పెంపుమీఱు
కమ్రభవనంబు నొక్కటి గల దటంచు
దానిఁ గొందఱు చూడంగఁ దరలి రనుచుఁ
దలఁపు; కొందఱు వారిలోపలను వెలికిఁ
గానవచ్చెడి ప్రాకారఘనతఁ గాంచి
యింతయే కాని లేదు వేఱొద్ది యట్టి
దున్న వెలికిని గనరాదె యన్నమతిని
నంతతోఁ దృప్తులగుచును నరుగుచుంద్రు.

అమ్మ! వీరలె చార్వాకు లనెడివారు
స్థూలదేహంబె సర్వ మంచును దలంత్రు.

కొంద ఱావలఁ బ్రాకారకుడ్యములను
దాఁటి చని మేడ యిల్లని దానిమహిమ
సొంపుపెంపును మనసారఁ జూచి చూచి
నిలువుటద్దాలలోఁ దమనీడ చూచి
విభ్రమంపడి దేహంబు విస్మృతి గొని
నిలిచిపోదురు నిట్రాతివలెను దల్లి!

వీరలే యాత్మనిష్ఠులై వెలయువారు
ఆత్మసంతుష్టిగని మొదరంతతోన
అంతతోఁ దృప్తి గానక యవలఁ గొంద
ఱతుల దేదీప్యమానహర్మ్యంబు విజన

మగుచు నుండునె? లేరె గృహస్థు లిందు
ననుచు లోఁజొచ్చి గృహమేధి నందుఁ గాంచి
ప్రీతి సమ్మానితాత్ములై పేర్మి గందు
రట్టివారలె చుమి భక్తులైనవారు
ఆత్మ యెవనిశరీరమో యనెడు శ్రుతులు
వీరికిఁ బ్రమాణమై యుండు విశ్రుతముగ
కంటివే భేదబుద్ధికిఁ గారణంబు.

అమ్మ! యొక్కటి నీమది సమ్మవలయు
ఎట్టిదో యుందు నీశ్రద్ధ యట్టిఫలమె
మేను విడిచినపిమ్మటఁ గానఁగలవు
తథ్యమిది యెట్టివారికిఁ దప్పదమ్మ!
కాన నీవెట్టిదశకును గాంక్షపడెదొ
దాని కనువైనమార్గానఁ దరలి చనుము
ఒక్కమార్గంబె నే నిందు నుగ్గడింతు
భక్తుఁ డరిగెడుమార్గంబె? భ్రమముపడకు.

అన్యమార్గంబునకును నీవాశపడిన
ముట్టకుముదీనిఁ బెడత్రోవఁబొమ్ముతల్లి!
వందనమునీకుపదివేలవందనములు

—— ముక్తికనధికారులు. ——

పరము లేదనిపల్కుచార్వాకజనము
లవనిఁ బ్రత్యక్షవాదులై యమరుకతన

దేహపాతమె ముక్తినా దేవురింత్రు
వీరలకు లేదు మోక్షంబు వినయశీల!
సుఖము దుఃఖము నెఱుఁగక శుద్ధజడము
లైన పాషాణములువోలె నగుటె పరమ
టంచు ననువారికిని లేద; యాత్మస్వస్వ
రూపనాశంబె మోక్షమఁట క్రూరమతికిఁ
గల్ల మోక్షంబు; గాలిలో గాలి గలసె
మిథ్య వేదంబు, లోకంబు మిథ్య, శాస్త్ర
సమితియును మిథ్య, మిథ్యయే సర్వ మీశ్వ
రుండునఁట మిథ్య, మిథ్య జీవుండు, మిథ్య
బంధమును మోక్ష మనుచును బలుకునట్టి
వారలకు లేదు సౌఖ్యానుభవము దల్లి!
స్వాత్మహంతలు వీరుయథార్థమరయ.

కర్మములు ధర్మములు ఫలకాంక్షఁ జేసి
చేయువారును ముక్తిని జెందఁబోరు
వీరి కీమర్త్యలోకంబె విడిది యగును.

కామ్యమును గోరుభక్తులు గనరు ముక్తి
ముక్తి నైనను గోరండు భక్తుఁ డెదను
మహిమఁ బ్రకటించుయోగి కామాత్రఫలమె.
కాని మోక్షసుఖంబును గానలేఁడు

కాదు మోక్షంబు యోగసమాధియైన
మేనితోడుతఁ బొత్తునుమానకునికి
బొక్కలను దాఁగినంతనె ముక్తిగలదె?

తర్కమందును శబ్దశాస్త్రంబునందు
నిరతిగలవారికిని ముక్తి నివ్వటిలదు.

ఏమిచేసిన నెవరేమి యెంచువారొ
యనుచు లోకులచిత్తంబు ననుసరించు
జనులకును లేదు; భోజనాచ్ఛాదనముల
నిలయములఁ బ్రీతియున్నను గలుగ దదియు.

ఇంద్రియంబుల పంచకమందుఁ బ్రీతి
యున్న, హింసయొనర్చిన, నున్న ముక్తి.
సంగమును బాయకున్న మోక్షంబు లేదు.

ఆత్మచింతయు, శ్రద్ధ, యేకాంతనిరతి
భక్తివైరాగ్యములు లేక ముక్తి లేదు
భక్తియందైనఁ బరమహాభక్తి యొకఁడె
ముక్తిదాయక మగుచును మొనయుచుండు.

ఏను నాది యటంచును నెంచువాఁడు
దంభమును, లజ్జ, భయము, క్రోధంబు, పగయుఁ
గాంక్ష, మోహంబు వ్యథయు, శోకం, బతుష్టి
హర్షమును గల్గువాఁడు శ్రేయంబు గనఁడు.

భయముపడువాఁడు, నొరు భయపఱుచువాఁడు
కానఁ డోయంబ! నిజము మోక్షంబు నెపుడు.

నడిమినాడిని జీవుండు వెడలి చనక
మనసు విలయింపకయె ముక్తిమాట లేదు.

పరమభక్తియు యోగంబుబలము లేక
యిట్టిపథమునఁ బోవ లేఁ డెట్టి ఘనుఁడు.

ద్వంద్వభీరుండు గనఁ డపవర్గ మమ్మ.

అఱువురుశాత్రవులఁ ద్రుంచి యశము మించి
యమములను జక్క నిలక శ్రేయంబు లేదు.

*మూఁడకారంబులం బ్రీతి మొనసియున్నఁ
గాన నేరఁడు తల్లి! మోక్షంబు నెపుడు.

ప్రకృతిసంబంధ వాంఛలవంబు నున్న
వాని కపవర్గసౌఖ్య మంబరసుమంబు.

జనని! శుద్ధాత్మయును శుభాశ్రయముగాదు.
కావున ముముక్షు లివియెల్లఁ గడిమి గెల్చి
ముక్తికన్యకఁ జేపట్టఁ బూనవలయు.

ఏది యుండిన లేకున్న లేదు బాధ
నిత్య మచ్యుతుపై మది నిలిచెనేని.

* అన్నము-అతివ-అర్థము. ఇవి మూఁడకారంబులు.

అవగుణవ్యాధులకును దివ్యౌషధంబు
సర్వమును వాసుదేవుఁ డను జ్ఞాననిష్ఠ.
పరమభక్తియె జ్ఞాన మను ప్రథ వహించు
మాట కర్థంబు తెలియుటమాత్ర గాదు.
అమలగుణముల కెల్లను నాస్పదంబు
వాసుదేవుండె దైవ మను పరమభక్తి.
కానఁ దత్సాధనముఁ గొని కడకుఁ ద్రోలి
యవగుణంబులఁ జేపట్టు మనులగుణము
సుకర మిది గాదు సలుపంగ శుభచరిత్ర
వాఁడితరవారిపై లాఁగు వైచు టగుదు.

## నిర్వేదము.

ఎవఁడు నిక్కువ మగుముముక్షువు ధరిత్రిఁ
దెలియుదే వానిదౌపద్ధతిని సుశీల!
కల్పములఁ గొన్ని స్థావరాకారములను
గడపి మఱి జంగమంబునై క్రమముగాను
ఎనుబదియునాల్గులక్షలం చెన్నికగల
యోను లందెల్ల వరుసగా నుద్భవించి
మనుజుఁడై పుట్టుఁ తుదకు భూతలమునందు.
మూఁడువిధముల యోనులఁ బుట్టిపుట్టి
యవల నధమాధమనుష్యుఁ డగుచు జీవుఁ
డుత్తమోత్తముఁ డగును బుణ్యోదయమునఁ

గర్భముఁగొలంది దేహముల్ కలుగుఁ బోవు
గాని యవి జీవునకు నెప్డు గలుగవమ్మ.

గాజుకుప్పె లవెన్నైనఁ గలుగుఁ గాని
దీప మొక్కఁడె యనుచును దెలియవమ్మ

చెప్పితిని దీని ఔంకాయచిప్పశతక
మందు నుండెడుఁపీఠికయందు మున్నె.

జ్ఞాన మానంద మనునవి సహజగుణము
లవుట జీవున, కారంభమందు నరుఁడు
ప్రకృతిగుణ మైనతమము ప్రాబల్యమునను
తనదుజ్ఞానంబు సంకుచితంబుగాఁగఁ
బ్రకృతిసంబంధవిషయాళివలనఁ గలుగు
సౌఖ్యమే సౌఖ్య మనియెంచి జరగుచుండు
విషయసౌఖ్యాళికై; యందు వివిధపాప
కర్మముల జారచోరత్వ కార్యములను
జలిపి యిహమున నరకాన సంతపించి
మరల మహియందు జన్మించు మానవుఁడుగ
నైన, నంతకు హీనమౌ నధమయోను
లందునే, నిట్లు జన్మంబు లొంది యొంది
తెలివిగలవాఁ డగుచు వానిఁ దలఁగఁ ద్రోచి
పుణ్యకార్యంబులను జేయఁ బూనుఁ బిదప.

నాకలోకంబు సుఖభూమి యనుచు వినుటఁ
గర్మసాధ్యంబ యదియయి కానఁబడుట
దానములు యాగములు పెక్కుధర్మములను
జేసి స్వర్గంబునకుఁ బోయి, చేసినట్టి
కర్మఫల మందుఁ గుడిచి తత్కర్మసుకృత
మెల్లఁ దీఱిన మఱిమఱి యిందుఁబుట్టు.

స్వర్గమునకును బోవుచు వచ్చు చిటకుఁ
బోకరాకలఁ బెక్కువేల్ పుట్టువులను
విసిఁగి కడపట నివియేమి వెత లటంచు
శాశ్వతసుఖంబునకు దోయు సన్మనీషి;

వీనికి జన్మించు మొుదట నిర్వేద మెదను
అయ్యయో! యెన్నిజన్మముల్ వ్యర్థపడియె
నెందఱో భార్య లాత్మజు లెందఱైరొ
యెన్నిమారులు నరకాన కేగినానొ
యెన్నియాతనల్ పడలేక యేడ్చినానొ
యెన్నిగర్భాలలో వసియించినానొ
స్తన్యజలధుల నెన్నిటిఁ ద్రావినానొ
యెంతధన మార్జనముచేసి యేమిఫలము
పరుల పొట్టలు నించుటే ఫలము గాక
బంధులా వీరు? నాకాళ్లబందు లయ్యె.

కాలకింకరు లరుదెంచి కట్టువేళ
నరకములఁ ద్రోచి కత్తుల నఱకువేళ

దివమునందుండి తలక్రిందఁ ద్రెళ్లువేళ
నంతరాళంబునందు నల్లాడువేళ
మేఘములయందు దరిలేక మెలఁగువేళ
సూర్యకిరణాళిలోపల స్రుక్కువేళ
వర్షధారలలోఁ జిక్కి వనరువేళ
ధాన్యమైనరుగర్భానఁ దనరువేళఁ
బురుషువృషణంబులందేను బొరలువేళఁ
గామునాళంబులోనుండి కామగృహము
నుచ్చగుంతను నేడ్చుచుఁ జొచ్చువేళ
గర్భనరకంబునం దేను గ్రాఁగువేళ
వికట మగుద్వారమునుండి వెడలు వేళ
నొక్కరైనను దిక్కయి యోమినారె?

వేయితేళ్లులు కుట్టినవిధము గాఁగ
జననమరణంబులందేను సంతపింప
నెవ్వరేని బాధమాన్పిరే యించుకంత?

కాలపాశముల్ విడిపింపఁ గలిగినారె
యమునితో మంచిపలుకైన నాడినారె
ఎవ్వ రుండిన లేకున్న నేమి వీరు?

సంపదలవేళఁ జుట్టాలు చాలఁ గలరు
ఆదుకొన నొక్కఁడేని గల్గఁ డాపదలను.

ఇనుపసంకెలల్ పాపముల్, హేమశృంఖ
లంబు లవుఁగాదె సలుపుపుణ్యంబు లిందు;
బంధములె కద యేవైన బాధపఱుప?
నట్లొకో నేను నీరెండుకట్లు లేక
శాశ్వతసుఖంబుఁ గందు సంసార ముడివి.

అయ్యయో! యెన్ని యేండ్లాయె నవనిఁ బుట్టి
పుణ్యమేమి యొనర్చితి ముక్తికొఱకు.

బాల్యమును బోయె నాటలఁ బాటలందుఁ
యౌవనం బుడివోయె భార్యానురక్తి
మాపులెల్లను నిద్రలో మాయ మయ్యెఁ
బగలు పోయెను గూటికై పసువు లెత్త
ఆధులను వ్యాధులను గొంత యునను చనియు
బరులసేవలఁ గాలంబు నరిగెఁ గొంత.

పుణ్యతీర్థంబులకు నేను బోవనైతి
క్షేత్రసంవాసమైనను జేయనైతిఁ
బరమసాధులపాదముల్ పట్టనైతి
సాత్త్వికత్యాగ మెయ్యది సలుపనైతి
దైవకైంకర్య మొకటియేఁ దలఁపనైతి
దేవపూజయునా నేమొ తెలియనైతి
ఒక్కపరియైన హరికిని మ్రొక్కనైతి

శ్రీవిభునినానుజపమైనఁ జేయనైతి
చేసినట్టివిపాపముల్ చెప్పలేను
తలఁపునకు రాఁగ నవి మది తత్తఱిల్లు
వార్ధకము వచ్చుచున్నది వ్యాఘ్రమట్లు
కన్నుదోయిని నుసకలు కప్పఁదొడఁగె
మేను ముడుఁతలు పడఁజొచ్చె మెల్లమెల్ల
పండ్లనొవ్వులు పుట్టెను వడఁకెఁ గాళ్లు
పెరుఁగుబుద్ధియొ నాఁగను శిరము నరసె
ఏగుదెంచుచునున్నారు మృత్యుభటులు
ఏమిసేయంగనేర్తు నే నిట్టివేళ.

ఎవరితో మొఱవెట్టుదు నెందుఁ జొత్తు
నెవరిపదములు పట్టుదు నే మొనర్తు
నేమహాత్ముఁడు దిక్కయి యోమఁగలఁడొ.

కాఱుచిచ్చునఁ జొచ్చినఖగమురీతి
వలల నురులను జిక్కిన పులుఁగునట్లు
నీళ్లలోఁబడి యీఁదఁగ నేరనట్లు
మ్రింగి విషమును గడుపులోనం గలంత
పెట్టి ప్రేవులు గోయఁ గూపెట్టినట్లు
తీవ్ర నిర్వేద మొదవిన సువ్రతుండు
కళవళించును దపియించు జలదరించు
బలవరించును గన్నీటివఱద గార్చు

ఘోరసంసారముం గని కుతిలపడుచు
నాఁడువారలఁ గనుఁగొని యటమటించు.

ఇట్టినిర్వేద మెదలోనఁ బుట్టుదనుకఁ
బుధుఁడౌ ముముక్షు దనుమాట పొల్లుమాట.

ఇట్టినిర్వేద మొదవినయట్టిసుకృతి
తన్నుఁ బోలినవారలు ధరణిఁ గలరె?
యంచు రోయుఁ బరీక్షించు ననుదినంబు
దైవమా నన్నుఁ గాపాడు దయను మనుపు
మనుచుఁ బ్రార్థించు మ్రొక్కుఁ దా నాత్మలోన.

వానిపుణ్యంబు మంచిదై వచ్చినపుడు
సాధుసాంగత్య మతనికి సంభవించు.

ఎఱుఁగుమీ యిది దైవంబు కృపయటంచు
ఇట్టిసాంగత్యమును లభియించు టెంతొ
దుర్ఘటం బని యెంచుమీ దొరకెనేని
వ్యర్థముగఁ బోవదమ్మరో వాస్తవంబు
అదియె సంసారగిరికి వజ్రాయుధంబు
అదియె సంసారజలధికి నౌర్వవహ్ని
అదియె సంసారగహనదావాగ్నికీల.

సాధుజనములలోపల సంచరించు
వానినే స్వీకరింతురు భాగవతులు

## గీతమాలిక.

భాగవతు లెవ్వనిని దమవాఁ డటంద్రు
వానినే చేరఁదీయు శ్రీవల్లభుండు.

సాధువుల నెట్లు కన నని సంశయింతో
వీరివిధ మెల్ల స్ఫుటముగ విస్తరింతు.

### సాధువులు.

కామినీకాంచనాసక్తిఁ గ్రాల రెపుడు
ఆర్జనయు సంచయం బనునవియు లేవు
హరికథాలాపములఁ దప్ప నన్యకథల
నాడఁ దలఁపరు సుఖముల కాశపడరు
వ్యసనపడ రేమికష్టముల్ వచ్చెనేని
తరుణులను బీన్గు లనియొండెఁ దల్లు లనియొ
కాంచుచుందురు; సంగంబుఁ గాన రెపుడు
ఏకతమ యుండఁగోరెద రెల్లవేళ
దంభమును, లజ్జ, లోకచిత్తగ్రహణము
భోజనాశయు, వసనాశ, పూన రెదలఁ
బొంగ రబ్బిన, లేకున్నఁ గ్రుంగిపోరు
గౌరవంబున కీకోరు, కలిమిఁ గోర
రింద్రియంబులఁ దామె జయించి యుంద్రు

ఏది తాఁకిన, మూచూడ నేది తినిన
నేది యాలింప, నెది గన, హృష్టి, గ్లాని
పడక యుంట జితేంద్రియత్వమ్ము సుమ్ము

చెల్లి యుండియు సువిరక్తి వెల్లుగాఁగ
స్పర్శమునకుఁ బ్రతిక్రియ సలుప కునికి
పరఁగుఁ జుమ్ము జితేంద్రియత్వమ్ము నాఁగ
కుంభపాతంబుగా వృష్టి గురిసె నేని
మండు నెండల మలసెడి వేళ నేని
గొడుగునుం బాదరక్షలు గొనఁడ యేని
శీతభీతిని నగ్నిని జేరఁడేని
గంధమును బేడ నొకరీతి గాంచు నేని
తీపు తిక్తంబు నొకరీతిఁ దినున యేని
పాన్పునందును జాలపైఁ బండు నేని
అత్తరు వమేధ్య మొకభంగి నలఁదు నేని
వాఁడు సుమ్మి జితేంద్రియత్వమ్ముఁ గనెడి
వ్యాధిచేఁ బీడితుం డయి వనరువాఁడు
భీతిచేఁ గాక యాత్మసంప్రీతిఁ గాక
సలుపకున్నఁ బ్రతిక్రియ స్వామిసేవ
చెడెడునట్లున్నఁ బ్రతిక్రియ చేయవచ్చుఁ
గాని దేహాభిమానంబు కతనఁ గాదు
పరులమెప్పునకును గాదు భవ్యచరిత!

సాధనముగ శరీరంబు స్వామి యిచ్చె
నాత్మకార్యంబు నెఱవేర్ప; నట్టిచోట
స్వామికార్యార్థి తనురక్ష సలుపవచ్చు
స్వామికార్యార్థమయి యొండు సరణిఁ గాదు.

స్వామికార్యార్థముగ మేనిఁ బాయవలయుఁ
దనప్రయత్నంబు లే కది దారసిలిన
కాంచనము ఱాయి సమదృష్టిఁ గనుచు నుంద్రు
పరవశంబైనవానికిఁ బాటుపడరు
స్వవశ మగునట్టికార్యంబె సలుపుచుంద్రు
పరులు దూషించినను బ్రతివచన మిడరు
పలికినను శాంతులై కరాంజలులు మోడ్చి
యాగ్రహింపక యుత్తర మంద్రు గాని;
పాణి, యుదరంబు, వాణి, యుపస్థ మనెడి
ద్వారముల రక్ష గావింత్రు తంద్ర మాని
మమతయు నహంత విడనాడి మలయుచుంద్రు
షండు లగుదురు పరసతీసమితిపట్ల
మూఁగ లగుదురు పరివాదములను, బుట్టు
గ్రుడ్డు లగుదురు పరరంధ్రకోటియందు
బధిరులై యుంద్రు విషయవివాదములను
సుఖము దుఃఖంబు సమముగాఁ జూచుచుంద్రు
ఎప్పు డెఱుఁగ రసంతుష్టి, యోడ్పు, కాంక్ష;
సంగములేక ధాత్రిపై సంచరింత్రు
ఎల్లవేళల సంతుష్టి నెసఁగుచుంద్రు
కార్యములఁ జేయుదురుగాని కాంక్ష లేదు.
దేహధారణమున కెంతొ తినుదు రంతె
దేహమును బలియింపరు తిండిబలిమి

రుచులు కోరరు కాంక్షింత్రు శుచిత నెపుడు
అట్టివారలు సుమి సాధులనెడి వారు.

ఇట్టివారలఁ గని వారివృత్త మెఱిఁగి
వారి సేవించితేని నిర్వంచనముగ
నీదుభక్తియు శ్రద్ధయు నీతి నెఱిఁగి
యోగ్యతకొలంది చెప్పెద రున్నవిధము.

ఇట్టివారలతోఁ జెల్మి పట్టుపడక
తత్త్వ మెఱుఁగంగ రా దెట్టిధన్యమతికి

వారిసాంగత్యమహిమను వరుసతోడఁ
బ్రీతిభక్తియు ముక్తి లభించుఁ దల్లి!
ఇట్టివారలు దుర్లభు లిపుడు ధరణి

ఉభయలోకంబులం జెడనొల్లవేని
మోసపోవకు చెడిపోకు మోసగాండ్ర
మాయమాటలలందుఁ జిక్కి యోమధురవాణి!

## అసాధువులు.

వేషభాషల పసగాని వేఱులేదు
వీరియెడ వంచనముగాక వేఱులేదు.
నిక్క మగుసాధు వెన్నఁడు నీతిచెడఁడు
రోదనము చేయఁ డంగశుశ్రూష గోరి
అందు యువతులపరిచర్య కాసపడఁడు

తాఁకనీయఁడు తనదువస్త్రంబు నైన
మహిమఁ జూపెడి మాయలమారి గాఁడు
శౌరికి నివేదితంబు భైక్షంబు దేని
నైనఁ దినుఁగాని రాజసాహారతామ
సాన్నమును ముట్టనొల్లఁ డాహారనిష్ఠ.
మత్తు నొసఁగు పదార్థాళిమాట యేల?
వీనిఁ గొనువాఁడు సాధు వేవేళఁ గాఁడు
ధనము గడియింప లవమేని మనసు నిడఁడు
స్త్రీలు దేహంబుఁ దాఁకంగఁ జీదరించు
తనువుపై నభిమానంబుఁ దాల్పఁబోఁడు

సాధువులు లభియించినఁ జాలమేలు
దొరకకుండిన దోషంబు దొడరఁబోదు

సాధు వైనట్టిగురుఁడు నాచార్యవరుఁడు
దొరకునందాఁక శ్రీహరి స్మరణ విడకు

మోసపోవకు మోయమ్మ! మోసపోకు
మాయదారుల వలఁజిక్కి మడియవలదు

సాధుగుణములు లేనట్టిజనుఁడు జడుఁడు
జన్మముక్తినిఁ గాంచఁడు సత్యమమ్మ!

## గురులక్షణము.

జ్ఞాన మనియెడివెలుతురు లోనఁ జొనిపి
హృదయగత మైనచీఁకటి చెదరఁగొట్టి

కరుణ శిష్యునిఁ బ్రోచెడిఘనుఁడు గురుఁడు

శాస్త్రపఠనంబునన్, సదాచారసరణి,
నిష్ఠ,శిష్యునిదిద్దెడినేర్పు గలుగు
సాధుచరితుఁ గులీను నాచార్యుఁ గాఁగ
గురువుగాఁ గొమ్ము తక్కినసరుల నెపుడు
చేరి తేనియుఁ దప్పక చేటువచ్చు

ఛాత్రవిత్తాపహారులు చాలఁ గలరు
గురులు నేఁడెందు నేనియుఁ గుటిలమతులు

ఎవఁడు శిష్యుని శిష్యుఁడన్ దృష్టిఁ జూచు
వాని గురువుగఁ గైకొన వలదు తల్లి!

చూచు నెవ్వఁడు సోదరీసోదరు లని
శిష్యులను వాని గురువుగాఁ జెప్పనగును

ఇట్టియోగ్యుండు తన శిష్యబృందములను
దనదుగురువులశిష్యు లంచును దలంచి
సోదరప్రీతి నేవేళఁ జూపుచుండు.

ప్రతిఫలాపేక్ష బోధించుమతివిహీను
గురునిఁగా నీవు నేవేళఁ గొనకు తల్లి!

గురువు కోరకయున్నను గురుమనీష
ప్రీతి శిష్యుండు తద్గురుభిక్ష గాఁగ

నిష్ఠ దానిని గైకొంట చెడ్డగాదు
గురుఁడు సన్న్యాసి గాక సంసారి యేని

మంత్ర మిచ్చినఁ గొనినను మహిమ చెడును
భ్రష్టు లయ్యెద రిర్వురు స్పష్టముగను

సాత్త్వికము రాజసంబునై జరుగుభుక్తి
గురునిదేహంబు రక్షించుభరము శిష్య
జనులయది గాన వా రది చనును జలుప

శుచియు రుచియును గలదిగాఁ జూచి తెచ్చి
గురున కిడవచ్చు శిష్యుండు కూర్మిమీఱ

మధువు మాంస కలంజముల్ మత్తు నొసఁగు
వాని నిడరాదు వాఁడు వా బాఁదుకొన్న

ఇట్టివానిని గోరెడిహీనగుణుని
బరమునీచుని భ్రష్టుని గురునిఁగాఁగఁ
గొన్ననిర్భాగ్యుకంటెను గూళ లేఁడు

శిష్యజనములయాత్మ రక్షించుభరము
గురునిదై యుండు నేవేళ గురుమనీష
వార లెప్పు డంతేవాసు లైరయేని

ఒక్కయూరను గురువు వేఱొక్కయూర
శిష్యుఁ డుండిన నిది యెట్లు చెల్లఁగలదు.

గురులలక్షణమును మేలుకొలుపునందుఁ
బలికినాఁడను దెలియంగ వలచితేని
దానిఁ బఠియింపు తల్లి! తాత్పర్యయుక్తి.

తన్ను మించినవాఁడు కాఁదగును శిష్యుఁ
డంచుఁ దలఁచుట గురువుల కర్హవిధము
కాకిపిల్లవిధంబునఁ గాదు తల్లి!

కాన నేర్పంగవలసినవాని నెల్ల
వంచనము లేక నేర్పంగవలయు గురుఁడు
యోగ్యమై శిష్యచారిత్ర ముండెనేని.

గురువు పొరపాటు చెప్పిన సరి యెఱింగి
శిష్యుఁ డద్దాని సవరింపఁ జెల్లదనుచు
నాడుదురు చుమ్ము పాషండు లైనవారు
గురునినడవడి దోషంబు గొఱలెనేని
శిష్యుఁ డేకతమున దానిఁ జెప్పవలయు
నయ్య! నీకిది సరిగా దనర్హ మనుచు
బాహిరంబుగ నవమానపఱుప రాదు.

వినఁడ యేనియు వానిని వీడవచ్చు.

బ్రహ్మచర్యవ్రతంబును బాడుచేయఁ
బట్టుపట్టిన భీష్ముండు పరశురాముఁ
జక్క శాసించె విబుధులు సన్నుతింపఁ

గాన గురువులు కారాని కార్యములను
జేయు మన్నను శిష్యులు చేయరాదు.
వారిసాంగత్యమును వీడవలయు నపుడె.

### అయోగ్యదేశికులు.

కులవిహీనుని స్త్రీని నీగురువుగాఁగఁ
గనుచు మంత్రోపదేశమ్ము గొనకు మమ్మ
వార లెంతటియోగ్యులై వఱలిరేని.

బ్రాహ్మణబ్రువులును స్త్రీలు పాదజులును
నినఁగ యోగ్యత లేదమ్మ! వేదమంత్ర
ముచ్చరింపఁగ యోగ్యత వచ్చె నెట్లు?
ఉన్నతాచార్యపదవి యొందుండి వచ్చె?
అయిన సిద్ధికి మంత్రంబు నగు గ్రహింప
యోగ్యుఁడైన సదాచార్యుఁ డౌదవె నేని

అంతయే కాని యోగ్యత సుంత లేదు
పసులకుపదేశమునకు స్త్రీపాదజులకు

బ్రాహ్మణులు తక్కుకులములవారి గురులఁ
గాఁగ గ్రహియించిరేని యాకలుషమతులు
పతితు లగుదురు పంక్తికిఁ బనికిరారు.

వీరు చండాలు రనుచు భావింపవలయు
ననుచు నారదమౌనీంద్రుఁ డనియె మున్ను

ఎవరి చేనైన నేవైన నెఱుఁగవచ్చుఁ
దక్కువిషయంబు లైనను ధన్యచరిత!

## మతములు పుట్టినవిధము.

అమ్మ! మతములు పుట్టినయట్టివిధము
దెలియ వినిపింతు నొకకొంత తెలిసికొనుము
మతము మతము నటంచనుమాట కర్థ
మమ్మ! తెలియు మభిప్రాయ మంచు మదిని
నాయభిప్రాయమే యయ్యె నాధుమతము
నీయభిప్రాయమే యయ్యె నీదుమతము
భిన్నభిన్నమతంబు లీవిధి జనించె

ఇంద్రియనుగోచరం బైనయీశరీర
మే నిజం బన్య మెది లేదు దీనికంటె
ననెడివారలు కొందఱయ్యవని గలరు
(వీరె చార్వాకు లనియెడిపేరివారు
వీరె నాస్తికు లంచును బిలువఁబడిరి
పరము దైవము లేదని పలుకుకతన.)

కాదు కాదది సత్యంబు కాయమందుఁ
జేతనుండుంట పోవుట ఖ్యాతి గాదె?
కాయము వినాశ మాఁగాదె? కానఁ గలఁడు
జీవుఁ డంచును గొందఱుచెప్పినారు.

అయిన నీరెంటిలోన యథార్థ మేది

యని వితర్కించి రావల నలఘుమతులు
కల్ల రెండును ననియెడికల్లమతము
భూమిపై నింతదనుకను బుట్టలేదు.

ఇంద్రియసుగోచరం బైన నెల్లఁ గల్ల
జీవుఁ డొక్కండె సత్యంబు దేవుఁ డతఁడె
యజ్ఞతాకారణమున నట్లయ్యె నంచుఁ
గొంద ఱాడిరి; యాపయిఁ గొందఱనిరి

దేవునకుఁ దెల్వి దొఱఁగినఁ దీర్తు రెవరు?
అట్టి సర్వజ్ఞుఁడే యెట్టు లజ్ఞుఁడయ్యె?
అజ్ఞతకు స్థాన మెద్ది? యెం దద్ది యుండు
అజ్ఞతయె యున్న దేవుఁడెట్లయ్యె నతఁడు?
మిథ్య గాదేది రెండును దథ్య మనుచు
మతవిభేదంబు లీరీతి మహిం జనించె.

నాది శ్రేష్ఠంబు శ్రేష్ఠంబు నాది యనుచు
మతవిభేదంబులం జిక్కి మడియవలదు

పూర్వులు వచించినది కూడఁ బూర్ణముగను
దెలిసికొన్నదైన నావంత తెలివి లేక
వాదులాడెడువార లున్నారు లక్ష్మి!
బుద్ధిగలవాఁడు వాదంబు పొంతఁబోఁడు
కార్యసాధకుఁ డగుచును గ్రాలుఁగాని

అందఱును బ్రాజ్ఞు లగుచు యథార్థరీతిఁ
దమకుఁ దాపూర్త్మ యోజించి తత్త్వవిధము
నిర్థ మిద మంచుఁ దెలియంగ నెట్లు లగును?
నిపుణుఁ డెవ్వండొ తత్త్వంబు నిర్ణయించి
పలికినం దన కది సరిపడినయేని
యట్టిత్రోవను జనుట శ్రేయస్కరంబు
గ్రుడ్డి యగునెద్దు జొన్నలోఁ బడ్డయట్లు
గొఱ్ఱెబడి దూఁకుమటియొండుగొఱ్ఱె యట్టు
లరిగితివయేని లేదు శ్రేయస్సు నీకు

నీమదికి నేది సరిపడు నీకు నేది
సలుప సాధ్యంబొ యద్దానిఁ దెలిసి నీవు
దానఁ జరియింపు బాగొందఁదలఁతువేని
అట్టులని క్షుద్రమార్గాన నరుగ కమ్మ
శ్రేష్ఠ మని దేశమెల్లను జెప్పెనేని
నీకు సాధ్యంబు గానట్టి నిష్ఠగొనకు.

ఈవు జీర్ణించుకొనునదియే కదమ్మ
యాయురారోగ్యసౌఖ్యంబు లందఁజేయు
ఈవు జీర్ణించుకొనఁజాలవేని యదియు
నెంతశ్రేష్ఠాన్న మైనను నేమి ఫలము?
కాన శ్రేష్ఠాన్నమే జీర్ణ మైనయంత
గొనుట మతిమంతులక్షణం బనుచుఁ దలఁపు

కార్యసాఫల్య మొనఁగూర్పఁ గలుగుదాని
సుకరమైనంతమాత్రాన క్షుద్ర మనకు
గోటఁ బోయెడిదానికి గొడ్డ లేల?
సుకరమును శీఘ్రఫలదంబు సుష్ఠువైన
యుత్తమోత్తమమార్గంబె యుగ్గడింతు
అట్టిమార్గానఁ జనుము భయంబు లేదు
గమ్యసుస్థానమును జేరఁ గలవు వేగ

నేఁటిమనవారిపద్ధతి నీ వెఱుఁగవె
మాటలను బోట్టులను నిల్చె మతము లెల్ల
భూతి యడ్డంబుఁ బూయ నద్వైతి యయ్యె
నిలువుబొట్టిడ ద్వైతినా నివ్వటిల్లు.

ద్వైత మననేమొ యేమొ యద్వైత మనఁగఁ
జేసు లైన నెఱుంగక వేలకొలఁది
దన్మతస్థులు మనుచుంద్రు తథ్యముగను
మతములక్షణ మెఱుఁగనిమాట యేల?

మతము దెలియక యున్నను మానుఁ గాక
యడ్డబొట్టిడువానికి బిడ్డ నగుట
నడ్డబొ ట్టిడుకొనువాఁడ, నట్లె నిలువు
బొట్టుపెట్టెడువానికిఁ బుట్టెఁ గాన
నిలువుబొట్టిడుకొను నను తెలివి లేక
శునకములరీతిఁ గొట్లాడుకొనుదు రయ్యొ

ఇంతకంటెను నీచత యెందుఁ గలదు
అంతకంటెను నైచ్య మన్యంబు గలదు

అడ్డబొట్టును ద్వేషించు నడ్డబొట్టు
నిలువుబొట్టును ద్వేషించు నిలువుబొట్టు
ముఖముననుబూది పైనూర్ధ్వపుండ్ర మిడెడు
వింతమెకములు కొన్నియీవిపులఁ గలవు
వీరశైవులకును బూది విహితమగును
విష్ణుభక్తులు నామంబు విధిధరింప
ఉభయభ్రష్టులు రెంటిని నూనుచుంద్రు
మనకుఁ బ్రత్యక్షశత్రులై మలయుచున్న
వారితోడుత స్నేహంబు వలయునంట
వారిలో వారె కలహింపవలయు నంట
కంటివే గద యిదియేమి కడుపుమంట

బ్రాహ్మణుల మనువారెంతబవిసియూఁటి
పోయిరో కంటివే తల్లి పూర్ణముగను

తాము చెడుటయె కాదన్న తక్కుజాతి
వారలంగూడఁ జెఱిచిరి పతితు లగుచు

శిరము చెడెనేని మేనెల్లఁ జెడుట యరుదె

అన్యవిద్వేష మేమత మభిమతింప
దమ్మ! తద్దుర్గుణమ్ము హేయమ్ము గాన

మతము భేదింప విద్వేషమతినిఁ జూచు
వానికంటెను మాలండు వసుధ లేఁడు
కర్మచండాలుకంటెను ఘనతగల్గు
జాతిచండాలుఁ డెంతో ప్రశస్తతముఁడు
నేను ముఖమునఁ బెట్టిననిలువుబొట్టు
కాలకింకరు కేలిత్రిశూలముగను
దోఁచునో యేమొ వానికందోయి కకట
దానఁ బూని యసూయను దాశరథికి
భిక్ష యిడుదాతలకు నొక్కవిప్రకులుఁడు
దుష్టబోధనమును జేసె దోష మనక
రాముకార్యమునకు నంతరాయములను
గూర్చుఖరశీలు నేనునుకొనఁగవలయు
కారణము లేక రామునికార్యమునకు
విఘ్న మొనరించె నెంతదుర్బుద్ధి యైన
ఇంతయును బొట్టువిద్వేష మెంచి చూడ్డు
కలహములుగల్గుఁదక్కినకులజులందు
వాని కేమైన నన్యనిదాన ముండుఁ
గాని యింతటినీచులు గలుగఁబోరు.
తాను బెట్టకమానిన మానుఁ గాక
పెట్టువారల నిటునష్టపెట్టువాఁడు
బ్రాహ్మణులయందె తక్కినజాతి లేఁడు.

రూప్యములు నాలుగిమ్మన గొప్యముగను
పైఁడి సవరము చిప్పలో వైచె వేశ్య
కులము గొప్పయొ గొప్పయో గుణము చెపుమ
పాలవారాశిఁ బుట్టదే హాలహాలము
పలుగురాల గనిం బుట్టు వజ్రమణులు
ఎవ్వరైనను నీమత మేది యనిన
భక్తిమత మని చెప్పుమీ భయము లేక

ఎవ్వరేమైన ననుకొన నిమ్ము తల్లి!
తప్పు లెంచఁడు సుజ్ఞాని మెప్పు పలుకు
ద్వైతమా యని యెవఁడైనఁ బ్రశ్న సేయ
నేమిటో యది నేనేమి యెఱుఁగ ననుము.

అంబ! రో! విశిష్టాద్వైతివా యటన్న
నేమిటో యది నేనేమి యెఱుఁగ ననుము.

నీది యద్వైతమా యని నిన్ను నడుగ
నేమిటో యది నేనేమి యెఱుఁగ ననుము

అర్థ మెఱుఁగని పేర్లు నీ వాడవలదు
తత్త్వ మెఱుఁగని విషయంబుఁ దలఁపవలదు

ఎవ్వరైనను నీగురు వెవ్వఁ డనిన
శ్రీరమాకాంతుఁడే యని చెప్పవమ్మ

హరికి గురునకు నంతర మరసి కనఁడు
సాధుచరితుండు భక్తుండు సాధుచరిత

వారు పూజ్యులె? పూజ్యులే వీర? లనుచు
నామములు చెప్పి నిన్నుఁ బ్రశ్నంబుసేయ
నందఱును నాకుఁ బూజ్యులే యనఁ గదమ్మ

భర్త యొక్కఁడే తక్కుఁరు బంధుజనులు
భర్తవరునకు మఱి పతివ్రతకుఁ గాన
నెల్లరును మాన్యులే యనినఁ దప్పేమి గలదు?

నీకుఁ బతిభక్తి యెంతేని నివ్వటిలినఁ
బరుల నెల్లర దూషింప వలయు నొక్కొ
ఎట్లో నీభర్తయును నీకు నట్లు గాదె
పరసతీమణులకు వారి భర్త లనని
ఎల్లదేశంబులం గల నింతు లెల్ల
నీదుభర్తనె తమపతిగాఁ దలంప
వలయునే చెప్పుమా నీదు భావవిధము.
రామచంద్రపరబ్రహ్మమే మదీయ
పరమదైవత మంచును బలుక వమ్మ
ఆయనయె పరతత్త్వమం చాడవమ్మ
త్రోవ యడిగిన నిష్కామ సేవ యనుము
ఏమి ఫల మన్న భగవంతుకృపయె యనుము.
నరుఁడు గుహుఁడును శబరియు నారదుండు
వ్యాస శుక భీష్మ దాల్భ్య రుక్మాంగ దాని
లాత్మజ ద్రుపదాత్మజా తాద్రిజలును

ధ్రువ విభీషణ శౌనకోద్ధవులు శివుఁడు
ద్వైతులా వీరు గాక యద్వైతు లొక్కొ
యట్లు గాకయును మఱి యొండో యనఁగఁ గలదె
దీర్పుమీ తల్లి నాదుసందియము దీని

పావనంబైన భక్తిప్రాబల్యమునను
వారలును గారె యుత్తమభాగవతులు

బూదిపూసిరో గా కూర్ధ్వపుండ్రములనె
దిద్దిరో చెప్పఁగలవె యాసుద్ది కొంత
కాటులాడిరె కుక్కలకరణి వీరు

వారిమార్గంబునం జనవచ్చు మనము
జాడగనిపొమ్ము యిట్టటు చూడవలదు
అజ్ఞు లైనవార లేమైన ననఁగ నిమ్ము.
పర మొసంగెడిదేవత పర మొసంగు
క్షుద్ర దేవత లిత్తురుక్షుద్రఫలము

సత్తమోత్తము భజియింప నుల్ల మలర
సత్తమోత్తమమార్గంబె యుగ్గడింతు

## మతత్రయము.

కరుణ, శక్తియు, జ్ఞానమ్మ పరఁగుమూఁడు
గుణములుండును భగవంతుఁ గూడి యెప్పుడు
పరమ కరుణాళుఁడును దీనపక్షపాతి
భక్తవత్సలుఁ డనుచును భక్తవరులు

గొలుచుచుందురు భగవంతుఁ గూర్మి మీఱ.
సర్వశక్తియుతుండు నసాధ్య కార్య
ఘటకుఁడును భూరిమహిముఁ డీకరణి యోగి
వరులు భజియించుచుందురు పరమపురుషు
జ్ఞానపూర్ణుండు సర్వవిజ్ఞానమయుఁడు
జ్ఞానరూపుఁడు మఱియును జ్ఞానగుణుఁడ
టంచు ధ్యానింత్రు జ్ఞాను లాయపరిమేయు
ఇంతె భేదంబె గాక వేఱేది లేదు
కాన భక్తిమతంబని జ్ఞానమతము
యోగమత మని పిలుచుట యొప్పుఁగాదె
మానెడినిగాదె కలహ మిమ్మాడ్కిఁ బిలువ
తల్లి! యేదేదా యప్రస్తుతంబు వదరి
నాఁడ ధోరణి సైరింపు నాదుతప్పు.

## —చెట్టుముందా? విత్తుముందా.—

నీకుఁ గారణ మయ్యెను నీదుతండ్రి
యాయనకుఁ గారణం బయ్యె నతనితండ్రి
ఇట్లు హేతుపరంపర నెంచితేని
కారణం బెది లేనట్టి కారణంబు
కలదటంచును నమ్మంగవలసి వచ్చు
నట్లు గాకున్న ననవస్థ ప్రాప్త మగును
కలదా యొక్కొక్కజీవికిఁ గారణంబు
వేఱువేఱుగ నటుగాక విశ్వమునకు

నెల్లఁ గారణ మొక్కఁడా యెంచిచూడ
ననుచు యోజింప నొక్కఁడే యనఁగవలయుఁ
బెక్కు రైనను గలుగును భిన్నవిధులు
ఐకమత్యంబు గుదుర దావంత యైన
సామరస్యంబు మొదలంట సమసిపోవు.

## సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వ సర్వవ్యాపకత్త్వములు.

ఇప్పు డెల్లెడ శాసనం బొకతవిధము
కాన నొక్కండె కలఁడమ్మ కర్తగాఁగ
జ్ఞాన మెల్లెడఁ గాంచుట జంతులందు
నింతయును నిర్వహింపంగ నేకరీతి
జ్ఞాన మావశ్యకం బౌట జ్ఞాననిధిగ
నతనిఁ బల్కిరి తత్త్వజ్ఞు లైనవారు.

ఆదికర్తయె సర్వజ్ఞుఁ డయ్యె నిట్లు
అఖిలమును నొక్క శాసనంబందు నిలుప
శక్తివలయుటచే సర్వశక్తుఁ డనిరి
పెక్కువిధములశక్తులు వెలయుచుంట.
అయిన నొకశక్తియే యిట్లు నైకగతులఁ
బరిణమించెడి నని యెంచు భావమందు

కరుణ లేనట్టి క్రూరుండు కఠినచిత్తుఁ
డేలికగ నుండ నర్హుఁడే యెందు నైన

శక్తియును జ్ఞానమును దయాశాలిగాని
వాని మఱియంత క్రూరాత్ముఁగా నొనర్చు
జ్ఞానశక్తు లపారంబు లైనయట్లు
దయకు నంతంబు లేదమ్మ దైవమందు.

నిమిషనిమిషంబునకు నెన్నొ నేరములను
వరుసఁ జేయుచు నుండెడివార మమ్మ
పాహి దేవ క్షమస్వ మాఱుపలుకెగాక
ఇతరశక్తులతోఁ బనియేమి మనకు?

అట్లు దేవునిఁ గరణాళుఁ డనిరి బుధులు

కానవచ్చుచునున్న దాకాశమాది
యైన నంతంబునైనను గానరాక
అట్టిచో నొక్కచోటనే యాతఁ డున్నఁ
దక్కుచోటుల నెవ్వరు తనరువారు?
ఆతఁ డొక్కండె కాక లేఁ డన్యుఁ డెవఁడు
కాన నతఁడు సర్వవ్యాపిగాఁగఁ గనిరి

ఆది యిది, మధ్య మిది, యిది యంత్య మనుచు
ననఁగ రాకుంట నాతఁ డనంతుఁ డయ్యె

కాన నాతఁడె రక్షక ఖ్యాతిగాంచె

వాఁడె సర్వంబు పాలించువాఁడు నయ్యె
వాఁడె సంహారకర్తయై వఱలుచుండు

వివిధరూపముల్ జగమున విస్తరిల్లు
నున్నవస్తువు సత్యంబు నొకటె గాన
నన్నిరూపు లాయనరూపు లనఁగఁ బడియె
స్త్రీనపుంసకపురుషమూర్తియునుఁ గాఁడు
తిర్యగమరనరాదిమూర్తియును గాఁడు
తలఁచినప్పు డాకాశంబు దానె యగును
ఎట్టియాకారమైనఁ దా నెత్తుచుండు
రూఢిగా లేదు నిర్ణీతరూప మొండు
కాన నాతండు దా నిరాకారుఁ డనిరి.

నిటియావిరి పొగయయి నీళ్లు నగుచు
మంచుగడ్డగ నగుచుఁ గాన్పించుఁ గాదె
నీటియావిరి కెయ్యది నిజము రూపు?
పలుకనేర్తువె రూపంబు జలదమునకు?
గాలికిని నీటికిని రూపు కలదె చెపుము
అంతయే కాని శూన్యమఁ-చింత విడువు.

## సచ్చిదానందస్వరూపత్వము.

అమ్మ! యాతఁ డవాప్తసమస్తకాముఁ
డగుట శోకంబు మోహంబు నందకుంట
సంతతానందపూర్ణుఁడై జరుగుకతనఁ
దనదుభక్తుల కానందదాత గాన
నాతఁ డానందరూపుఁడం చనిరి బుధులు.

శాశ్వతంబుగ నుండుట సత్తునయ్యె
జిత్తు నయ్యెను జ్ఞానవిశేషమహిమ
సచ్చిదానందుఁ డిట్లయ్యె జనని! విభుఁడు.

జ్ఞానబలములు క్రియయు నానందగుణము
నాదిగాఁ బెక్కు లుండుఁ గల్యాణగుణము
లెప్పుడేనియు నెదియేని హేయగుణము
పరఁగ దాతనియందును బ్రాకృతంబు
లట్టులగుటను నిర్గుణుం డందు రతని
సత్యసంకల్పుఁడును మఱి సత్యకాముఁ
డనుచు శ్రుతి మొఱవెట్టుట ఖ్యాతిగాదె
కాన గుణశూన్యుఁ డనుమాట కల్లమాట

ఈశ్వరుం డుంటయే సత్యమేనితల్లి!
గుణము లుంటయు సత్యంబ; గుణములేక
ద్రవ్య ముండదు ద్రవ్యంబు దనరకుండ
గుణము నుండ దభేదంబు గుణము గుణియు
నిర్గుణం బైనవస్తువే నివ్వటిలదు
తలఁపనేర్తె తెలుపు పదార్థంబు విడిచి?
తలఁపఁ గలవేమొ పాలను తెలుపు విడిచి?
సగుణనిర్గుణభేదంబు స్వామియందుఁ
బలుకువారలు మతిలేనివార లమ్మ
కాన మనవేల్పు సద్గుణాకవితుఁ డమ్మ!

అమ్మ నీ విప్పు డొకప్రశ్న మడుగవచ్చు
నాయనకుఁ బేరు లేదె యేమైన ననుచు

సృష్టి స్థితియును మఱియు సంహృతియుఁ జలుపు
గానఁ బ్రథమాభిధాన మకారమయ్యె
దాని కాయర్థములకల్మి మాననీయ
ఆదిమాకార మాతండె యైనయట్లు
ఆదివర్ణంబు నది కాదె యక్షరముల
ఆతఁడే భూతకోటియై యమరునట్లు
ఆయకారంబె సర్వశబ్దాళి యయ్యె

పైఁడి యొక్కటె కంటెయు బాజుబందు
కడియమును గంటసరి యయి క్రాలినట్లు
మట్టియొక్కటె బానయుఁ జట్టి పిడుత
కుండ మూకుడు నైనట్లు గుణగణాఢ్య
అన్ని యాకారములు దాల్చునతఁడునతఁడె
స్వర్ణమును మట్టి యీరెండు సత్యమమ్మ
వానివైన వికారముల్ వస్తుతతుల
పేరు రూపమనిత్యమై వెలయునట్లు
నిఖిలవస్తుల పేరు లనిత్యములగుఁ
గారణంబైనయీశుండు కల్లగాఁడు
అట్టులే రూపములు నిత్యములు గావు
అవియుఁ బ్రకృతివికారంబు లగుటఁ జేసి

శబ్దముల నెల్ల శోధించి చక్కఁ జూడ
మొదలివర్ణమకారమై తుద మకార
మగుచు నడుమ నుకారంబు నగును గనఁగ

కంఠమందును బుట్టు నకార మన్న
మోవియందు మకారంబుఁ బుట్టుచుండు
రెంటినడుమ నుకారంబు క్రీడ సలుపు

పుట్టె ననఁగను గ్రొత్తగాఁ బుట్టదన్న
ఆయకారంబె పరిణామమందు నట్లు
మూఁడు కలిసిన నోమ్మని పూర్ణ మయ్యె

అదియె వాచక మన్న బ్రహ్మంబునకును
వాచ్యవాచకముల లేదు వాసి లవము
సర్వవిధముల రెండును సమముగాన

వాచకం బనఁ బేరండ్రు వసుధలోన
వాచ్య మన నది తెలిపెడివస్తు వగును.

వాచకం బైనయీప్రణవంబునకును
వాచ్యమై యొప్పు నాభగవంతునకును
భేద మేమియు లేదన్న విశదముగను

ప్రణవమునకును నర్థంబు స్పష్టపడిన
దేవుగుణముల నన్నిటిఁ దెలియవచ్చు
రామనామమాహాత్మ్య మన్ గ్రంథమందుఁ

దీనివిధమును దెలిపితిఁ దెలిసికొనుము
సలుప నేటికిఁ జర్వితచర్వణంబు
ప్రణవమునఁ గల్గునర్థంబె స్పష్టముగను
నవగతంబగు నారాయణాఖ్యఁ గాన
నదియె భగవంతు నభిధాన మనియె శ్రుతులు

నామముల కన్నిటికి జన్మభూమి యతఁడె
కాల నేపేరులైన శ్రీకాంతునందె
యన్వయించుచునుండు నోయంబ వింటె
కానఁ బేరులకై యేల కలహమాడ
అవియెగౌణంబులగుచుండు నన్యులందు.

మతవిభేదంబులం జిక్కి మాఱియవలదు
ఉన్నతత్త్వంబుచెప్పెద నొందువినుము
ప్రకృతిపరిణామ మౌశరీరంబు నెపుడు
జడమటంచు నెఱుంగుమీ శవముఁ జూచి
కాన దానికి సుఖము దుఃఖంబు లేదు.

నాదుశునకం బటన్న శునకము నేను
నొక్కటగుదుమె సంబంధ మొండెగాక
నాదుమేనన్న నిట్టులే-కాదు నేను
మేను నొక్కటి-దెలియుమీ దీని నీవు
చక్కఁగా నిది సంబంధషష్ఠి యనుచు

భగవదంశంబ వగుచును బరఁగునీవు

సచ్చిదానందరూపివై జరగుకతన
నాఁకలియు, దప్పి, మరణంబు, శోక, జరలు
కలిగె నమ్ముము దేహసాంగత్యమునను
నిక్కముగ లేదె నీకందు నొక్కటైన.
తన్మయత్వంబున న్నీవు తనరుచుంట
నేను చేసెడిచేష్టల నేను జేయు
చున్నదాన నటంచును నుల్లమందుఁ
దలంచుచుండుట నీకవి దాపరించెఁ
దనువులను దాల్చుచుండెడిదాఁక నీకుఁ
బోదుపోదమ్మ యీకష్టపుంజ మెపుడు
నీదురూపంబుఁ గనవచ్చు నీవు శాస్త్ర
పద్ధతిని నీకు యోగ మభ్యాసపడిన
నాత్మ నవలోకనముసేయ నాసపడిన
నారమేశునికరుణ యావంతయున్న.
కాన నీయున్కి సత్యంబు కలికిమిన్న
నీవు పడియెడితాపంబు నీకె తెలియు
కల్లయనుదువా నిజమందొ కపటమనుదొ
దుష్టసంగతిఁ గీడులు దొలఁగిచనుసె
సాధుసాంగత్యమునఁ గాక చతురబుద్ధి
ప్రకృతిసాంగత్యమును నీవు పాయుదనుక
నీకు సౌఖ్యానుభావంబు నిందుసున్న.

## బంధమోక్షనిదానము.

అది దొలంగుట యెట్లని యడిగితేని
తెలియఁ జెప్పెద వినుము తద్విధము నీకు

తల్లి! నీవెంతొ దయ గలదాన వయ్యు
నీదుపతి సర్వకార్యాళి నిపుణుఁ డయ్యు
నీదుపుత్త్రుండు చెడనాడి నిన్నుఁ దండ్రి
వేశ్యవలఁ జిక్కి మిమ్ము వీడి చనిన
హేతు వేమందువో నీవె యెఱుకపఱుపు
ప్రేమ తక్కువ మీయందు, వేశ్యయందుఁ
గామ మెక్కువ యాటయే కాదె చెపుము

అట్లు జీవుండు భగవంతునందు భక్తి
వదలి కామంబుబలమునఁ బ్రకృతిబద్ధుఁ
డగుటచేఁ జిక్కె సంసారమందుఁ దల్లి!

పడుపుఁజెలిపెట్టుకష్టముల్ పడఁగఁ బడఁగఁ
గడకు విసుఁగెత్తి దానిసాంగత్యమునను
చక్రవర్తిసుతుండవు చావ నేల?
మాయలాఁడివలం జిక్కి మాను మనుచుఁ
బుణ్యుఁడొక్కండు మీపెంపు బోధసేయు
మరల మీయందుఁ బోనిచ్చు మనసు నతఁడు.

మరల మిమ్మాశ్రయింపఁజే కరము భక్తి?
చేయునా వాఁడు మఱిదుష్టచేష్టలేమి?

మీరు రక్షించువిధమును మీగుణాళి
యెఱిఁగి యాతండు భక్తిమై నేగుదెంచి
తల్లి! నేఁ దప్పుచేసితి దయను బ్రోవు
కాముకుఁడ మూఢచిత్తుఁడఁ గర్కశుండ
నేఁ గృతఘ్నుండఁ జెడినాఁడ నిక్కువముగఁ
గరుణ రక్షింపు మనుచును గంటినీరు
కాఱ నీకాళ్లఁ బడినంతఁ గడకుఁద్రోచి
వైచెదవె నీవు క్షమియింపవా వచింపు

నీవు క్షమియించుటే కాదు నీదుపతికి
వానిపక్షంబునను బల్కి వానిఁ జేరఁ
దీయఁ బూనవె సత్యంబు దెలియఁ జెపుము

నీవు నట్టులె చేసిన నిశ్చయముగఁ
బాయఁ గలవమ్మ సంసారబంధ మెల్ల
తల్లిదండ్రులపొదిఁగిటి పిల్లవోలె
ననుభవింతువు మోక్షసౌఖ్యంబు సతము

విటుఁడు తనుఁ బాయఁ దలఁచినకిటుకు దెలియ
వేశ్య మిక్కిలి చిక్కులఁ బెట్టు నతని
దన్నుఁ బాయకయుండ బంధములఁ గొల్పు

తన్ను నీవు నుపేక్షింపఁ దలఁచినంత
నట్లె ప్రకృతియు నిన్ను నిక్కట్లఁ బెట్టు
తల్లిదండ్రులు సదయహృదయులు గాన

సుతుఁడు నిర్వేదపడియెడిచొప్పు దెలిసి
యాతఁ డెఱుఁగంగరానిరహస్యసరణి
వానియుద్యమమునఁ దోడుపడెడికరణిఁ
బ్రకృతిసాంగత్యమును నీవు పాయఁ దలఁచి
శక్తిలేమిని మిక్కిలి జాలిపడుచుఁ
దమ్ము వంచనలేనిమనమ్ముతోడఁ
దలఁచుచుండుట తలపోసి దయ చిగుర్ప
దాని వేగంబు క్రమముగాఁ దగ్గిపోవఁ
జేయుచుందురు నిన్ జేరఁదీయఁ గోరి
జానకీరామచంద్రులు సంతతంబు

తల్లిదండ్రులపై భక్తి పెల్లుగాఁగఁ
బ్రకృతిబంధంబు క్రమముగా వికల మగును
దాశరథి తండ్రి సీతమ్మ తల్లి మనకు
వీరి మించినవారలు వేరు లేరు

వారిపాదములం బడి వాయి యెండ
నేడ్వ మోతల్లి బిగ్గ గొంతెత్తి నీవు
పదములు విదిర్చినను నీవు పట్టువిడకు
కోపగించిన నీవేమి కుతిలపడకు
కొట్టినను నీవు విడువకు గట్టిపట్టు
వారె పరితాపపడుచు నావలను నిన్ను
నెత్తి ముద్దాడి ఱొమ్ముల కొత్తికొనుచుఁ
గరము వాత్సల్యమున నిన్నుఁ గాతురమ్మ

కన్నగతుల బరీక్షించికాని నిన్నుఁ
జేరఁదీయుదు జడియకు శిషులకును
ఏల యటులంటివేని నీహృదయమందు
వేశ్యపైఁ బ్రాసెనో లేదొ ప్రేమఁ గనఁగఁ
దమ్ము నేపూత్రమును నీవు నమ్మినావొ
తెలియుకోరిక నట్టులు సలుపుచుంద్రు

ఒక్కకాల్ లంజయింట వేరొక్కకాలు
నీగృహంబున నుంచెడి నీతనూజు
నీవు నమ్ముదువా వాఁడు నిర్మలుఁడని?
మరలఁ జెడిపోనఁ డంచును మానసమున.

అమ్మ! నీయొద్దనుండియు నంతరంగ
మందు వేశ్యను స్మరియించునట్టివాని
చీఁకటైనను లంజను జేరువాని
నీవు తలఁతువె చెప్పుమా నిర్మలుఁ డని

అటులె ప్రాకృతములయందు నంతొ యింతొ
మనసు పోనిచ్చువాఁడును గనఁడు ముక్తి
భక్తి యెప్పు డనన్యమై వలయు నుండ
దానఁ ద్రుంపుము ప్రకృతిబంధముల నెల్లఁ
బ్రకృతిబంధంబు లవియెట్లు పాయు ననుచుఁ
బల్కెదవయేని వినుము తత్పద్ధతులను
ఎంతజతనంబుఁ జేసితి వేని యవియుఁ

దొలఁగిపోవమ్మ దైవంబు తోడుపడక
విఘ్నబాహుళ్యమునఁ గృతి విఘ్నమగును
గనుక హరిభక్తి ప్రాపుగాఁ గొనితివేని
సకలబంధంబులను నది సమయఁజేయు
నీవు కష్టింపఁబనిలేదు నిక్కువంబు
భక్తునకుఁ బారతంత్ర్యంబె పరమశక్తి
ముఖ్యసాధన మంజలిముద్ర సుమ్ము
తాను గర్తగ నెంచి స్వాతంత్ర్య మూని
స్వప్రయత్నంబుసేఁతయే పరమవైరి.

ప్రకృతిబంధంబు లంచును బలికితీవు
ప్రకృతి యన నేమి? దానితత్త్వం బదెద్ది?
బంధ మెవనికి? నది యేల ప్రాప్త మయ్యె?
దానిఁ దొలఁగించుమార్గ మేదైనఁ గలదె?
మనము తొలఁగించుకొన శక్యమా? మఱెవ్వ
రెవ్వరైన నున్నారె తొలఁగింప నైన వారు?
దీని తెలిఁగంతయును విశదీకరింపు
మనినఁ దనకూర్మితనయ కిట్లనియెఁ దండ్రి.

## తత్త్వము.

తత్తు త్వమ్మను రెండుపదంబు లుండుఁ
దత్త్వమనుదాన; వానియర్థంబు వినుము.
తత్తనఁగ 'నద్ది' యంచు నర్థంబుపరఁగు

అట్టి దిట్టిది యని చెప్ప నలవిగామిఁ
దత్తటంచును బలికిరి తత్త్వవిదులు;

తత్తనఁగ నీశ్వరుండగుఁ ద్వమ్ము నీవు
తత్తునకు వెండి నీవగుత్వమ్మునకును
గలుగుసంబంధమును జక్కఁ దెలియు టగును
నవనిఁ దత్త్వం బెఱుంగుట యనఁగ వింటె
వాస్తవార్థం బటండ్రు తత్త్వం బనంగ
అయ్య! యూరైనఁ బేరైన ననక నీవు
తత్తటంటివి పలుకుమిా దాని తెఱఁగు
పురుషుఁడో స్త్రీయొ గాక నపుంసకుండో
అమరుఁడో మానవుండో తిర్యక్కొ చెపుమ
ఎందు వసియించు? నాకృతి యొద్ది దాల్చుఁ?
గానఁగా వచ్చునే మనకన్నులకును?
అనుచుఁ బ్రశ్నించుతనయుకు ననియెఁ దండ్రి.

## ఈశ్వరతత్త్వము.

కారణము లేనిహేతువు కలదటంచు
మున్ను పలికితి నున్నదే యుల్లమందు
స్త్రీనపుంసకపురుషమూర్తియును గాఁడు
తిర్యగమరనరాదిమూర్తియునుఁ గాఁడు.
నింగి యెబ్బంగి సర్వత్ర నిండియుండు
నట్లె యాతఁడు నెల్లచో నమరియుండు

ఇందుఁ గలఁ డందు లేఁడని యేకకాల
మందు నుండును వేఱొక్కయెడనునందు
నుండఁ డనుమాట లేదమ్మ యువతిమిన్న!

## సగుణసాకారలక్షణము.

కలికి! సాకారుఁడును నిరాకారుఁ డగుట
నుభయలింగాఖ్యుఁ డగుచుఁ దా నొప్పుచుండు
సాకృతి యటంచు మఱియునిరాకృతియని
భేద మాడెడివారలు వెఱ్ఱివారు
అట్టిభేదంబు భగవంతునందు లేదు.
వ్యావహారికముగ మన మాడుటొకటె.

సృష్టిమొదలగు కార్యముల్ చేయువాఁడ
టంచుఁ దలఁచెడిసమయంబునందు మనము
ఆడుచుందుము సాకారుఁ డనుచు నీశు
సగుణుఁ డనుచును గార్యవశమునఁ జేసి.

ప్రాగవస్థఁ దలంచెడిపట్టునందు
గరిత! నిర్గుణుఁడని నిరాకారుఁ డనుచు
మనము వచియింతు మంతియ మంజువాణి!

శుద్ధ మగునావిరికి రూపసిద్ధిగలదె
గ్రీష్మమునయందు సూర్యునికిరణపాళి
నబ్ధిజలములు నావిరి యగుట లేదె
కానవచ్చునె యొక్కయాకారమునను?

జలదసమయంబు ప్రాప్తించి చల్లగాలి
సోఁకఁ గార్మబ్బు లగుచును గానఁబడదె?
అటులె భక్తులభక్తియుఁ జిటికలోన
సాకృతి నొనర్చు భగవంతు సదయు వారిని
వారు తనరూపు గానఁగఁ గోరుకతన.

గాలికి నదేని యొక్కయాకార మున్నె?
నీళ్ల కున్నదె యాకృతి నిజము చెపుమ?
ఇవి నిరాకారములు గావె యెఱుఁగఁజెపుమ?
సాకృతికి భగవంతునిరాకృతికిని
దారతమ్యంబుఁ దెలియంగఁ దలఁచితేని
తెలియఁజెప్పెద వినవమ్మ తేటగాను

బంచభూతంబు లన్ని ప్రపంచమందుఁ
గల పదార్థంబులన్నిటఁ గలిసియుండు
నమ్మ! పంచీకరణమని యండ్రు దీని

ఇట్టి పంచీకరణముచే నెల్లయందు
నగ్ని వ్యాపించియుంట సత్యంబ గాదె
బండికట్టెలు. గొనిప్రొయ్యినిండఁగూరి
నంతమాత్రాన నందున్నయగ్ని మనకుఁ
బాకమును దీర్పసాహాయ్యపడునె చెపుమ

గలదుగా యగ్ని నిండారఁ గట్టెలందు
మోపుకట్టెలఁగొని మనదాపునందు

నిడినమాత్రానఁ జలిదీరునే వచింపు
భగ్గు మనిమండి సాకృతిఁ బ్రబలకున్న

ఆఁకటను నీవు తపియించునట్టి వేళఁ
గట్టెలం దున్న యానిరాకార మగ్నిఁ
గాంచు చేసెదో సాకృతిఁ గాంచుపడెదో

పెరుఁగునన్ దథ్యమే కద వెన్నయుంట
పదియు బానల పెరుఁగు నీపజ్జ నిడెదుఁ
జిలికి యద్దాని సాకృతి వెలికిఁ దెక.
పెట్టఁ గలవేమె యావంత వెన్న నాకు
సత్పుత్రుఁడు నీకుఁ బుట్ట నాశాస్య మిడుచు
గమ్మగాఁ దిందు నీకు శుభమ్ము గదుర
మంచిదీవన లిచ్చుచు మంజువాణి

ఇదియె, వాసి, సాకృతినిరాకృతుల కమ్మ
సాధ్య మెయ్యదో యది నీవు సలుపుమమ్మ!

సావయవుఁడగు లేకుండు నవయవములు
తాను స్వైరుండు సర్వస్వతంత్రుఁ డగుట

సర్వశక్తుండు గాన స్వేచ్ఛగఁ జరించుఁ,

గరియు సగుణుఁ డని నిరాకారుఁ డనుచు
ధ్యాన మొనరింప సాకారుఁ డగుచుఁ దోఁచు

నట్లు తోఁచెను గాదె ప్రహ్లాదునకును
బ్రహ్మాముఖులకుఁ బల్కె నభంబుపగిది
సృష్టి స్థితియును సంహృతి యెల్లవేళ
జరగుచునె యుండు నిలువ దేసమయమునను
విభునిగర్భంబులోపల విశ్వ మెల్లఁ
బ్రలయవేళను గానంగఁ బడదె మునికి?

కూర్కుచుండిన గుండియల్ కొట్టుకొనవె?
నాడులాడవె? నెత్తురుల్ నాళములను
బాఱకున్నవె మనసునేఁ? భద్రచరిత!
తద్విధంబునఁ దలఁపుమీ దైవమందు.

ప్రాకృతగుణంబు లేవియు లేకయుంట
హేయగుణరహితుండయి యొనఁగుచుంట
నిర్గుణుం డని వేదముల్ నిర్ణయించె

అవియె కల్యాణగుణుఁడని యాడుచుండు
సత్యసంకల్పుఁ డనుచును సత్యకాముఁ
డనుచు నీశుని వేదంబు లనఁగవినవొ?
కామ మన సద్గుణమ్మగుఁ గామ్యతఇతి
కామ మనియెడివ్యుత్పత్తి గలుగుకతన
సాకృతికిఁ గాక గుణములు నమరఁగలవె?
రంగులను గాంతువే పదార్థంబు లేక
కాన గుణములు గుణియును గలసియుండు.

ఎండ లేనట్టి సూర్యుండు నుండఁ గలఁడె
యుండునా యెండ రవిలేకయుండెనేని
కాన నీశుండు గుణియు సాకారుఁ డనుచుఁ
జక్కనమ్ముము వలవదు సందియంబు.

ఆడితేనియు దేవుఁ డున్నాఁడటంచు
వాఁడు సగుణుఁడ యని నమ్మవలసివచ్చు
నుండుటయు నొక్కగుణమయి యొప్పుగాన

నీవు గృహకృత్యములు మాని నిదురగొన్న
నీవు గుణహీనవౌదువే నిజము చెపుమ

ప్రలయమందును యోగనిద్రను వహించి
సృష్టి మొదలగుకార్యముల్ చేయకున్న
యవసరంబున నిర్గుణుం డయ్యె విభుఁడు
సలుపునప్పుడు సృష్ట్యాది సగుణుఁ డయ్యె
ఆకృతియె లే దటంచందు రజ్ఞజనులు
సాకృతియె యెప్పు డనువారు నట్టివారె.

సాకృతి కనిష్ఠ మని యందు రజ్ఞజనులు
గొంతకాలంబు సాకృతి కొంతకాల
మగు నిరాకృతి యనువారు నట్టివారె

జలధిలోనీరు మంచుగడ్డలవిధాన
సర్వకాలంబులఁ రెండు శాశ్వతంబు.

శంకరాచార్యమత మిది శంక వలదు
సంకరమతంబు వారిది సంశయింత్రు

అద్వితీయుండు మఱియొకఁ డంతవాఁడు
కానరాకుండుటం జేసి మాననీయ!

ఒక్కఁడే యిట్టివాఁ డన నొప్పఁగాదె
ఏకమేవాద్వితీయ మిట్లెఱుఁగు మమ్మ!

శాశ్వతుఁడు నిత్యుఁ డగుటను సత్తు నయ్యె
గుణము కాదొక్కొ నిత్యతఁ గూడియుంట

జ్ఞానగుణియును మఱియు జ్ఞానస్వరూపుఁ
డగుటఁ జిత్తయ్యె దీపంబునట్లు తల్లి!

తెలిసికొనుశక్తి గుణమయి వెలయదొక్కొ
అట్టులే సుమ యానంద మనెడి గుణము
అమ్మ! యానందితయు గుణ మగును గాదె

ఆకృతియుఁ గల్గి యుండుబ్రహ్మం బదెప్డు
సచ్చిదానందరూపుఁడన్ సంజ్ఞ యదియె

భగ మనఁగ నాఱుగుణములు; వానిఁ గలుగు
వాఁడె భగవంతుఁ డందురు ప్రాజ్ఞజనులు.
సప్రమాణంబుగా దీనిఁ జర్చ చేయు
వాఁడ వేఱొండుచో దీని వదలు మిపుడు.
ప్రస్తుతం బెంత యంతయె స్పష్టపఱుతు

సన్నిహితుఁ డగుదాఁక సాక్షాత్కరించి
నమ్ముమీ భగవంతుఁ డున్నాఁడటంచు;
నిత్యుఁ డజుఁ డనాదియు సత్యమూర్తి
కర్త, భర్తయు, ధర్తయు, హర్త, యతఁడె
జగములకు నెల్ల; బహువిధశక్తియుతుఁడు
జ్ఞాన మైశ్వర్యవీర్యముల్ శక్తి బలము
తేజ మిచ్ఛయు ననుగుణరాజి నలరు
నవ్యగుణములు జ్ఞాన మానందగుణము
నవియె యతనికి రూపమై యతిశయిల్లు.
సత్యసంకల్పుఁ డాతండు సత్యకాముఁ
డతులసౌశీల్య వాత్సల్యదానదయలు
నవియు నివియును వననేల యఖిలభద్ర
గుణములకు ఠావు; లేదు దుర్గుణ మొకండు.
పుట్టు వనునది లేకయుఁ బుట్టుచుండుఁ
దనదు సంకల్పబలమున ధరణియందు
బహువిధంబుల భక్తులవాంఛ దీర్ప
సంభవా మ్యాత్మమాయయా సాధులోక
రక్ష కనిపల్కెఁడే రమారమణుఁ డపుడు
సాధు లనఁగను భక్తులు చారుశీల!
తగ నజాయమానో బహుధా విజాయ
తే యటంచును శ్రుతియాడదే సుశీల!

సర్వ మెఱిఁగినవాఁడును, సర్వమందు
నుండువాఁడును, సర్వశక్తుండు గాన
మ్రొక్కువారల కెల్లను దిక్కు వాఁడె
దేవతలకు రాక్షసులకును దేవుఁ డతఁడె
రూపులేకయు బహువిధరూపి యతఁడె
ఖ్యాతుఁడును గాక బహువిధఖ్యాతుఁ డతఁడె
అన్నిరూపులు తనరూప మైనవాఁడు
అన్నిరూపులు తానయై యలరువాఁడు
అన్నిపేరులు తనపేరు లైనవాఁడు
చేతనాచేతనంబు లఁ ఖ్యాతి గన్న
యన్నియును దనతనువయి యమరువాఁడు
తను వటన్నను బోషణాధారణముల
కతఁడె యాధారమంచును నర్థమమ్మ
ప్రత్యగాత్మకు నాత్మయై పరఁగువాఁడు.

అమ్మ! శుద్ధాత్మనే ప్రత్యగాత్మ యండ్రు
జీవుఁ డన బుద్ధ్యహంకారచిత్తమనసు
లనఁగఁ బరఁగినయంతఃకరణచతుష్ట
యమును గూడినయట్టి బద్ధాత్మ యగును.
ఆత్మయె శరీరమెవనికో యనవె శ్రుతులు.

ప్రకృతికిని జీవు నిర్వఁ బట్టతండె
అవియు రెండు తదీయాంశ నుగుటఁ జేసి

అఖిలభూతంబులం దంతరాత్మ యతఁడె
సర్వలోకశరణ్యుండు సర్వదాత
ప్రకృతిజీవుల కీశుఁడై పరఁగువాఁడు
ప్రకృతిపురుషులయందుండువాఁడె యైన
వానికర్మాళు లంటవు వాని నొకటి;
కర్మఫలభోక్త దాఁగాని కారణమున.

ప్రేరకుండయ్యు సాక్షియై వెలయుచుండు
కనులు లేకుండియును వాఁడు కనుచునుండు
వేయుకన్నులతోడుత వెలయుచుండు

వీను లేవియు లేకయు వినుచునుండు
వేయి వీనులతోడుత విశదముగను

నడువఁ బదములు లేకయు నడచుచుండు
వేయుపదములు గలవాఁడు వినుతచరిత!
అణువుకంటెను నణువయ్యు నఖిలమందు
నిండియుండు; మహాత్ములై నెగడుచుండు
వానికంటె మహాత్తయి వఱలువాఁడు

భూతములలోన వెలుపలఁ బూర్ణుఁడయ్యు
వానిపైఁ బదియంగుళాల్ వ్యాప్తుఁడగును;

నిత్యులందును నిత్యుఁడై నెగడుచుండు
చేతనులకోటిలోపలఁ జేతనుండు

పెక్కులందును విలసిల్లు నొక్కఁ డగుచు
కోరువారికిఁ గామముల్ గూర్చుచుండు

మనసుకంటెను వేగాన మలయుచుండు
వానికంటె సమీపమౌ వస్తు వేది
యైనఁ గలుగదు మనకు యథార్థమస్తు
తన్ను స్మరియించువారికి దాపువాఁడు
తన్ను మఱచినవారికి దవ్వువాఁడు
మనము మఱచితిమేనియు మఱవఁ డతఁడు
మనల రక్షింపఁ దఱివేచి కనుచునుండు

ఎవ్వఁ డేపేరఁ బిలిచిన నేగుదెంచు
నెవ్వఁ డేది తలంచిన నిచ్చుచుండుఁ
దల్లి యగుచును దండ్రియై దాత యగుచుఁ
బుత్త్రుఁడై మొఱఁబాయనిమిత్త్రుఁ డగును
నిత్యగతియును, సాక్షియు, నిలువనీడ,
భర్తయగుచును రక్షించుఁ బ్రాణికోటిఁ
గారణములేక తనకుఁ దాఁ గలుగువాఁడు
అన్నిటికిఁ దానె కారణం బైనవాఁడు
కాలుసేతులతోడుతఁ గానవచ్చు
భక్తకోటికిఁ గార్యంబువడినయపుడు
భక్తకోటులు తన్ను నుపాస్తి చేయుఁ

పరమపదమున సాకృతిఁ బరఁగుచుండుఁ
బరమసౌశీల్యకారుణ్యగరిమఁ జేసి.
ఇట్టిది పరస్వరూపంబు నెల్లవేళఁ
గాంచుచుందురు సూరులు కడుముదమున
వీరె చూ నిత్యసూరులు వీర లెపుడు
రారు దగులరు ఘోరసంసారమందు
శ్రుతియుఁ బశ్యంతి సర్వదా సూరయ యని
యిట్టివశయున్కి ఘోషించు గట్టిగాను.
అటులె గాంతురు బద్ధాత్ములగుచు ఘోర
సంసరణమునఁ బడి చాల సంతపించి
హరికృపాలేశమున ముక్తులైనవారు
కాలుసేతులు లేక యాకాశమట్లు
నిండియుండును సర్వత్ర నిశ్చలముగ
అచలుఁ డాతండు చుమ్ము సమష్టిఁజూడ
కదలుచుండును వ్యష్టి యాకారములను.
మనము కదలక కూర్చున్నమాత్ర దేహ
మచలమైనను లోపల నట్టులున్నె!
సైవ్యూహుఁ డాతండు సుమ్ము విహారసరణి
వేఁడువారలవిన్నపాల్ వినఁడయేని
వారిఁ గావంగ వేగ మే తేరఁ జేని

మ్రొక్కువారల మ్రొక్కుల మురియఁడేని
దాసజనులను గానంగఁ దలఁపఁడేని
కోరువారలకోర్కులు గూర్పఁడేని
యతఁడు దేవుండె మొద్దువయ్యంబుగాక?
యిట్టివాఁ డుండియునులాభ మేమి ప్రజకు?

సూపుచేతను గుణముచే వ్యాపకుండు
భూతతతులందు లక్ష్మివిభుండు సుమ్ము.
అతనికరుణయె లక్ష్మి నా నతిశయిల్లు
శ్రీను హృదయస్థమగుటచే విభునురంబు
నందు నెవ్వేళ విలసిల్లు నమ్మ లక్ష్మి

కరుణ విడనాడ దెప్పుడేని హరిని గాన
లక్ష్మి యనపాయినియనిప ల్కఁగఁబడియె
ఈమె మొగసాలతెరయె ప్రకృతియుఁ జుమ్ము

విభునియట్టుల యీమె వ్యాపించియుండు
భూతతతులందు మణికాంతిపూరమట్లు
సూర్యునకు నెండ, శశికిని జ్యోత్స్న యట్టు
లమ్ముకుందునకును లక్ష్మియనుచుఁ దలఁపు

కరుణ గలవాని వేఁడినఁ గార్య మగును
గానఁ గొలువుము హరి రమాకాంతుఁ డనుచు

కరుణ లేనట్టివాఁ డెంతో కఠినుఁ డగుట
నట్టి రాక్షసు వేఁడిన నగునె శుభము
యుగళపూజయె సుమి యుత్తమోత్తమంబు.

మేలుకొన్నప్రభుఁ వేఁడ మేలు గలుగు
వ్రాల నిద్రాళుపదముల ఫలము గలదె?
అట్లె సాకారసగుణుని నర్చసేయు
గాసిపడఁబోకుమీ నిరాకారుఁ గూర్చి

వచ్చునది కల్ల దద్దాన హెచ్చుఫలము
క్లేశ మొక్కఁడె హెచ్చని కృష్ణుఁ డనియె

జీవతతులం దుపాస్తిని జేయువారు
చూపవే దేవ నీదివ్యరూప మనుచు
వేఁడుదురె కాని యింకేమి వేఁడఁబోరు
వారిప్రార్థన దీర్పంగవలయుఁ గాన
నాదిదేవుండు సాకారుఁ డగును సతము.

శంఖచక్రగదాదు లౌసాధనములఁ
గరములను దాల్చి కేయూరకటకహార
భూషితాంగుండు నగుచును బొలుచుచుండు
అమ్మ! పరవాసుదేవుఁ డీయనయె సుమ్ము.

తల్లి! భూషణములు నాయుధమ్ము లనిన
మనము దాల్చెడునట్టివం చనకు మమ్మ

ఆకృతులు దాల్చి భగవంతు నమలశక్తు
లతని సేవించుచుండును ననవరతము.

కౌస్తుభాకృతి జీవుండు కానవచ్చుఁ
బ్రకృతి శ్రీవత్సమగును, జక్రంబు మనసు
సాత్త్వికాహంకృతియె యయ్యె శంఖరవము
తామసాహంకృతియె శార్ఙ్గ ధనువు సుమ్ము
నందకాకృతి ధరియించు జ్ఞానశక్తి
దానిమొఱ యయి పొల్చు నజ్ఞానశక్తి
ఇంద్రియదశంబు శరరూప మొలమిఁ దాల్చు
బ్రస్ఫురా మహత్త్వ గదయయి యొప్పుమీఱు
స్థూలముల్ సూక్ష్మములు భూతపాళులెల్లఁ
దాల్చి వనమాలికాకృతిఁ దనరుచుండు
వేదమయుఁడన్న గరుడుండు విహగవిభుఁడు
నిన్ని యీరీతి హరిఁ గొల్చు నెల్లవేళఁ
గార్యములు దీర్చు శ్రీశుసంకల్ప మెఱిఁగి

జ్ఞాన తేజోబలైశ్వర్యశక్తివీర్య
ములన నీయాఱుశక్తులు వెలయుచుండు
నన్ను భగవంతునందు నక్లాటఁ గాదె
వెలయు భగవంతుఁ డనుపేర విశ్వవిభుఁడు

ఆఱుశక్తులు భగ మనుఖ్యాతిఁ దాల్చు
వానిఁ గలవాఁడె చూ భగవంతుఁ డనఁగ

హృదయపద్మంబునం దున్నయట్టివాని
సగుణు సాకారు నీశ్వరు స్వాంతసీమ
యోగులెల్ల రుపాసింత్రు యుక్తరీతి

అష్మో భజ సేవాయా మటన్నధాతు
భవము లగు భక్తి భజనము భగము భగుఁడు

భక్తి భజనము సేవ నాఁ బరిఢవిల్లు
భగుఁడు సేవింపఁ బడువాఁడు భగమునట్లె
సేవ సేయించుకొనుస్వామి శ్రేష్ఠుఁ డగును
సేవ సేయుచు నుండుదాసేరు కన్న

వేదముల భగుఁడనుపేరు వేయిచోట్లఁ
దెలుపఁబడె నుత్తమోత్తమదేవతగను
సకలశుభముల నిచ్చెడి స్వామియనుచు
కాన శ్రుతు లుదయించినకాలమందె
భక్తిమార్గంబుపుట్టెను బ్రజలకొఱకు.

పౌరుషేయముల్ కావమ్మ ప్రాఁబలుకులు
నీశ్వరుఁడువోలె నవియుండు నెల్లవేళ
నాదిమధ్యాంతములులేక యఖిలగతుల
సత్యసంకల్పుఁ డట బహుస్యామటంచు
వ్యష్టియు సమష్టి యైనట్టిసృష్టి చేయు
ఒక్కదీపంబునఁ బుట్టు పెక్కుదీప
కళికలో యన వ్యూహంబుగాఁగ నగును

అగుచుఁ బ్రద్యుమ్నుఁడుగ బ్రహ్మయందుఁజేరి
కలుగఁజేయును జగము; సంకర్షణుఁడుగ
నిలిచి శివునందు జగమెల్లఁ బొలియఁజేయు
తానె విష్ణుండు నగుచుఁ దన్మధ్యమందు
పాలనము చేయుచుండు బ్రపంచ మెల్ల
అట్లు గాకున్నఁ బెరవారి కలవి యగునె
పాలనోద్భవనాశముల్ వరఁగఁజేయ

అల్ల శ్రీవిష్ణుమూర్తియే యదనెఱింగి
యవతరించును రామకృష్ణాదినామ
ధేయములఁ దాల్చి భక్తులఁ దృప్తిపఱుప
ఖలుల దండించి ధర్మంబు నిలుపు కొఱకు
దానినే చుమ్మి విభవావతారమండ్రు

అల్ల విష్ణుఁ డంతర్యామి యగుచు నెల్ల
వ్యాపకుండగు నాకాశ మనఁగ వింటె.
అంతటఁ బోక భూతహృదంతరాళ
ములను వసియించి యీశ్వరమూర్తి యగుచు
నాత్మలకుఁ బ్రేరకుండును సాక్షియగుచుఁ
గర్మఫలముల నిచ్చుచుధర్మరీతి
జీవుఁ డెందేగుఁ దానును బోవు చటకు
వెంటనంటుచు విడ కెల్లవేళ నుండు.

నరకమున కేగుఁ దానును నరకమేగు

స్వర్గమున కేగఁ దానును స్వర్గ మరుగు
తానుఁ దోఁజొచ్చు నతఁడు గర్భానఁబడిన
ప్రేమనిధి గాన బిడ్డను విడువలేని
తల్లిదండ్రులవిధములఁ దవిలియుండు.

మనము కనలేము చుమి బుద్ధిమాంద్యముననుఁ
జ్ఞానచక్షుష్కు లిది గాంచఁ జాలియుంద్రు

ఇట్టిశక్తి యెసంగనియెల్లవారిఁ
బ్రోవ నర్చాస్వరూపమై పుట్టుధరణి
రంగనాథుండు కాంచీపురప్రభుండు
వేంకటేశుండు ఘటికాద్రివిభుఁడు మనల
నేలుదేవత యేకశిలేశ్వరుండు
నిట్టివర్చావతారము లెంచవశ్మ!

ఇదియచూ భక్తజనముల మదివిధంబు
భక్తి యనుమాట కర్థంబు పరమశీల
సేవయగుఁ గాన దానిని జేయువాఁడు
సేవ సేయించుకొనువాఁడు, సేవ, యిట్లు
భక్తిమార్గంబునకు మూఁడు వలయువిధిగ.

సేవ సేయించుకొనువానిఁ జెప్పినాఁడ
నింతదనుకను; జెప్పెద నింకనీఁద
సేవ చేసెడివానివిశేష మెల్ల.

## జీవతత్త్వము.

సేవచేయించుకొనువాఁడు దేవుఁ డగును
సేవచేసెడివారలు జీవులమ్మ
తనదుకాళ్లకుఁ దామ్రొక్కుకొనుటగాదు
జీవలక్షణమెఱిఁగింతుఁ జేతనుండు
మొదల నపహతపాప్ముండు, ముదిమి, చావు,
ఆఁకలియు డప్పి శోకంబు నంటులేక
యాశువలె జ్ఞాన మానందమే స్వరూప
మగుచు నణుమాత్రపరిమాణ మైనవాఁడు

సత్యసంకల్పుఁ డీతఁడు, సత్యకాముఁ
డీశ్వరుఁడు తనకాత్మగా నెసఁగువాఁడు
ఆయనయె తనస్వామిగా నలరువాఁడు
సంద్రమునఁ జేఁపవలెఁ, దనజననిపొదుగు
బుడుతఁ డననుండి ధారణపోషణముల
బరువు భగవంతుపై వైచి తిరుగువాఁడు

దీపమును బోలిగుణముచే వ్యాపకుండు
జీవుఁ డన్నిట; వేదముల్ చెప్పునిట్లు;
సత్యమును నిత్యుఁడును మఱి శాశ్వతుండు
దేహమునకంటెఁ బ్రాణంబు ధీ మనముల
కంటె, నింద్రియములకంటెఁ గరము భిన్నుఁ
డజుఁడు చావఁడు పుట్టఁడు, నగ్నిఁగాలఁ

డెంప నెండఁడు, కత్తుల హింసపడఁడు
వారిఁ దడియఁడు; కర్మాళిబద్ధుఁ డగును
బ్రకృతిసాంగత్యమునఁ జేసి సుకృతశీల!
పుట్టినట్టులు చచ్చినయట్టుదోఁచుఁ
దనువుతోఁ గూడి; నిజముగ జననమైన
మరణమైనను లేదెట్టి తరుణమందుఁ;

బట్టుటయు గిట్టుటయు దేహమునకె సుమ్ము
వెండ్రుకను గొన నొకపదివేలభాగ
ములుగఁ జీల్చిన నెంతౌనొ తెలియు మంత
మాత్రవాఁ డనుచును బరిమాణమందు.

హృదయకోశంబె జీవునిసదన మగును
అదియు స్వాంగుష్ఠమాత్రమై యమరి యుండు
నిండి తేజాన దాన జీవుండు నుండుఁ
గనుక నంగుష్ఠమాత్రుఁ డంచనియె శ్రుతులు
నిండియుండుట దానిలో నిబిడముగను.

ఈశ్వరునిపరిమాణ మంతే యటంచు
హృదయసద్మంబునం దుండునదనునందు.

ఒక్కవృక్షంబుపైఁ బక్షియుగ్మ; మందుఁ
బిప్పలిఫలంబుఁ దిను నొండు; వేఱొకండు
తినక యూరకయుండునం చనియె శ్రుతులు.

వృక్షమే మేను; దానిలోఁ బక్షియొకఁడు
ఫలముదిను జీవుఁడగును; దత్ఫలముఁగుడిచి
కర్మసంబద్ధుఁడై యుండు; ఖగమొకండు
ఫలము నంటనియది భగవంతుఁ డగును.
కర్మఫలమునె పిప్పలిగాఁ దలంపు
కర్మఫలకాంక్ష లేమిని గాయమందు
నీశుఁ డున్నను దద్దోష మొద్ది యేని
నతని నంటంగఁ జాల వోయమలచరిత
ఫలముభుజియించు కోరిక గలుగుకతన
పాపములు పుణ్యములు జీవు బాధపెట్టు.

ఎట్టికర్మంబు లొనరించు నట్టిఫలము
దినఁగఁజేయును జీవుని దేవుఁ డెపుడు

సాక్షిగా నుండు దాను నిస్సంగుఁ డగుచు
ప్రకృతిపరిణామ మహాశరీరంబు సేయు
కర్మముల నెల్లఁ దాఁ జేయుకరణిఁ దలఁచి
మేనితోఁ దన్మయత్వంబు మేకొనంగ
నబ్బుచుండును గష్టంబు లాత్మకెపుడు.

నీరునిండినపాత్రంబు నిప్పుమీఁదఁ
బెట్టినంతన నీళ్లును వేడిపడవె?
పాత్రసాంగత్యమునఁ గాదె వచ్చె నదియు.
దేహసాంగత్యమున నట్లె దేహి కబ్బు

సర్వవిధదుఃఖవితతులు శస్త్రచరిత.
వేఱుదేహంబు నేనను వేఱటన్న
భావ మెంతయు స్థిరపడఁ బాయువెతలు.
జీవకోటుల నలుదెగల్ చెలఁగుచుండు

నిత్యులగువారు వసియింత్రు నిత్యముగను
స్వామిసన్నిధిఁ గనులార స్వామిఁ గనుచు
స్వామికైంకర్యపరులయి-వైన తేయ
శేషముఖ్యులు నీతెగఁ జేరినారు

కర్మబంధంబులకు వీరు కట్టుపడరు
కర్మవశు లెప్పుడును గారు కార్య మున్న
నవతరింతురు భగవంతునాజ్ఞ ధాత్రి
జగమునందలిజనులను జక్కఁబఱుప
వీరలే నిత్యసూరులఁగ పేరివారు

మనవలెనె కర్మబద్ధులై మహిఁ జరించి
ప్రకృతివశు లయి మిక్కిలి బాధ లొంది
స్వామికరుణాకటాక్షవీక్షణముచేతఁ
బ్రకృతిబంధంబులన్నియుఁ బాసిపోవ
దివ్యవైకుంఠనగరిని దేవుఁ గొలిచి
విభుస్వరూపంబురూపంబు విభవగుణము
లనుభవించుచుఁ దనివార హర్షవార్ధి
మునిఁగి యోలాడి సంస్తుతిముఖరు లగుచు

మరల జన్మంబులకు రాక మలయుచుంద్రు
వీరలే చుమి ముక్తులఁ బేరివారు.

వసుధఁ గొందఱు బద్ధులఁ వారు గలరు
వీరు భగవంతునకుఁ జాల దూరగతులు.

కర్మవశమునఁ దమకును గలిగినట్టి
తనువులే తా మటంచును దలఁచి నమ్మి
స్వామి తమకు నొసంగినజ్ఞానశక్తి
అగ్నిధూమంబుచేఁ బోలె నావృతమయి
నన్యథాజ్ఞానమున నొండె నజ్ఞతాతి
శయముచే విపరీత మాజ్ఞానముననొ
మఱుఁగుపడిపోవ సత్యంబు మఱపుచెంది
విషయసుఖమె సుఖంబని వెఱ్ఱు లగుచుఁ
దలఁగఁ ద్రోచి వర్ణాశ్రమధర్మములను
స్వేచ్ఛఁ జరియించి కామంబుచేత ఘోర
నరకబాధలఁ గుడుచుచు మరల నవనిఁ
బుట్టుచును గిట్టుచును నిట్లు పొరలుచుంద్రు
ఘోరసంసార జంబాలకూపమందు.

వీరిలోఁ గొంద ఱీరీతి వెతలు గుడిచి
స్వామిసంకల్పబలమున జ్ఞాన మొదవ
వలదు నరకంబు స్వర్గంబు వలదు వలదు
చాలుఁ బాపముల్ పుణ్యము ల్చాలుఁ జాలు

క్రూరసంసారవారాశితీర మెట్లు
చేరువారమొ యని చింతచేసి చేసి
ముక్తిఁ గోరెడివారు ముముక్షు లైరి
ఈముముక్షువు లిరుతెగ లెట్టు లనిన
స్వప్రయత్నంబుచే భగవంతుఁ గనఁగ
శ్రమము పడుచుందు రోయమ్మ శక్తిఁగొలఁది
వీరలె యుపాసకు లనెడు పేరివారు
ఇట్టు సేయంగ శక్తిలేనట్టివాఁడు
దైవమా నేను దీనుండ ధర్మనిష్ఠ
జ్ఞాననిష్ఠయు లేనట్టి జడుఁడ భక్తి
సేయనేరను నేదియుఁ జేతగాదు.
అజ్ఞుఁడ నకించనుండను వ్యర్థజీవి
నిన్నుఁ దప్ప మఱెవ్వరి నే నెఱుంగ
నీవు దప్పఁగ గతియొండు నే నెఱుంగ.
సర్వలోకశరణ్య యోసదయహృదయ
తావకీనపదాంబుజాతముల వ్రాలి
నాఁడ శరణంచుఁ గావవే నాథ దేవ
యనుచు వేఁడి చలింపనిమనముతోడ
పరమవిశ్వాసయుక్తుఁడై భరముఫలము
స్వామిపై వెచు వీఁడె ప్రపన్నుఁ డనఁగ
మున్నె చెప్పితిఁ గేవలుఁడున్నవిధము
నాత్మనిష్ఠాగరిష్ఠుఁడై యంతమందుఁ

దన్నుఁ గనుచును బుట్టెడు ధరణి మరల
జీవులం దిట్టిభేదంబు చెలఁగుచుండు.

## ప్రకృతితత్త్వము.

ప్రకృతితత్త్వంబు వేఱొండు పరఁగుచుండు
నిత్యమై శుద్ధజడమయి నెగడు నదియు
భూతిశక్తి యాటం చపౌర్వ్బధ్నుఁ డనియె

సంతతవికార మద్దానిసహజగుణము
అదియు జీవాత్మసంగతి నగుచు నుండు

సహజముగ జడ మగుట స్వశక్తి లేదు
నినుము సూదంటురాయిచెన్నునఁ దలంప.

శుద్ధజీవుండు నేనియు శుద్ధప్రకృతి
యేని కానంగఁ బడ దెందు నిజ్జగమున

వీనికూడికచే నగు వివిధసృష్టి
ప్రకృతిపరిణామ మగు దేహపటల మెల్ల

దీనినే క్షేత్ర మందురు తెలియువారు
భూతములు నైదహంకారమును మహత్తు
(బుద్ధియిదియె) యవ్యక్తంబు శుద్ధచరిత!
పదునొకండింద్రియంబులు, వానిచేత
నెఱుఁగఁదగినవి యైదును నిచ్ఛ పగయు
సుఖము దుఃఖంబు ధృతియును సుమతి! వీని

సంఘ మిదియెల్ల క్షేత్రమన సంజ్ఞఁబరఁగు
సత్య మీమూఁడుతత్త్వముల్ శాస్త్రరీతి.

అయ్య! యీశ్వరుఁడొక్కఁడె యద్వితీయుఁ
డతఁడె సర్వత్ర వ్యాపించు నన్నివేళ
లందు నంచును బలికితి వాదియందుఁ;
బ్రకృతి యని జీవుఁ డని వెండి పలికితీవు

ఈశ్వరుం డెల్లచో రహియించెనేని
తావు చెప్పుము ప్రకృతియు జీవుఁ డుండ

ఈశ్వరునికంటె వేఱులా యివియు రెండు
సందియముఁ దీర్పవే యన్న జనకుఁ డనియె.

అమ్మ! రెండుస్వరంబులు హల్లొకండు
కలసి యీమూఁడు ప్రణవాఖ్యఁ బలుకఁబడదె

అక్షరాల్ మూఁడు నయ్యు నేకాక్షరంబు
ఓమ్మటంచును బలుకవే యువిద! శ్రుతులు

వాచకం బగు ప్రణవంబు వాచ్యమైన
బ్రహ్మమునకు నభేదంబుఁ బలుకు శ్రుతులె
స్వరములౌటను అ-ఉ నాయూలజాతి యొకటె
యన్యజాతి మకారంబు హల్లు గాన
మూఁడు నొకటిగ నెట్టులు చూడఁబడునొ
యట్లె యెంచు తత్త్వత్రయంబు నీవు

ఏక మనుటకు నర్థంబు నిదియె తల్లి!
కని 'అకార ఉకార మకార ఇతి' ని
అమ్మ! 'ఏకాక్షరం బ్రహ్మ' మనెడి శ్రుతిని
జక్కఁ శోధించినం దీఱు సందియంబు

జనని! నారాయణాఖ్యు నొక్కనినె పలికి
న ద్వితీయోస్తి కశ్చిత్తు నాఁగ శ్రుతియె
యద్వితీయపదార్థంబు నంతవాఁడు
వేఱె యెవ్వఁడు లేఁడని విశదపఱుచు

తత్త్వమసి యన్న నుడికిఁ దాత్పర్య మిదియె.
సూక్ష్మచిదచిద్విశిష్టుఁడై సొబగుమీఱు
నతఁడె నీవైతి వనుచును నర్థమన్న
సోహ మనుచోటఁ దాత్పర్య మిదియె తల్లి!
అంబ! బ్రహ్మోస్మి యన్న వ్యాహారమునకు
నదియె యర్థంబు సుమ సందియంబు వలదు.

శ్రుతులు ఘోషించు నిట్లు ప్రస్ఫుటము గాఁగ
పార్థసారథి యిట్టులే పలికినాఁడు
తనదుపురుషోత్తమత్వంబు ననెడిచోట,

హరిని సారథిగాఁ గొన్ననరుని తేరు
తేటతెల్లంబుగా దీనిఁ దెలియఁబలుకు:
జానకీరామలక్ష్మణుల్ కాననముల
సంచరించెడివేళనీ సరణిఁ జనిరి

ఆర్య! తొలుతను శంకరాచార్యవర్యుఁ
డనుచు బ్రహ్మాస్మి యనునుడి కర్థ మన్య
విధముగా, నిశ్చయార్థంబు వెండి తెలిసి
యవినయ మపనయ యనుచు ననియె విష్ణు
షట్పదీస్తోత్రమందు విస్పష్టఫణితి.

ఇంతకంటెఁ బ్రమాణమింకేదివలయు.
వలయు నేనియు నిను నీవ తలఁచి చూడు
ఆత్మయును దేహమును గూడి నైతి నీవు
నీ వాకర్తవా యిరువురో నిజము చెపుమ
అట్టులే యెంచు తత్త్వంబు లరయునపుడు
అనియె జీవు మమైవాంశ మనుచు హరియె
అంశ మనఁగ విశేషణం బంచు నెఱుఁగు
అర్కునకు రశ్మిపోలిక నావునకును
నావుతనమట్లు మాతృత్వ మట్లుమాత
కనుచుఁ దలఁపుము జీవు బ్రహ్మంబునకును
అట్టిగుణము విశేషణం బండ్రు బుధులు
అదియె యంశంబు నా బుధులాడినారు.
అనియె విష్ణుపురాణంబునందు వ్యాస
జనకుఁ డీజీవప్రకృతులు శౌరిశక్తు
లనుచు వానిని వేఱుగా నగునె తలఁప
శక్తిశక్తుల విడఁదీయు చందమున్నె
భాస్కరుని నెండ నీవు వేర్పఱుపఁగలవె

నిన్ను నెడఁబాసి యుండునే నీదుగుణము
అట్టిచో రెంటి నేకమంచనఁగఁ దగదె?
ప్రకృతిపురుషులవిధ మిష్టు స్పష్టపడెనె.

## —॥ పరిణామక్రమము. ॥—

తత్త్వములు మూఁడుగల సూక్ష్మతత్త్వ స్థూల
తత్తుగా నయ్యె నంటివి తద్విధంబు
విస్తరించి వచింపుమీ విశదముగను
ననుచు నడిగినతనయకు జనకుఁ డనియె
పైఁడి యొక్కటె కంటెయు బాజుబందు
కడియమును గంటసరియయి గ్రాలునట్లు
మట్టి యొక్కటె బానయుఁ జట్టి పిడుత
కుండ మూకుడు నైనట్లు గుణగణాఢ్య
సూక్ష్మచిదచిద్విశిష్టుఁడే చూడఁబడును
స్థూలచిదచిద్విశిష్టుఁడై సొబగుమీఱి
స్వర్ణమును మట్టి యీరెండు సత్య మష్ట
వానివైనవికారముల్ వస్తుతతుల
పేర్లు రూపు లనిత్యమై వెలయుచుండు
మాఱుచుండుటఁ జేసి యామాత్రమునను
గారణంబైనవస్తువు కల్లగాదు.

కుండ యనునది పగిలినఁ గుండ యనెడి
పేరుపోవును దునుకలఁ బెంకులంద్రు

పెంకులను బొడిగొట్ట నాపేరు విడిచి
దూళి యందురు రూపంబుతోడఁ బేరు
మాత్రనే కాని మాత్రనే మట్టిచెపుమ

తనదు దేహంబునందుండి తంతువులను
వెలికి రానిచ్చి వల యల్లవలసినపుడు
లీలలోనికిఁ గైకొను సాలెపురుగు
చందమున భగవంతుఁడు జగమునెల్లఁ
దనదుసంకల్పమునఁ జేసి తనరఁ జేయుఁ
దానెలోనికిఁ గొనుచుండుఁ దలఁపుచేత
శ్రుతులు వచియించు నీరీతి శుద్ధచరిత

కాన జగమెల్లఁ దత్కాలాకలిత మనుచు
నమ్ముమీ జంకు లేక నీనెమ్మనమున
ఉద్ధవునకును శ్రీకృష్ణుఁ డుగ్గడించె
జనకుతోడఁ బ్రహ్లాదుండు ననియె నిట్లు
భాగవత మెల్ల నీరీతిఁ బలుకుచుండు
శ్రుతులు ఘోషించు నీరీతి శుద్ధచరిత

ప్రళయవేళను నామరూపములు లేని
యట్టి కడుసూక్ష్మదశను బ్రహ్మంబుతోడఁ
బ్రకృతి యేకీభవించును మరలహరియు
నగుదుఁ గావుత బహురీతి ననుచుఁ దలఁచి
ప్రకృతిపరిణామమును బొంద బహుళరీతి

సలిపి జీవాత్మ కాత్మయై సరఁగఁ దానె
జీవుతోఁ జుత వానిలోఁ జేరి నిలుచు
స్థూలదశ యిది వికృతులఁ గ్రాలుఁ బ్రకృతి
దానికిని స్వభావ మదియకాట దానిగుణము
లగును సత్త్వరజస్తమఃఖ్యాతిగలవి

ప్రకృతిగుణములకును జిక్కి పాపపుణ్య
కార్యము లొనర్చి జీవుండు కష్టపడును.

జీవునకు మంచిజన్మముల్ చెడ్డతనువు
లొదవుట గుణసంగతినిజేసి యువిద మిన్న!

ఇట్లు భిన్నస్వరూపంబు లేర్పడంగ
నాఖ్య లేర్పడెఁ జుమి వ్యవహారమునకు
ఎన్నివేలరూపముల్ మన మెత్తి నామొ
మనుజరూపంబుఁ దాల్పక మునుపు కనవె.
కాన నిత్యంబు లవియుంచుఁ గాదు పలుక

పూర్వకర్మానుభవముకై పుట్టురూపు
వ్యావహారికసంజ్ఞయై వఱలుఁ బేరు

నీకు సుబ్బమ్మ యనుపేరు నియత మగునె:
అమ్మగారింట నొకపేరు నత్తయింట
వేఱె యొకపేరు నుంపదా వెలఁదులకును

కూఁతురా యనుపేర నీమాత పిలుచుఁ

గోడలా యను నీయత్త; కొడుకు తల్లి
యనుచుఁ బిలుచును; సోదరు లక్కయండ్రు
వదినె యని పిల్చు మఱఁదలు, భార్య యనును
భర్త; యిందేది నీపేరు పలుకవమ్మ!

కానఁ బేరులు నిత్యముల్ గావు తల్లి,
ఇన్నిరూపులు పేర్లు వహించునీవు
సత్యమో యమ్మ, యిటు లంచు జగము నెఱుఁగు

కంటె యనుపేరు గుండ్రముగాఁగ నుంట
నిజము గాదమ్మ పైఁడికి; నిజము పైఁడి.
మనుజుఁ డమరుఁడు తిర్యక్కు ననెడిపేర్లు
రూపములు నిత్యములు గావు రూఢిగాఁగ

ఏది రూపంబు పేరు వహించె నట్టి
వస్తువు నిజంబువింటివే వాస్తవంబు

కాన నింద్రియగోచరం బైనవెల్లఁ
గన్నులకు ముక్కు సెవులకుఁ గాయమునకు
గ్రాహ్యమైనవి సత్యంబు; గల్ల గాదు
అన్ని భగవత్స్వరూపంబు లనుచుఁ దలఁపు
తథ్య మియ్యది యూహామాత్రంబ గాదు.

కాన మ్రొక్కుము కుక్కకు గాడిదకును
గోవునకు మాలనికి మఱి కుంజరమున

కవనిసురునకు శూద్రున కర్భకునకు
భగవతే నమ యనుచును భక్తితోడఁ
గరములను మోడ్చి మ్రొక్కుమీ కలఁక లేక
యిలను సాష్టాంగముగనైన నెరఁగ వమ్మ

నపున కుద్ధవునకు నిట్లు హరి వచించె
వాసుదేవుండె సర్వమన్ వాక్యరత్న
మెదను దృఢముగ నాటించి హితమనీష
ఖల్విదం బ్రహ్మ సర్వమన్ ఘనతరోక్తి
యేని సర్వ మీశావాస్య మిదమటన్న
సూక్తి నేనియు, దృశ్యతే శ్రూయతేపి
వా యటన్న శ్రుతినేనియు భావవీథిఁ
జక్క నాటించి మ్రొక్కుమీ సర్వమునకు

భేదబుద్ధుల నన్నిటి విడిచి పెట్టి
వాసుదేవుని దాసివై వఱలుమమ్మ.

అమ్మ! నశియించు దీన నహంత మమత

అయ్య! సత్యంబ యేని ద్రవ్యంబు లెల్ల
నెండమావులు సత్యంబులే? వచింపు
రజత మనితోఁచు శుక్తియు భ్రాంతిగాదె?
రాతి కంబంబు బురుషుఁడన్ భ్రాంతి గానమె
కలయు నిక్కమటందువా కల్లగాదె?
పసిరికలుగలవానికిఁ బచ్చగాఁగఁ

గానవచ్చును జగ మది; గల్లగాదె?
అద్దమున మనరూపు యథార్థ మగునె?
లోచనవ్యాధి రెండయి తోఁచుచుండుఁ
జంద్రబింబ మయ్యదియును సత్య మగునె?
కొఱవిచక్రంబు సత్యమై వఱలునొక్కొ
అని ద్రన్యంబులెట్లు యథార్థమయ్యెఁ
బలుకవేయన సుత కిట్లుపలికెఁ దండ్రి.

తల్లి! "సర్వవిజ్ఞానం" యథార్థ మనుచు
వేదవేత్తలమత మిది వేఱుగాదు.

నీవు చెప్పిన వన్నియు నిపుణబుద్ధి
జక్కఁగ విమర్శనముచేయ సత్య మగును
గాని కల్లలు గావమ్మ కావు కావు

అమ్మ! పంచీకరణమున నయ్యెఁ జుమ్మి
బ్రహ్మ మొదలుగ నఖిల ప్రపంచసమితి
అట్లు గానిది యొక్కటి యైన లేదు.

రజతమో యెట్టి పంచీకరణముచేత
నయ్యె నయ్యదియే నిల్చి స్వల్పముగను
శుక్తియందు నారీతిఁ జూడఁ బడును
ఇట్టియంశంబు గనులకుఁ దట్టినపుడు
వెండి యంచుఁ దలంతువు వేఱుగాదు.

తథ్యమే యిది యెప్పుడు మిథ్యగాదు

హెచ్చుగా నున్నశుక్త్యంశ మెదకుఁ దోఁప
శుక్తి యనియెద వవ్వేళ శుభచరిత్ర
అట్టులైనను భ్రమయంచు ననఁగ హేతు
వౌదవెఁ జుమి వ్యవహారోపయోగి గామి

ఉండి యుపయోగమునకు రాకుండు నేని
లేని దానిగ నెంచమా దేని నైన
శుక్తినే రజతంబుగాఁ జూడకున్నఁ
బెంకునేటికిఁ జూడవు వెండి గాఁగ

శుక్తిలో రజతాంశంబు చొచ్చి యుంట
గాదె రజతంబుగా నీకుఁ గానవచ్చు
ఎండమావుల నీరీతి నెంచవమ్మ
వానిలోన జలాంశంబు వఱలు కతన

జలమురీతిగఁ దోఁచును సత్యమిదియు
జలమురీతిని భ్రావంగ వలనుపడమి
భ్రాంతియంచుఁ దలంతురు ప్రజలు మదిని.
రాతికంబంబుఁ బురుషుఁడఁగ భ్రాంతి గొనుట

కిదియె హేతువు సత్య మియ్యదియు వింటె
త్రాడుగని పామటంచును దలఁచుటల్లె
కలలు వాస్తవమో యమ్మ కల్లగావు
జీవునకు నట్టి యనుభూతిఁ జేయఁ గోరి

యిట్టివానినిఁ గల్పించు నీశ్వరుండు
అతఁడె రథములు లోనైనయవియుఁ గల్పి
తములఁ జేయునటంచు వేదములె యనవె

పసిరికలు గలపురుషుఁడు పచ్చశంఖ
మనును బైత్త్యంబు హెచ్చి లోచనములందు
దానిద్రవ్యంబు వ్యాపించు; దానిఁ గొనుచు
శంఖమును నేత్రరశ్ములు చక్కఁ గప్పు
పైఁడిరేకుచేఁ గప్పిన పగిదిగాఁగ
దాన శంఖంబు పచ్చనై గానిపించు
వానికనులకు మాత్రమ స్వల్ప మగుట
నన్యులకు గోచరింపద యదియుఁగంటె

అర్కరశ్ములు పచ్చనియద్దమందుఁ
దూఱి శంఖంబునుఱ్ఱ గప్పఁ దోఁచు టరుదె
పచ్చగాఁ బచ్చవస్త్రంబు పఱచినట్టు
స్ఫటికనికటంబునందు దాసానిపువ్వు
నుంచ రక్తంబుగాఁ గానిపించు నట్లె
కాన సత్యంబె యిదియును గల్లగాదు

జననిరో! యలాతచక్రంబు సత్య మమ్మ
అధికవేగంబుగాఁ ద్రిప్ప నంతరాళ
మనుగ్రహింపఁగ లేమిలోచనములందు
నందుఁ గలిగినవస్తుగ్రహణంబు సేయ

నదియె చక్రంబుగాఁ గను మదికిఁదోఁచుఁ
జదువఁగా లేదె శ్రీరామచరితమందు
మూలబలమును రాముండు మొదలుముట్టఁ
జంపువేళను దిరిగినచంద మెల్ల.
అతులవేగాతిశయమున నందఱకును
నన్నిరామాకృతులు గాన నగుచు నుండె.
అట్టులే రణరంగంబునందు నీలుఁ
డాచరించెను దశముఖస్యందనమున
అట్టులే చుమి యుద్ధంబునందు రూపు
ప్రతిహాతంబయి నాయనరశ్మివితతి
దర్పణాదులచేతఁ దద్దర్పణాదు
లను గ్రహించుచు నున్నగాఁ దనదురూపు
గూడఁ గ్రహియించు, నందును జూడఁబడమి
యంతరాళంబు తద్విధఖ్యాతి యొసఁగె
కన్నులను దిమిరాదిరోగములు గప్ప
దృష్టితేజంబు భేదించు దీనివలన
భేద ముదయించు సామగ్రి; వేఱువేఱ
నొక్కదానికి సంబంధమొకఁడు లేక
చంద్రు లిర్వు రటంచప్డు జ్ఞాన మొదవు
సూర్యకిరణంబొకండింటఁజొచ్చువేళ
దాని నడుమను నడ్డ మేదేనినుంప

రెండుగాఁ జీలిపోవవే? దృష్టులట్లె
భేదమై యొక్కవస్తువుమీఁద వ్రాలి
వేలువేలుగ గ్రహియింప వేలువేలు
వస్తువులటన్న జ్ఞానంబు వచ్చుఁ జుమ్మి
కాన సత్యంబు సర్వవిజ్ఞాన మెపుడు
కానజగమెల్లసత్యంబు గల్లగాదు
గగనకుసుమంబు గొడ్రాలుకన్నకొడుకు
శశవిషాణంబు వీనినసత్యమండ్రు.
వీని రెంటికి భేదంబు విశదపడెనె?

అదియు సవిశేషవిషయమం చాత్మ నిలుపు
నిర్విశేషపదార్థంబు నీకు గ్రహణ
సాధ్యమెన్నఁడుఁగాదమ్మ సత్యముగను
అయ్య! యింకొకసందేహమదియుఁ దీర్పు
సూక్ష్మచిదచిద్విశిష్టుఁడై సొబగుమీఱు
నతఁడె నేనయ్యె నంటి వీవట్టులేని
నయ్యె సత్య మహం బ్రహ్మ మనెడి పలుకు
దాస్య మెందుండి వచ్చె నద్దాని ననుమ
నేను నాకెట్లు దాసినో నిజము చెపుమ
అనినఁ దనకూర్మితనయకు ననియెఁ దండ్రి
మెచ్చితిని నీదుబుద్ధికి మెలఁతమిన్న!
పెరుఁగు చిలుకక యుండిన వెన్నపడునె?

స్థూల దేహంబుకంటెను సూక్ష్మమనసు
కడుబలీయంబు నీ కిది గానవచ్చు
యోగ మింకను నభివృద్ధి నొందెనేని
తనువు నారోగ్యమందును మనసు గొలఁది
మనసు వ్యాకులమైనను దనువుచెడును
దేహమునఁ గానికార్యముల్ దీర్పవచ్చు
బాగుగా నీవు నీమనోబలముచేత

సూక్ష్మమనసుకంటెను సూక్ష్మమైన
యాత్మ కరము బలిష్ఠమై యమరుచుండు
ఆత్మబలమున మనసును నణఁపవచ్చు
ఆత్మకును సూక్ష్మమౌఁ బరమాత్మ గాన
నాత్మకంటె బలిష్ఠంబటంచుఁ దలఁపు

మున్నె చెప్పితి ధారణపోషణములు
జీవునకు మఱిప్రకృతికిఁ జేయువాఁడు
భర్త ధర్తయు హర్త యీశ్వరుఁడె యనుచు;
(దేహి దేహంబులట్లని మోహపడకు)
భర్త యీశుండు జీవుండు భార్య యట్లు
అన్య మఖిలంబు స్త్రీప్రాయ మనఁగ వినవె
భోక్త యీశుండు జీవుండు భోగ్య మగును
దేహి యట్టులె తలఁపుమీ దేహ మెపుడు
స్వామియగు దేవునకు భోగ్య వస్తు వనుచు.

స్వమ్ము చేతనాచేతనార్థమ్ములెల్ల
స్వమ్ము కలవాఁడు శ్రీహరి స్వామి యగును.

వడిగఁబాతెడియేటను సుడు లటంచుఁ
దలఁపుమీా నీవు జీవుల; నిలువఁ గలదె
సుడి ప్రవాహంబునీటిని విడిచె నేని
విడుచుటకునైనసాధ్యంబుపడునటమ్మ
పరఁగ సుడులస్వరూపస్వభావములకు
నేఱె యాధారమైనట్లు లెల్లజీవ
వర్గపాళిస్వరూప స్వభావములకు
నీశ్వరుండె యాధార మంచెఱుఁగ వమ్మ

జీవకోటులఁగూరిచి చెప్పువేళ
నగ్నిలోఁబుట్టుమిణుఁగురు లనియె శ్రుతులు.
అగ్ని యీశుండు మిణుఁగురు లయ్యె జీవ
తతులు; నగ్నినిఁ బాసియుఁ దనరఁగలవె
మిణుఁగురుతనంబుఁ బాయక మిణుఁగురులును.

అట్లె యీశుని బాసి దవ్వరిగెనేని
జీవుఁడును జెడిపోవుట సిద్ధమమ్మ
దవ్వుపోవుటయన స్మృతి తప్పుటగును.

జపతపోధ్యానమనన సంశ్రవణములను
హరికి నికటస్థుఁడౌట యుపాస్తి యగును
ఉప యనసమీాప మస్తి నా నుండు టగును

ఆర్యవాక్ప్రచ్ఛశంకరాచార్యవర్యుఁ
డలలు జీవులు నీశ్వరుం డబ్ధి యనుచు
ధారకుం డబ్ధి ధార్యముల్ తరఁగ లగును
స్వస్వరూపస్వభావముల్ సమసిపోక
తరఁగలుండును యబ్ధియాధార మెడల
నుడులు పెనునది నేనని నుడువ నగునె?

మిడుఁగురులు నేనె యగ్నినా నుడువ నగునె?
అలయు నేనె సముద్రమం చాడ నగునె?
సూర్యకిరణంబె యానొకో సూర్యుఁ డెపుడు
సూర్యకిరణంబు సూర్యునిసొత్తు గాదె
కాన దేహికిఁ బరమాత్మ కైనభేద
మిట్లు తెలియుము సంశయ మెడలి తల్లి!

ఆత్మపూజ యటంచన నర్థ మేమి?
ఆత్మ పరమాత్మపూజించుటగును గాని
తన్నుఁ దాఁ బూజసేఁతనా నెన్నఁగునె.

ఆత్మ నవలోకనము సేయు టనిననేమి?
తాను దన్నును బరమాత్మ దర్శనంబుఁ
జేయుటయె కాదె? జడమైనకాయ మట్లు
సలుప సాధ్యంబె? చెప్పుమా లలితచరిత.
అజ్ఞతను నీవు సాధ్యం బటంచువేని

దివ్యచక్షులనేటికి దేవకీసు
తుండు కరుణించె నరునకు వెండి యంబి
కాతనూజాతునకు మున్ను ప్రీతితోడ.

తన్విరో స్వామునకును స్వాతంత్ర్యమున్న?
స్వామికి యధీనపడియుంట చనును గాని
శుద్ధపరతంత్రుఁ డెపుడు దాసుండు కాఁడె.
దాసుఁ డనఁగను స్వామికృత్యముల నెల్ల
హెచ్చరికఁ దీర్చువాఁడని యెంచవమ్మ.

మూఁడు నొక్కటి యగురీతి నాడినాఁడ
మూఁడు మూఁడనువారలు ముగుద! గలరు.

ఎట్టులన్నను వీరల కిరువురకును
దుల్యమైయుండు సద్భక్తిత్రోవ వింటె
త్రికరణములను వీ రేకరీతి వారు

వాక్కు నాచారమును నొక్క భంగినుండు.
ఎసఁగుచున్నారు వేఱొక్క యేకతత్త్వ
వాదు లాచారమున వేఱు వాక్కు వేఱు
వారలకు; నైననేమి యాచారసరణి
భక్తిమార్గావలంబులై పరఁగుచుంద్రు
కాన హెచ్చుగ భేదంబు గానరాదు.

భక్తిమార్గంబె వారును బ్రస్తుతింత్రు

శంకరార్యుండు షట్పదీస్తవమునందు
ననియె 'నారాయణా కరుణాలయా త్వ
దంఘ్రియుగ్మంబె శరణంచు' నదియెమనకు
నరుగ సరియైనమార్గమో యన్నువింపె.

ఎన్నితత్త్వంబు లైన నీకేమి మేలు?
అడిగితివి గానఁ జెప్పితి నంతెకాని
భక్తిసేయుము భగవంతుపట్ల నిట్లు.

నమ్ముమీ దేవుఁ డొక్కఁ డున్నాఁడటంచు
మ్రొక్కువారల కెల్లను దిక్కటంచు
లలితసౌశీల్యవాత్సల్యజలధి యనుచు
నీకు శాశ్వతసుఖ మీయ నిపుణుఁ డనుచు
శరణు శరణంచు మ్రొక్కుము జంకువిడిచి
నమ్ము మిది కడసారిజన్మం బటంచు.

జీవుఁ డుండుట సత్యంబు సిద్ధమన్న
అణువు పరిమాణుఁ డనుచును ననెడు శ్రుతులు
వాని గమనాగమనములు పలుకు శ్రుతులు
దేవధూమపథంబులఁ దెల్లముగను
భోగములు పల్కు ముక్తుఁడౌ పురుషునకును
శ్రుతులుకల్లలె యివియెల్ల శుద్ధచరిత
గాలిలో గాలి యుచటనే కలియు ననుచు
నాత్మహాననంబొనర్పకు మన్న నీవు

చెడెదు చెడుదువు చెడుదువు సిద్ధముగను
తనువు క్షణభంగురమ్మని వినుచుటకును
బుద్బుదోపమ పలుకును బుస్తకములు
కాన విపరీతబుద్ధిచే గాసిపడకు
భక్తిచేయుము భగవంతుపట్ల నీవు
నేకచిత్తంబుతోడుత నెల్లవేళ
వ్యభిచరింపనిమనముతో నన్నిదశలఁ
బతిని సేవించుగతి భగవంతుఁ గొలువు
పూతచిత్తంబుతోడుత ముక్తి యొదవు.

వలదు వలదమ్మ గొంకు లవంబునైన
బాగుపడియెడికోరిక ప్రబలె నేని
సర్వసమ్మత మైనట్టిసరణి ననెద
భక్తిమార్గంబు నద్దానిఁ బట్టిపొమ్ము
మతవివాదంబులం జిక్కి మడియవలదు.

వాదములపొంతఁ బోవకు బాగుపడెడి
తలఁపు పంతంబు నీకున్న లలితచరిత!
నారదానుశాసన మిది నమ్మవమ్మ!
మిగులఁ గలకండ తీపని మొగసిమొగసి
యెన్నిదినము లుపన్యాస మిచ్చితేని
నోరుతీపౌనె వినియెడివారలకును
పలుకు రవయంత నాలుకఁ బడినయట్లు?

కాన నెవరికి నభ్యాసకలన వలయు
వాదముల వ్యర్థచర్చల లేదుఫలము.
జీవుఁ డుండుట భగవంతుసేవకొఱకె
యనెడునర్థంబు ప్రణవంబునందె కలదు.

ప్రణవము నమస్సు చేర్చి నారాయణాయ
యనినఁ బ్రణవంబునకును నారాయణాయ
యనియెడి చతుర్థియర్థమే యనఁగ వలయు.
వర్ణములువేఱుచేసి భావంబుపలుకు
పట్టునందు మకార మవర్ణముకొఱ
కేయటంచును నుడువులే న్యాయసరణి
బ్రహ్మణేత్వామహాన యనిపలికెశ్రుతియు
కావునఁ జతుర్థియర్థమే కనుము సరిగ

వెలఁదిరో! యకారవాచ్యుఁడౌ విష్ణుకొఱకె
మాతృరమువాచ్యుఁ డైనజీవాత్మ యనుచు
దాసభావంబు సూచించుఁ దత్యమిట్లు
ఎఱుఁగవె నమస్సు నా నమస్కృతి యటంచు
దాసుఁడౌ వాఁడె గద యిట్లుదగును బలుక
శంకరుండును నరహరి స్తవమునందుఁ
బలికె నీరీతి సందియపడఁగనేల
జీవునకును స్వరూపస్వభావములయు
దాస్య మొప్పారుచుండు నోతల్లికాన!

అనిన జనకున కిట్లను నాత్మజాత
దాస్యమును నీచమంచును దలఁచు నేను
దాసి నంచని యేరీతిఁ దలఁపఁగలను.

సేవ యన నీచ మని నీవె చెప్పలేదె
ధర స్వతంత్రతఁ దిరుగఁగఁ దగునుగాని
దాసినై కేలుమోడ్చిన వాసి గలదె?
అనుచు నడిగిన సుత కిట్టు లనియెఁ దండ్రి.

సేవ నైచ్య మటంచును జెప్పె నెవఁడు?
నీచతగఁ జెప్పఁబడునమ్మ నీచుసేవ
శ్లాఘ్యమౌను మహాత్మసేవ సకలదశల
బాగుపడఁగోర్కి కలిగినవారి కెల్లఁ

బరుల సేవించితేనియు ఫలముఁగోరి
నిశ్చయంబుగ నయ్యది నీచసేవ.

ఫలము గోరక యుపకారభావముననొ
ప్రేమచేతనొ విధ్యుక్తకృత్య మనియొ
చేసితేనియు నది నీచసేవ గాదు.

చెప్పుమీ తల్లి మీతండ్రిసేవ యెదియొ
చెప్పుమీ తల్లి మీతల్లిసేవ యెదియొ
చెప్పుమీ తల్లి నీభర్తృసేవ యెదియొ
చెప్పుమీతల్లి నీగురుసేవ యెదియొ

అతిథిసేవించుటలు నైచ్యమా తనూజ
బంధువులసేవ నైచ్యమా పలుకవమ్మ
భిక్షులకుఁ జేయుచాకిరిపే రదేదొ
నీచసేవయటందువే నిజము చెపుమ
కడుపుకూఁటికిఁ బరుఁగొల్చి కష్టపడుట
నీచసేవ శ్వవృత్తినా నెగడుచుండు

జీవకోటు లివెల్లను సేవలేఁ గాదె
యుత్తమోత్తమజన్మంబు లొందఁ గలిగె?
ఇలను బాషాణ ముద్భిజ్జ మెట్టులయ్యె
స్వేదజం బది యెట్లయ్యెఁ జెపుము నీవు
స్వేదజం బెట్టు లండజమై దనర్చె
నది జరాయుజ మెట్లయ్యె నమ్మచెపుము.
వైశ్యుఁ డెట్లయ్యె శూద్రుండు, వైశ్యుఁ డెట్లు
క్షత్రియుం డయ్యె నాతఁ డే సరణి నయ్యె
భూమిసురుఁడుగఁ దద్విధంబును వచింపు.

కావునసె తల్లి! భక్తప్రకాండుఁ డెపుడు
ఫలముఁ గోరక సేవకై పాటుపడును
విహితకృత్యంబటంచును బ్రేమతోడ.

ధర స్వతంత్రతఁ దిరుగంగఁ దగునటంటి
విది యనాలోచితంబని యెఱుఁగవమ్మ
ఈశ్వరునిదివ్యకరుణానిరీక్షణమునఁ

బూర్ణ మైనస్వతంత్రతఁ బుట్టుచనుక
నే స్వతంత్రుఁడ ననువాఁడు నిజము చెడును.

దాసి యొక్క_తె కలదు కదా త్వదీయ
సేవకై యింట నది స్నేహాభావ మూని
యదుకు కొదుకును లేనట్టియాత్మతోడ
నణఁగి మణఁగి చరించు నఖిలదశల
నీదువిశ్వాసపాత్రమై నెఱిఁ జరింప
నిచ్చెదవు నీవె స్వాతంత్ర్య మెల్లఁ దునను
నఖిలకృత్యాళి నీకు రెండవది యగును

అట్లుగాక స్వతంత్రించి యహాముప్రేర్చి
నవినయంబున నవిధేయురాలు నగుచు
నేను నీవంటిదానను గానె? యేల
నీకు నే దాసినై లొంగ నీకు నాకు
భేద మెందున్నదో చూపవే యటంచుఁ
బలుకుదానిని నెంతను నిలువనైన
నిలువనిత్తువె దూరంబు నెట్టుమనక?

చేయఁగారాని దోషంబుఁ జేసి నేను
ప్రభునిశాసనమున నిట్లు బందిఁబడుచు
నిగళబద్ధుండనగుచును వగపుఁ గదురఁ
గఠినశిక్షకు లోనయి కళవళించు
చుండియును నేనె దేశప్రభుండ ననుచు

నేనె సృష్టించినాఁడను నిగళములను
గాలుసేతులు నేఁ గాదె కట్టుకొంటిఁ
గంఠమున కురిత్రాడు నేఁ గాదెవేసి
కొంటి ననుచును వెంగలికూఁత లనిన
నేమిగాఁ నీవు దలఁచెదో యెఱుఁగఁజెపుము

ప్రభువువైచినసంకెలల్ ప్రభునియాజ్ఞఁ
దొలఁగవలెఁ గాక యెవ్వరు తొలఁగఁద్రోయ
నిపుణులో యమ్మ! చెప్పవే నిజముఁ దెలిసి

దీనుఁడను దప్పుచేసితిఁ దెలివిలేక,
జనక! మతి వచ్చె దుఃఖముల్ సైఁపలేను
నీవె గతియంచు నున్నాఁడఁ గావవయ్య
యంతవఱకును విడువ నీయంఘ్రు లనుచు
కరుఁగ హృదయంబు కన్నీరు గార్చినంతఁ
గరుణ దళుకొత్త నృపతియుఁ గాచుఁగాక

ధర స్వతంత్రతఁ దిరుగంగఁ దగు నటంచుఁ
బలికితివి మున్ను నీ కది వచ్చె నెపుడు?
తల్లిగర్భాన నుండఁగఁ దారసిలెనె?
తల్లిపొత్తులఁ బెరుఁగంగఁ దారసిలెనె?
ఉచ్చులో రొచ్చులోఁ బొర్ల వచ్చెనొక్కొ
ప్రాఁకులాడెడివేళలఁ బ్రాప్తపడెనె?
పరులపిండంబుఁ దినువేళ వచ్చె నొక్కొ

7

కుక్కవలెఁ బరువెత్తంగఁ దక్కనొక్క
కాలభటు లీడ్చువేళలఁ గలిగెనొక్క
పదునొకంటను దేనికి వశముపడవొ
దేహపాతంబుదాఁకను దెలుపవమ్మ!
తల్లి! యేపట్ల నీవు స్వతంత్రవొక్క
విశదపఱుపుము నీచిన్నత్రేలు మడఁచి
నిక్కమైనస్వతంత్ర నీకు నున్న
మోహమును బంధ మది యెట్లు మొనసె నీకు
తన్నుఁ గట్టెడిత్రాళ్లను దానె తెచ్చి
తనదుచరణంబులకును బంధము బిగించి
వెనుక విలపించునే యెంతవెఱ్ఱి యైన
నిక్కమైనస్వతంత్రుని నిశ్చయింపు
మున్నవాఁడేమొ జగదీశుఁ డొకఁడు దక్క
నతనిసేవింపు మొదవు శ్రేయంబు లెల్ల
వెఱ్ఱిపోకలఁ బోవకు వేఁదుఱెత్తి.

### బంధము - మోక్షణము.

బంధ మెవనికి? నది యేల ప్రాప్తమయ్యె
నంచు నడిగితి వింక నయ్యది వచింతు
సచ్చిదానందరూపుఁడై జరుగుచుండు
ప్రత్యగాత్మయు నించుక పరమభక్తి
వదలి హరిమాయ కతమునఁ బ్రకృతియందు

మనసు పోనిచ్చి దానిపై మరలుకొనుటఁ
బ్రకృతిచక్రంబునం బడి భ్రమసితిరుగు
నిండుసుడిలోనఁ బడినయాతండుపోలె

నీఁత నేర్చినవాఁడైన నీఁదలేఁడు
దానివేగంబునిలుపఁగఁ దరముగాదు
బ్రహ్మరుద్రేంద్రులకు నైన రమ్యశీల
యాజగద్విభుశక్తియై యమరుచుంట

అట్టులేకద సీత క్షణార్థ మాత్ర
విభుని నెడఁబాసి లంకలో వెతలుగుడిచె.
తెలిపితిని దీని సీతోపదేశ మందు.

తల్లిదండ్రులపైఁ బ్రేమ దలఁగఁ ద్రోచి
కామవశమున నొకవారకాంతవలలఁ
బడినవిటునట్లు జీవుండు చెడియె వింటె.

అమ్మ! సుడిగుండమునఁ బడ్డయాతఁ డెంత
విపులసుజ్ఞానమున్నను నిపుణుఁ డైన
బలముగలవాఁడె యైనను వెలికిరాఁగఁ
జాలఁ డెప్పుడు దాను స్వశక్తిఁ జేసి
బయలనుండెడుఘనుఁడు కాపాడవలయు.

అట్టివాఁ డొక్కఁడే కాని యన్యుఁ డెవఁడు
లేఁడు లేఁడమ్మ వెదకిన లేఁడు లేఁడు

బ్రహ్మరుద్రేంద్రముఖులును బ్రకృతిసుడులఁ
బరిభ్రమించుచునున్నారు భ్రాంతు లగుచు
దాపుదరి గానలేక తత్కారుణవేచి
పలుకుచున్నవి శ్రుతులిట్లు స్పష్టఫణితి
స్మృతులు నీలాగె తెలిపెడి మెలఁత మిన్న!

కాన జ్ఞానంబు యోగంబు కర్మములును
గావఁగా లేవు జీవుని; గాసి గాక
ఒడ్డునం దున్నవానిఁ గేలొగ్గి వేఁడఁ
గాచు నట్టులు శ్రీహరిఁ గరము భక్తిఁ
బ్రార్థనముచేయ నతఁడె కాపాఁడు నిజము.
పరమకారుణికుండయి వఱలుచుంట

భక్తిలేమిని సంసృతి ప్రాప్త మయ్యె
భక్తి కలిగిన సంసారబంధ మెడలు
కాన భక్తిని భజియింపు కమలనయనుఁ
బ్రకృతిబంధంబు నాతఁడే పాయఁద్రోచి
శాశ్వతానంద మిడు నీకు సత్యముగను.

## —✿✿ తరణోపాయము. ✿✿—

ప్రకృతిబంధంబు మునుముట్టఁ బాయఁ దట్టి
పరమభక్తి లభించెడి బాట నీకుఁ
దెలియఁ బల్కెద విను తేట తెల్లముగను
శాస్త్రవినిషిద్ధకార్యముల్ సలుపుదనుక

జీవునకు దేహబంధముల్ దెగకయుండు
తత్త్వ మెఱుఁగుచు జ్ఞానంబుదారిఁ బట్టి
జీవుఁడు నివృత్తిధర్ముఁడై చెఱుచు భవము
భారమును మోచికొనియీఁద వశముపడునె?

కాలికిని ఱాయిఁగట్టినఁ గదలవశమె
యాకసంబుననేగెడిహంసమునకు?

కోట్లజన్మాలకొలఁదిగాఁ గూర్చియున్న
ప్రకృతివాసనలెల్లను బాయఁగొట్టి
ప్రకృతిగుణముల మొదలంట వదలివైచి
యనలసుఖముగ భవవార్ధి నౌను నీఁద.

నెలలకొలఁదిగఁ జేరినచిలుము పోవఁ
జేయ నెంతశ్రమింతుమో చెంబుమీఁదఁ
గోట్లకొలఁదులజన్మాలఁ గూర్పఁబడిన
ప్రకృతివాసన నిముషానఁ బాసిపోనె?
మిగుల శ్రమియింపకుండిన మెలఁతమిన్న.

ప్రకృతిబంధంబు లిరుదెగల్ బాహ్య మనఁగ
నాంతరంగిక మనఁగను నమరుచుండు
ఇల్లు వాకిలి చుట్టాలు నింటియాలు
తనయులును జేలు మడులును ధనము వస్త్ర
వాహనంబులు సొమ్ములు బాహ్యములగు.

లేకయుండిన దేహంబు లేదు యాత్ర
కానఁ దనుధారణమునకుఁ గాను వలసి
నంత యల్పంబుఁ దక్కఁ దదన్య మెల్ల
వీడఁగాఁదగు వైరాగ్యవిధముఁ దెలిసి
భావమున నైన నస్వరూపముగ నైన

ఆలు జారిణి యవిధేయురాలు దొంగ
దుష్టవర్తన గాకున్నఁ దొలఁగఁ ద్రోయఁ
దగదు తానుగఁ బురుషుండు తథ్య మ్మౌ.

ఆమెసమ్మతి లేక సన్యాసి యైన
మోసగానికిఁ దప్పదు దోస మెపుడు
ఫలము గానఁడు వీఁడేగుపథమునందు
రక్షణము సేయఁ గలిగినదక్షు లైన
యాత్మసుతులకు నామెను నప్పగించి
మోక్షకాంక్షను బురుషుండు పోవవచ్చు.

మాతయుండిన యామె సమ్మతియు వలయు
జనని సమ్మతివడసెను శంకరుండు
మోసవిధముగ నైనను మొట్టమొదట
భాష్యకారులు భార్యను వదలిపెట్టె.
దనకుఁ బ్రతికూలురాలయి తనరుకతన.
సత్య శీలయు సహధర్మచారిణియును
వలదు విడువఁగ ననుకూలవతిగ నున్న

సర్వమును బ్రహ్మముగఁ జూచు జనుఁడు దక్క
భార్య విడనాడి యతియయి పరవధూటి
సేవ లంగీకరించెడి చెనఁటినరునిఁ
బరమచండాలుఁ దలఁపఁగఁ బాప మొదవు.

సన్న్యసింపఁగఁ గోరి యాచార్యుఁ జేరి
భార్య చచ్చె నటంచు నబద్ధమాడు
చుంద్రు గొందఱు పురుషులు నుల్ల మెఱిఁగి.
వంచనముఁ జేసి గురు మోసగించుటయును
తెలిసి తెలిసి యసత్యంబుఁ బలుకుటయును
మాయ కయ్యది మనసును గోయుటయును
మనసు సతిమీఁద నడ్డపు చనుచునుంట
భ్రష్టుఁ జేయక యవియెట్లు పాసిపోవు?
కపట మెఱుఁగని యిల్లాలు కంటినీరు
కడవలకొలంది కార్చిన ఘనకలుషము
పాపము నె కూర్చుఁగా కపవర్గ మిదు నె

కలియుగంబున నిప్పటికాలమందు
నలపరాశర బాదరాయణులమతము
నందు నిసిద్ధ మమ్మ సన్న్యాసి తనము.
పడుపదులును నైదునొనేటఁ గొనఁగ
వచ్చు నాయాశ్రమం బెంతొ త్యాగమున్న.
తల్లి యీనాఁటి సన్న్యాసితనమువలన
కౌరవాదులు తప్పక ప్రాప్త మగును

అటులె పురుషుని బాయ ననర్హ మమ్మ
భార్య యెంతటివైరాగ్యవతిగ నున్న
కోమలికి భర్తమించిన గురుఁడు లేఁడు
పతిని మించిన దేవుండు సతికి లేఁడు
పతిని మించినగతియును సతికి లేదు.

భర్తసమ్మతి పడయక భార్య సలుపు
వ్రతతపోజపనియమముల్ వెతల కొఱకె
భర్తఁ గాదని వేఱుదైవంబుఁ గొలుచు
నట్టియువతిని జారిణి యంచుఁ దలఁపు

పొలఁతు లోకకొంద ఱిక్కాలమునను వెఱ్ఱి
పోకలను బోవుచున్నారు పోవ వలదు
వారిత్రోవల నీవును భద్రమమ్మ.

భర్త లేఁడేని తనయులపజ్జ నైన
బంధువులయొద్ద నైనను వలయు నుండ
స్వైరసంచార మెన్నఁడు సతికిఁ దగదు
ఇహాపరంబులరెంట నాయింతి చెడును.

పోకువారలు లేనట్టిసాధ్వి కపుడు
తగినచరితంబు వైధవ్యధర్మచర్య
యందుఁ జెప్పితిఁ గామమ్మ యడిగినపుడు.

ఇట్టివారలు వసియించి గృహామునంద
బురదలో నుండుకుమ్మరపురువుఁబోలె

నంబువుల నుండుతామరపాకువోలె
నుండు టొప్పును దగదు వేఱొండు విధము

తాముగా ఋణబంధముల్ దైవకృపను
దలఁగిపోయిన నురులలోఁ దగులుకొనిన
పక్షివిడవడ్డయట్టులు స్వస్వరూప
ముగను సర్వంబువిడుచుట దగును నరుఁడు.

విధవలనుబోలె విధురులు వేఱుపెండ్లి
యాడఁగా రాదు పుత్రులయాసఁజేసి
మోక్షకాంక్షయు మదిలోన మొనసియున్న

తనదుసత్కర్మములు చేయ ననువుపడని
సాయ మేమి తనూజుండు సలుపఁజాలు

తనుజుఁడే యట్టివాఁడైన దత్తుఁ డేమి
పరమసుఖముల నిడఁజాలు భ్రాంతిగాక.

ధనముఁ గలవారు దానముల్ ధర్మములను
జలుపు టొప్పును శాశ్వతసౌఖ్యకాంక్ష.
భగవదర్పణబుద్ధిని భక్తితోడ.

వస్తువులు వేఱుగావున బాహ్యములను
బాయుటెంతయు సులభమ్ము ప్రాజ్ఞునకును
ఆంతరంగికబంధాల నణఁచు టదియె
చాల దుర్ఘటకార్యంబు చారుశీల.

బాహ్యబంధాల నన్నిటి వదిలి వైచి
యాంతరంగికబంధంబు లణఁపఁ జేసి
రెంటికిని జెడినట్టియా రేవణఁగును.

పెక్కు రున్నార లిటువంటివేషధరులు
భిక్షకై గేస్తు లెవరేని బిలిచిరే
గారెలను మేమె చక్కఁగాఁ గాల్తు మనెడి
యతులు, నామవడల్ చేయరా యటంచు
నడిగి చేయించి తినెడిసన్న్యాసి వరులు
అర్థముల నొడ్డి జూదంబు లాడువారు
గర్భమును నిల్పి విధవకుఁ గాన్పుసేయు
మౌనధారులు, మ్రొక్కెడిమానవతుల
పైఁటలను బట్టుకొనుపరివ్రాజకులును
అర్థ మీకున్నఁ దిట్టు వేదాంతిజనులు
మగల విడనాడి వచ్చినమగువలకును
నూడిగంబులు చేయుచు నుండుయతులు
శిష్యరాండ్రని యిల్లాండ్రఁ జేరఁదీసి
మాయమాటల మగనిపై మమతఁ బాపి
తత్త్వబోధంబుబ్రహ్మంబు దామె యనుచుఁ
దలకు నెక్కించి తమలంజియలుగఁ జేసి
రోగములఁ దగిలించువిరాగిజనులు

ఎందఱో యిట్టివారల నెన్న నేల?
కాలమహిమంబుకొలఁదిని గలిగినారు

ముగ్ధ లగుస్త్రీలఁ బురుషుల మోసగింప
వీరి దేయూరు మోహ మేయూరు తల్లి!

ఆంతరంగికబంధాల నణఁచి బాహ్య
బంధములఁ గూడి యున్నను భయములేదు
వానిపైఁ గాంక్ష విడిచితి వేని తల్లి!

ఇషణములుమూఁడు మఱియుఁ బంచేంద్రియముల
ప్రీతి, కామాదు లాఱును, భీతి లజ్జ
దంభ ముద్వేగహర్షముల్ దప్పి క్షుత్తు
నాది నే ననుభావంబు లాదిగాఁగ
నాంతరంగికబంధంబు లనఁగఁ బడియె

వాని నెల్ల జయింపఁగవలయు నష్ట
పీడ నగువాని, మునుముట్ట వీడవలయు
వీడరాకున్న వలయును వేగ మణఁప
వీనిఁ బాసెడివిధమును విస్తరింతు
వీని విడనాడి బాలునివిధముదోఁప
నమలసుజ్ఞాని వర్తింపనగును దల్లి!

జ్ఞాన మార్జింపకున్న నసాధ్య మష్ట
వేళ్లతోఁగూడ వీనిని బీఁకివైవ.

వస్తుతత్త్వంబుఁ దెలియంగవలయుఁ దొలుత.
దీనిచేత విరాగంబు దీర్ఘ మగును

వస్తుతతులనె పాయంగవలయుఁ బిదప
అంతమాత్రాన నపవర్గ మబ్బ దమ్మ
గడ్డిగాదంబుఁ బీకంగఁ గార్య మగును
పైరు నభివృద్ధిపఱుపంగఁ గోరువాఁడు
అంతమాత్రాన ఫలియించునా పొలంబు
ధాన్య మింటికివచ్చునే తనివిదీఱఁ
గడుపు నిండఁగ భుజియింపఁగలమె చెపుమ
కలుపుదీయుట నాటుట జలము నిడుట
కల్లవేయుట, వెఱ్ఱుల కన్నగాండ్ర
బాధలేకుండఁ గాచుట వలయుఁగాదె
అవగుణంబులఁ బోఁదోలి యాదిబుధుఁడు
అమలగుణములఁ జేపట్టనగును దల్లి
తల్లి! నీశక్తి యంతయు ధారవోసి
కృషి యొనర్చిన దైవంబు కృపయు లేక
ఫలము రాఁజాల దమ్మరో భవనమునకు.
చీఁడయేఁబట్టు నేదేని పీడగలుగు
ఫలము నింటికి రాకుండఁ బాడుచేయ
వచ్చినది తిని సుఖియించువలనుచెఱుపఁ
గాన దైవసహాయ్యంబు కలుగవలయు
ఆదినుండియు నదిలేక వ్యర్థ మెల్ల
దైవకృప రాదు దృఢభక్తి దనరకున్న

భక్తి లభియింప నెంతయుఁ బాటుపడుము
భక్తితోఁడుతఁ దీర్పుమీ పనుల నెల్ల

అస్మ జ్ఞానంబు కుదిరినయంతమాత్రఁ
బాసిపోవదు సంసారబంధ మెపుడు
ఎవ్వఁ డీబంధమును ద్రొల్త నిచ్చు వాఁడె
మానుపఁగను సమర్థుఁడౌఁ గాని, పరుఁడు
శక్తుఁ డెవ్వాఁడునుం గాడు చారుశీల!
ప్రకృతియును దివ్యశక్తియై ప్రబలి యుంట
దాని నియమింపఁ జాలినదంట హరియె.

అవనిపతి ద్రోపి చెఱసాలయందుఁ ద్రోచి
యినుపసంకెల బంధింప నెవ్వఁ డన్యుఁ
డట్టిబంధంబుఁ ద్రెంప సమర్థుఁ డగును.

వానిజ్ఞానంబు బలమును వ్యర్థమె కద
నరపతిని నేనె యని యన్న నగరె జనులు

వానికూఁతల వచ్చునా తేనికరుణ

ఎంతకష్టించినను మన మీశుకరుణ
కలుగకుండిన విజయంబు కలుగ దెపుడు

స్వప్రయత్నైకసాధ్యమౌ భావమందు
భక్తిహీనులు ముక్తిని బడయలేరు

కాన నారాయణునికృప కలుగుటకు

ప్రబలయత్నంబుఁ జేయంగ వలయు బుధుఁడు
యత్న మది యేదో యని భయ మందవలదు
తన స్వధర్మంబునందుండి తలఁగ కెపుడు
స్వామిపై భక్తి నింపినఁ జాలుఁ దల్లి.

సూర్యకిరణాభిముఖనుయి సుమము లెల్ల
మెల్లి గని వికసించును మెల్లమెల్లఁ
దమకుఁ దాముగఁ; దమ తేనె త్రాగుటకును
రావలెను దేఁటు లనియెడిభ్రాంతి లేక;
తేఁటు లరుదెంచు నందలి తేనెఁ ద్రావఁ
గుసుమములు పిల్వకున్నను గూర్మి మీఱ
వాని కటుసేయుటలు స్వభావంబు గాన;

అటులె భక్తుఁడు నారాయణాభిముఖతఁ
దనదుధర్మంబునం దున్నఁ దరల కెపుడు
భక్తిపూర్ణుఁడునై భగవంతుఁ డపుడె
తాను సంతోషమందుఁ దథ్యముగఁ దల్లి
దేవునిస్వధర్మ మదియయి తెలియఁబడుట.

దీనినే జ్ఞానమందురు తెలియువారు
దీని సాధించుమార్గముల్ తెలుపువాఁడ.

అహంకారజయము.

అవగుణవ్యాధులకును దివ్యౌషధంబు
వాసుదేవుండె సర్వమన్ భావ మొకఁడె

అమలగుణముల కెల్లను నాస్పదంబు
వాసుదేవుఁడె సర్వమ్ము భావ మొకఁడె
అట్టిభావంబు మదిలోన గట్టిపడఁగ
నెంతశ్రమియించి తేనియు నంతమేలు.

తొలుత నిది రాదు నీవెంత తొట్రుపడిన
క్రమముగా వచ్చు శ్రీహరికరుణబలిమి
గాన వ్యర్థంబు సేయకు గడియయైన
హరిని స్మరియించుచుండు నిరంతరంబు

అన్నిదుర్గుణముల కెల్ల నాదిమూల
మగు నహంకారమును ద్రొల్త నణఁపవలయు

అహ మనంగను నే నని యర్థ మమ్మ.
ఎవ్వఁ డేనియు దూషింప నీతనువును
నన్ను దూషించె నందును నయముపీడి
తనువు నే నను భ్రాంతిని దగవుమాలి.
నేను దేహంబ నౌదునే నిజము గనిన
పాంచభౌతిక మీమేను పంచదశల
షడ్వికారంబులనుగూడి జరగుచుండు
ఇట్టిజడమైనతను వేడ నే నదేడ
అజుఁడ నిత్యుఁడ శాశ్వతుం డయిన నేను
సచ్చిదానందఘనరూపుఁడ సత్యముగను
ఎవరు పొగడినఁ దెగడిన నేమి నాకు?

ఎవరు దిట్టంగఁ గలరొకో యిట్టి నన్ను?
ఎవరి కేనేమి చేసితి హేయపడఁగ
ఒక్కరికి నేను జేసిన దొకటిలేదు
చేసినవి యెల్ల దేహంబు చేసెఁగాదె.
కుడిచితినె నేను నాకేమి కడుప? నోర?
ఆఁకలియొ డప్పియో యేది నాకు లేదు
వీని నన్నిటి కలిగినమేనె తినును
అనుచుండును దత్ఫల మందుచుండు
కన్నులా లేవు దేనినేఁ గాంచుటకును
వీనులా లేవు దేనినేఁ వినుటకైన
చేతులా లేవు దేనినేఁ జేయుటకును
కాళ్లులా లేవ యెందేని కదలుటకును
క్షుత్పిపాసలు క్రోధంబు శోకకామ
భీవిషాదంబులజ్జయునావిగావు
త్వక్కునేఁ గాను, గరములు పాదములును
కనులు ముక్కును మూతియుఁ గాను నేను
నే నుపస్థంబునుం గాను నేను గాను
మజ్జమస్తిష్కమాంసముల్ మఱియు గోళ్లు
వెండ్రుకలునైన నెముకలు వీనిలోనఁ
గాను నేనేది యొకటైనఁ గలిపియైన
నేను గాను మనస్సు నేఁ గాను బుద్ధి
కాను నే చిత్తమును నహంకారమైనఁ

ప్రాణపంచకమైన నేఁ గాను గాను
గాన నివి చేయుచున్నట్టి కార్యతతులు
నేను జేసినయట్లౌనె నిక్కమరయ?
సాధకుఁడ నేను దేహంబు సాధనంబు.
దీనిఁ గొని నన్నుఁ జూడ నే తేరుమనుచు
యానముగ నిచ్చె నాత్మేశుఁ డైనశౌరి.

బండిలో నున్నవాఁడౌనె బండి యెపుడు
గృహములో నున్నవాఁ డౌనె గృహ మదెప్డు
కలము దానౌనె వ్రాయసకాఁ డదెందు?

అనుచు నీరీతిఁ దావేఱు తనువువేఱు
గృహాగతుండును గృహ మని యెంచవలయు
పలుకుచుండిన నీరీతి ఫలము లేదు
ఆసనము గెల్చి వాయుజయంబు నొంది
ధ్యాన మొనరించి యీరీతి ననుదినంబు
ధ్యానవేళను నాత్మను దనువు విడిచి
వెలికిఁ దీయంగ వలయును విడిచి భయము
కత్తినొరనుండి తీసిన క్రమముగాను.

అపుడు జీవాత్మ చూచుఁ బ్రత్యక్షముగను
దాను వసియించియుండిన మేనివిధము
వీడు విడనాడి గేస్తుండు వీథి నిలిచి
క్రమ్మఱఁగ మందిరంబును గాంచు నట్లు

ఇట్టి యనుభవ మాత్మలో గట్టిపడిన
నుత్తవేళల నే నిది హత్తి యుండు
ఇట్టిదశ గల్గుటకు శ్రమియింపవలయు

ఇట్టిభావంబు మదిలోన దృఢముపడినఁ
గడమ వెల్ల సుసాధముల్ కలికిమిన్న.

ఆత్మకు ననాత్మకు గల యంతరంబుఁ
దెలియుమార్గ ని దేయంచుఁ దెలియవమ్మ!
ఆత్మకు ననాత్మకును గలయంతరంబు
ధ్యానవేళల నీవాత్మఁ దలఁచువిధము
పలుకువాఁడను వినుము విస్పష్టఫణితి
నాదు మేనన మేను నే నౌదు నొక్కొ
వినుదు వీనుఁల గన్నులఁ గనుదు నోర
ననుదు నన మేను వీనులు నక్షియుగము
వాక్కు నేఁగా నటంచును స్పష్టపడును.
మనసుచేత నెఱింగితి ననిన యపుడు
కరణ మగుటను మనసు నేఁగాను గాను
నాదుప్రాణం బటన్నఁ బ్రాణంబుకంటె
నేను భిన్నంబు నగుటయు నిశ్చితంబ
ఎఱుకమాలి చరించితి నిన్నినాళ్ల
టన్నజ్ఞానంబు నే నెట్టులగుదు నొక్కొ
అనుచు యోజించి ధీమనః ప్రాణములును

నేను గానని మదిలోన నిశ్చయింపు
ఆత్మ యణుమాత్ర మున్ర్భాంతి యాడఁబడుట
జనని పరకాయములఁ బ్రవేశంబు గనుట
నంటి యంటక యుండు దేహంబునందు
ఆత్మకు ననాత్మలకు భేద మరయు మిట్లు
ఆత్మ నవలోకనము చేయుటనుచు దీని.
భ్రాంతిపడకుము దానిమార్గంబు వేఱు
హేయదేహంబుపైఁ బ్రీతి యొడలకున్న
కామరోషాదులను గెల్వఁ గానకున్న
భక్తి పుట్టదు సుమి భగవంతునందు
ప్రకృతిపై రక్తి భగవంతుపట్ల భక్తి
త్రాసుచిప్పలుగాఁగను దలఁపవమ్మ
ఒకటి తగ్గినఁ బైకేగు నొకటి గాదె?
ఒకటి యెంతెంత తగ్గ వేఱొకటి హెచ్చుఁ
గాదె యంతంత? యిది మది గనఁగదమ్మ
అఱగొఱగఁ జేయఫలమున నఱలు గొఱలె
అల్పమైనను వ్యాధి మేనంటి యున్నఁ
బలుకవచ్చునె యారోగ్యవంతుఁ డనుచు?
అటులె దేహాభిమాన మానంత యున్న
దవ్వవాఁడని ముక్తికిఁ దలఁపు నరుఁడు.
ప్రకృతిసంసర్గమునఁ జేసి వచ్చెఁ గాని
యాత్మకును సహజంబు గాదమ్మ భవము.

అమ్మ! దాసానిపువ్వు డాయంగ స్ఫటిక
ముంచినట్ల రక్తవర్ణమై మించుఁ గాదె?
కాయమున నుండుకతన సాంగత్యవశతఁ
దన్మయత్వంబు నొందుచుఁ దనువుచేయు
కార్యములనెల్లఁ దాఁజేయు కరణిఁ దలఁచి
తత్ఫలంబును భోగించుఁ దన్వి యాత్మ
వాఁడుతిట్టెను నన్నిదే వీఁడు నన్ను
నడిచె నంచును మేనితో నైక్యమొంది
బంధముల నిట్లు సృజియించి బాధపడును.
గాన మతిమంతుఁ డగువాఁడు తాను వేఱు
తనువు వేఱని దృఢపడఁ గనఁగ వలయు
కాన దేహం బొనర్చెడి కార్యతతుల
కర్త నేఁ గాన యని వితర్కం బొనర్చి
స్వాభిమానంబు మునుముట్ట నణఁపవలయు
జీవుఁడు ప్రయోజ్యకర్తయు దేవుఁ డొప్పుఁ
దాఁ బ్రయోజకకర్తయై తత్త్వ మరయ
ఇట్టు లగుట నహంకార మేల నాకు?
నే స్వతంత్రించి చేయు నదేదిగలదు?
చక్క సంకల్పరూపమా జ్ఞాన మాశ్ర
యించి యుండును జీవుని నిట్టు లగుటఁ
దనదుసంకల్పమునకు స్వతంత్రుఁ డతఁడు

దానిఁ గొనసాగఁ జేయఁగ దైవముండు
తనువు నింద్రియములును సాధనములుగను
దుష్టసంకల్పముల చేత దుఃఖపడును.
పుణ్యసంకల్పముల స్వర్గభోగి యగును
అంతయే కాని నిత్యసౌఖ్యంబు లేదు
ఎల్లసంకల్పములు నశియించుదాఁక.

నే స్వతస్సుఖి నే స్వయంభాస్వరుండ
జ్ఞానమున కాశ్రయుండ నజడుఁడ విభుఁడ
వృజినశోక విమోహ విహీనకుండ
నయ్యు నింతటిదుర్దశ ననుభవింతు
ఇంతకంటె నికృష్టత యెందుఁ గలదు
అనుచు నీరీతిఁ దలపోయ నహము చచ్చు.

—మమకారజయము.—

ఇటు లహంకారమును గెల్చితేనిఁ బిదప
మమతఁ గెల్వంగ యత్నింపు మదిని బూని

'మమ' యటన్నను నాదన్న సమమె సుమ్ము
అమరభాషను మమ యంద్రు నాంధ్రభాష
నాది యనియెద రింతయే భేద మమ్మ.

ఈశరీరంబు నాదని తేని తల్లి!
యెట్టులయ్యెనో నీయది యెఱుఁగఁబలుపు

ఈవు మేనను భ్రమ నశియించె మున్నె
నాశ మొనరింపు భ్రమ మేనునాది యనుట
సచ్చిదానందరూపివై జరుగునీవు
యెట్టు గడియించితో కొ యీమట్టికడవ.

ఈశరీరంబు నీదియే నింతకు మును
పున్న దేహంబు లెవరివో యెన్నవమ్మ

గుట్టగాఁ జేనుగా మఱిచెట్టు గాఁగ
పేనుగా గ్రుడ్డుగా మఱియేనుఁగుగను
నక్కగాఁ గుక్కగాఁ బంది నందిగాఁగ
బల్లిగా నల్లిగాఁ బులిపిల్లగాఁగఁ
దేలుగాఁ బాముగాఁగఁ దోడేలుగాఁగ
గొఱ్ఱెగా బఱ్ఱెగాఁగను మహిని నీవె
యెన్నికోటులరూపులో యెత్తలేదె.
యేదియో యిందు నీదేహ మెఱుఁగఁజెపుమ

నీకు బీజప్రదాతయౌ నీదుతండ్రి
గర్భమున మోచి కని పెంచి కష్టపడియె
నీదుజనయిత్రి; యిర్వురు నిన్ను నీదు
భర్తకును ధారవోసిరి ప్రజ లెఱుంగ
మానమును బ్రాణమును నీదు మగనిదె కద.
నాదుజనయిత్రి యనుచుండు నీదుసుతుఁడు
నాదుపుత్రిక యనుచుండు నీదుతల్లి

నాదుభార్య యటంచను నీదుమగఁడు
నాది యని యెందఱో నిన్ననంగ వినవె
మృతిని గూలిన నగ్నిభస్మీకరించు
నాలుగవజాతిమేనైన నక్కలు దిను
నెవ్వరిదొ మేను వీనిలో నెఱుఁగఁ బలుకు
నీదుకాయంబ యేనియు నిలుపఁగలవె
పాత యొందక యుండ సనాతనముగ?

ప్రకృతిపరిణామ మీశరీరం బటంచు
మున్నె చెప్పితి, నిల్పితే బుద్ధి యందు
భిన్న మగు నాత్మ; ప్రకృతి తద్భిన్న మనుచుఁ
బ్రకృతియును నాత్మ యీశ్వరు స్వమ్ములంచు
మున్నె చెప్పితి బుద్ధియం దున్నయదియె
అమ్మ! చెపుమిప్డు దేహ మెట్లయ్యె నీది?
స్వామిద్రవ్యంబు నా దనవచ్చు నమ్మ.
ద్రోహ మది గాదె? యెదవదే దోషమందు?
చోరునకు నీకు భేదంబు సుంతయైనఁ
గలదె దేహంబు నాదని పలికితేని?
అంతయే కాదు విను మింకఁ గొంతయుందు
భయదదుస్తరసంసారవార్ధియందు
మునిఁగి తేలుచు దరియేదొ కనఁగలేక
బహుళదుఃఖపరంపరాపటలిఁ జిక్కి

సంతపించెడి నినుఁ గాంచి సదయుఁ డగుట
దీనవత్సలుఁడగుటను దేవదేవుఁ
డిచ్చె నీనావ దీనితో వచ్చి యొడ్డు
చేరి యిద్దాని మరల నన్ జేర్పు మనుచు.

అట్టిచో నావ నాదని యంటివేని
నిన్ను మించుకృతఘ్నుయు నెన్నఁబడునె?
కుంటివానికి నీవొక్క గుఱ్ఱ మిచ్చి
సౌఖ్యముగ నిల్లుచేరి యశ్వంబుఁ బనుపు
మన్న నాతండు నాయది యశ్వ మన్న
నే మటందువు చెప్పవే భామ! నీవు.
ఈశరీరంబు నాదంట యిట్టిదగును.
కాన ననకుము నాదని మేని నెపుడు
పారమార్థికబుద్ధిని బ్రాజ్ఞురాల
లోకతంత్రార్థ మనినను లోఁదలంపు
మపుడె యిది యెల్ల బూటకమంచు మదిని
దేహసంబంధవస్తు వేదేని నీది
యెట్టులయ్యెనో చీరయో యిల్లో ధనమొ
సొమ్ములో భూములో వాహనమ్ము లైన
ధాన్యమో నీది యనుటయుఁ దగునటమ్మ.
తెచ్చితివి దేని నీవిందు వచ్చునపుడు
ఏది కొనిపోవుదానవో యేగువేళ
దీనిచేఁ గాదె నీకు మున్ దెలిపినాఁడ

నాత్మనిక్షేపమొనరింపు మఖిల మనుచు.
యోగకాంతను నీవచ్చియున్నయపుడు.
దానిచేఁ దీఱు భ్రమమెల్లఁ దత్త్వయుక్తి.
చేయుచున్నావె యాభంగిఁ జెప్పవమ్మ.
అట్లుచేసితి వేనియు నహరహంబు
మమత మొదలంట సమసెడిమాట నిజము
అంతయే కాదు తల్లిరో యహరహంబు
పూఁటపూఁటయు నీవిది బుద్ధి నిలిపి
యభ్యసింపుము మమత లయంబునొందు.

అహము చక్కఁగ నీకు నభ్యాసపడిన
దేహ మున్నట్లు దోఁపదు దేహిమాత్ర
మున్నయట్టులు దోఁచు నీకుల్లమందుఁ
జిత్తమంతయు దానిపై స్థిరము పడుట
ఘటముపగిలినదీపంబు పగిదిగాఁగ

వాసుదేవుండె సర్వమను భావ మపుడు
సంస్మరించిన జలధిమత్స్యంబురీతి
నారబయలను దీవ్రాంశునాతపమున
వెలుఁగుదీపంబుకరణిని దెలియఁగలవు.

సర్వదశలందు మేలిది జ్ఞప్తినుంచ
దేహ మిదివాస్తవంబుగ దేవళంబ
తాన మాఁడెడుపట్టున దైవగృహముఁ

దలఁపు ప్రక్షాళితముసేయు దాననసుచు
క్రొవ్వుగలిసినసబ్బులరుద్దవలదు
తాఁకరా దది హేయపదార్థ మగుట
హృదయకమలాసనస్థుఁడై యెప్పుడుండు
దైవమున కభిషేకమ్ముగ దలఁపునిలుపు
జలములను నీవు త్రాగెడిసమయమందు.
స్వామికి నివేదనం బనుభావముననె
తల్లి భుజియింపు వేళ్లొండు తలఁపుమాని.
ముద్దముద్దకు వేళ్లొండు బుద్ధిలేక
సుద్దులను మాని గోవింద సూక్తి దలఁపు.
ప్రాణవాయువు లోఁగొనుపట్టులందు
దేవునకుఁ జామరము వీచు తెఱఁగుదలఁపు
ప్రాణవాయువు వెలిఁబుచ్చు పట్టులందుఁ
గసవువెలిఁబాఱవోసినకరణిఁ దలఁపు
కలదు దేవాలయములఁ ద్రికాలపూజ
కాన మధ్యాహ్నభుక్తి యక్రమముగాదు
తలఁపునఁ మీఁది హితబోధ నిలిచియున్న
నంతరాంతరముల నేది యంటవలదు
జిహ్వాకాచాపలంబునఁ జెడెద వీవు
భావ మీరీతి స్థిరపడఁ బాటుపడిన

అమ్మరో పల్కు మేయూ రహంమనుతలు
నీది యేయూరు తలపోసి నిజము దెలిసి

క్ష్మ్రాంత సర్వంబు బోధింప వలనుపడదు
అంతయును దెల్పువాఁడ సమక్షమందు.
ఇంతకును మించి తెలియంగ నీహా యున్న
ఇల్లు నాయది యంటివయేని నీవు
నీకుముందెందఱుండిరి నీకు వెనుక
నుండు రెందఱో తర్కింపు ముల్లమందు
ఒకరు పోయిన వెనుక వేఱొకరువత్తు
రేని సత్రంబునకు నింటి కేమిభేద?
మందువా నాది సత్రమం చందునుండి
అటులె నాభూమి నాధనం బన్నయపుడు
నాది నాదని యెందఱన్నారో ముందు
వెనుక ననువార లెందఱో కనుము మదిని
భర్త ప్రాణేశ్వరుండౌట పడఁతి యెపుడు
భర్త నావాఁడటంచును బలుక నగును
ఈశునకు భర్తకును భేద మేమిలేమి.
భార్యయును భర్తయును ననపాయు లెపుడు
భర్తకును భార్య యాత్మయై పరిఢవిల్లు
తక్కినది యెది నాదని తగదు పల్కఁ
గడుపునను బుట్టినట్టియాకొడుకు నైన
ఋణవశంబున వచ్చెనం చెంచవలయు

తల్లిదండ్రులు నిట్టిరే తథ్యముగను.
కాన మమత వహింపఁగఁ గాదు నీకు.
సచ్చిదానందరూపుఁడై జరగునాత్మ
కామరజ్జులఁ బ్రకృతిచేఁ గట్టఁబడుచు
భయదసంసారవార్ధిఁ ద్రోవంగఁబడియె
వేశ్యవలఁ బడినట్టి దుర్విటునిఁబోలి
కామ మెంతబలిష్ఠంబొ కంటివమ్మ
కామమే పాపముల కెల్లఁ గారణంబు
కామమే కష్టములకెల్లఁ గారణంబు
కామమే కద సకలదుఃఖముల నెలవు
కామవిజయంబు మిగులదుష్కరము సుమ్ము
కామమున కంతమేదియో కానరాదు
నించితిని జాలు నిఁక నని యెంచరాదు
వహ్నిలో నేయి కట్టెలు వైచునట్లె
యగును దుష్పూర మును సుదురాసదంబు
ఆశ్రయాశంబు దహియించు నాశ్రయమునె
దాంతునేఁ శాంతునేని నేకాంతినైన
నిమిషమున బోర్లఁద్రోయును నిర్దయతను
విషము మ్రింగియు శివుఁడు జీవింపఁ గలిగె
కాముజలఘటదాసుఁడై క్రాలినాఁడు
హరుననినయనాగ్నిఁ గ్రాఁగియు స్మరుఁడుబ్రతికె

పగనుసాధించె ననఁగఁ దాత్పర్య మేమి?
ఒక్కరూపునఁ గాముని నుక్కడంప
వేఱురూపంబు గొని బయల్ దేరుచుండు
కాము గెల్వఁగ వలెననుకాంక్ష గూడఁ
గామమే గాక వేఱెద్ది కలదు చెపుమ.
కామమే కద యపవర్గకాంక్ష యైన
నిట్టిదానిని గెల్వంగ నెట్లు లగును?
మోక్షమును గోరువారికి మొదటివైరి
కామమే యది గెల్వ దుష్కరము సుమ్ము.
ఎన్నిరూపులనో తలయెత్తి తిరుగు.
కాన భక్తులు ముక్తికై కాంక్ష గొనరు.
మనసిజుం డఁట కాముండు మన్మథుఁ డఁట
పుట్టినింటినె పీడించుపుణ్యుఁ డతఁడు
తక్కువారలు వానికి లెక్కగలదె?
కామునిం గెల్వ నీమదిఁ గాంక్షయున్న
వాఁడు పుట్టెడునెలవును వానియాట
నెలవు ధ్వంసంబుచేయుము చలముపట్టి
రూపములఁ గావు వానివేగాతిశయిత
కామునకు భార్య రతియఁట కంటె దీని
దీనితాత్పర్య మెదలోనఁ దెలియవమ్మ.
తల్లి! రతికిని నెల వుపస్థమ్మ గాదె.

దాని కైకాదె సంసారతంత్ర మెల్ల.
దానికైకాదె కర్మతంత్రమ్ము లెల్ల
దానికైకాదె సకలదుఃఖంబు లెల్ల
జంతువులు పుట్టుటయు నుపస్థమునఁగాదె
జంతువులు చచ్చుటయు నుపస్థమునఁగాదె
కావున నుపస్థమును గెల్వఁ గడఁగవలయు
ముక్తిఁ గాంచఁగ మిగుల నాసక్తి యున్న.

స్త్రీలు పురుషులఁ బురుషులు స్త్రీలఁ దిట్టఁ
గారణము లేదు చెఱచెడివార లనుచు
నొకరు చేసెడిపనిగాక యుంట రతియు
నిర్వురును దోషులే యని యెంచవన్న.
కోమలీ చూడుమీ రతీకాములందు
మగఁడు చచ్చినఁ జచ్చును మగువగూడ
మగువ చచ్చిన మగఁడును జచ్చినట్లె.
కామ మనఁగను గోరిక, ప్రేమ రతియె
ఒకటి చచ్చినఁ జచ్చు మఱొక్కటియును
ప్రేమ లేకున్నఁ గోరిక పెరుఁగఁబోదు
గోర్కి లేకున్నఁ బ్రేమయుఁ గూడఁబడదు
ఆయుపస్థంబునకు ముఖ్యుఁ డైనహితుఁడు
వాయి యంచుఁ దలంపుమీ వాస్తవమున.

గెలిచితేనియు జిహ్వను, గెలిచి నట్లె

చాలభాగ మసత్యము సత్యముగను
బూర్ణజయ మని నమ్మంగఁ బోల దెపుడు
ఆపరాశరకౌశికు లాకులలము
భక్షణముచేసి వశులైరి భామినులకు
ఋషిసతుల్ చెడి రల్లె పురుషులఁ గాంచి
కనులు వీనులు త్వక్కును ఘ్రాణజిహ్వ
లందు జిహ్వను గెలుచుట యరిది సుమ్ము
కష్టమైన నసాధ్యంబు గాదు వింటె
ఇద్దిగెల్చినఁ దక్కిన యింద్రియముల
గెలిచినట్టులె దీనిని గెలువకున్నఁ
దక్కినవి గెల్చుటనఁగ వృథాశ్రమంబు
కామజయమును గానంగఁ గడఁగితేని
నింద్రియంబులఁ దొలుత జయింపవమ్మ
కామము వసించు నెలవులు గాన నివియు.

దశేంద్రియజయము.

వాక్కును జయింపు మౌనంబువలనఁ గాని
సత్యభాషణమునఁగాని సర్వకాల
సర్వదశలను భగవంతుస్మరణమునను
హస్తములను గెల్వు మపరిగ్రహంబుచేత
దానగుణమున మఱి యిష్టదైవపూజఁ

జరణములను బ్రదక్షిణాచరణములను
స్వామికైంకర్యమునకుఁగా సంచరించి
మితసుభుక్తిని బాయువు హతముసేయు
వ్రతతపఃప్రాణజయముల బలముచేత

బ్రహ్మచర్యంబుచేత నుపస్థ మణఁగు
తపముచేతను దేహంబుఁ దరము గెలువ
భక్తివైరాగ్యముల గెల్వవచ్చు వీని
గంధము నలంది వెంటనె కడిఁగివైచి
బూదియైనను బేఁడైన బురద యైనఁ
బూయుమీ మేనఁ గొంకక పూర్ణతుష్టి.
పాన్పుపైఁ బండి యద్దానిఁ బాఱవైచి
పత్రములయందో ఱాలనో భస్మమందో
వల్లకాటనో పండుమీ వనమునందో.
చినిఁగి మాసినచేలంబులను ధరింపు
కొాతుకు మదిలేక చప్పిడికూడు దినుము
భోగములమీఁద మనసును బోవనీకు
దేహమున నభిమానంబు దెగడినిట్లు.

కాఁడిదూరంబు మించి నీకన్ను లెపుడు
దవ్వు చననీకు నడచెడి తరుణముందుఁ
దప్పలే కనుఁగొమ్ము సుందరములందు
దీర్ఘకాలంబు వానిపై దృష్టి నిడక

గ్రక్కునను ద్రిప్పివైపుము కనుల నవల
చిత్రవర్ణముల్ పూయఁగఁ జెలువుమీఱు
పేఁడబొమ్మకు దీనికి భేద మేమి?
యని వితర్కింపుమీ చిత్త మందునీవు.
కవులకూఁతలు నిజమని కనకుమమ్మ.
తరుణులను గన్న శవములకరణి నైనఁ
దల్లిదండ్రులుగా నైనఁ దగును జూడ
అన్న యని నాయనా యని యహ్నమందు
రేల భార్యలుగా నుండు లోలనయన
లున్నవార లెఱుంగుడు నుర్వియందు
వంచకులమాట మనకేల వలదు తల్లి

గ్రామ్యగానంబులకు నీకు కర్ణములను
ఆటరకుఁ బాటలకుఁ గాఁగ నరుగవలదు
పాడుకొనవమ్మ నీనేర్చుపాట లీవు
భక్తిరసపూరితంబులై పరఁగె నేని.
పొందుపఱుపుము సాహిత్యమందు మదిని
లీలఁగాఁగ లభించు మనోలయంబు
రాగతాలలయములు మూర్ఛనలునెల్ల
రమణిరో వ్యర్థములు భక్తిరసము లేక.

జిహ్వను జయింపఁగా నీవు చిత్త మిడిన
సాత్త్వికాహారమునె కొమ్ము సర్వదశల

సర్వవేళల మితముగాఁ జాల వలదు
కృత్రిమాహారములమీఁద నిడకు మదిని
నీరమో పాలొ గొనుము పానీయములుగ
వంటవండినయవి గొనవలదు నీవు
భైక్షమును దేవతాన్నంబుఁ బాయ విడిచి.
యందు దోషంబు దొడర దేయన్నమైన
భైక్షమును దిన నీకేమి పనియు లేదు.
తద్విచారంబు నీకేల? తగదు విడువు.
బియ్యపం డ్లాలపాలును, దేనె, చమురు
కలుగుపప్పులు, స్థిరములు, కనులకింపు
గూర్చునవి, సాత్త్వికంబులు గొనఁగవలయు
అతివయివె, శుద్ధసాత్త్వికాహారము లన.
కూరగాయలు బియ్యంబు గోధుమలును
పప్పులును నాల్గువిధములు పంచశాక
ములును నేయియు వంకాయ పొట్లకాయ
బూదిగుమ్మడి సాత్త్వికములగుఁ దినఁగ.
కదళి చక్కెర కలకండ కందమూల
ములను బీరయు శొంఠియు భోజ్యము లగు
అగ్నితప్తంబు గాకివి యారగింప
రమ్యములుగాని రెండవరకము లయ్యె
ఎంతజంజాటమెడలిన నంతమేలు
భుక్తివిషయంబునం గాన భోజ్యములుగ

శుద్ధసాత్త్వికములఁగొనబుద్ధి గొనుము
వీన నెపుడైనఁ గొనవచ్చు దేని నేని
నంతమాత్రానినియమంబు హాని లేదు
దామసము రాజసంబును దాఁకవేని.
షండుఁడును బతితుండును శాత్రవుండు
కులట యిచ్చినదానిని గొనకు మెపుడు
తెలియక ప్రమాదవశమునఁ దింటివేని
యుపవసింపుము రేపగ లొక్కనాఁడు
గొను విరేచనమునకును గొతుకు లేక.

ఉప్పు పులుసును గారంబు నుష్ణకరము
లైనయవి, నాల్క చుఱ్ఱను నవియు దాహ
కరములైనవి చేఁదైన కాకరలును
రాజసాహారవిఖ్యాతిఁ గ్రాలునమ్మ.
ఆమయము దుఃఖశోకంబు లబ్బుదీన.

సాత్త్వికాహారమైనను జాలఁ దినిన
రాజసము తామసంబునై క్రాలుచుండు
రమణి! యిద్దాన విందోత్తరమునవారు.
సాత్త్వికాహారులయ్యును సత్త్వగుణము
గనక యున్నారు బలమును గలిమి గలిగి.

చలిది పాసినయదియు రసంబులేని
యదియుఁ జెడువాసనను గల్గునదియు

మత్తు గలిగించునవియును మదము గూర్చు
నవియుఁ దలఁపుము తామసాహారములుగ
మునఁగ సొరయును వెల్లుల్లిఁ గొనఁగఁబోకు
మెట్టగడ్డయు ముల్లంగి యింగువయును
గోఁగుకూరయు భుజియింపఁ గూడదమ్మ
కల్లు సారాయి పొగయాకు కాఫి యెఱచి
కోకొ తేయాకు స్మరియింపఁగూడదమ్మ
ఎంతశుద్ధాన్న మైనను నంతమేలు.

మనము దినియెడియాహారమున శరీర
మేర్పడుచునుండు, సూక్ష్మప్రకృతియె మనసు
కాన నాహార మెట్టిదో మానసంబు
నట్టిదై యుండుఁ గాన నిరంతరంబు
శుద్ధ సాత్త్వికభుక్తినే బుద్ధి నిడుము
శుద్ధభుక్తిని మనస్సును శుద్ధమగును.
స్మృతియు ధ్రువ మగు నమ్మరో చిత్తశుద్ధి.
గ్రంథు లన్ని ధ్రువస్మృతిఁ గడనుగాంచు
గ్రంథు వెడలిన మోక్షంబు కరగతంబు.

తిండిపోతులు కొందఱు తెలివిలేక
యెట్టియాహారమును దిన్న నేమియంద్రు
వీరి కున్నంతమాత్ర వివేక మేది
పలికెనే శుద్ధభుక్తిఁ బ్రాఁబలుకు లెల్ల

చమురు స్వచ్ఛంబయేని దివ్వె స్వచ్ఛ మగును.
మలినతైలంబు పోసిన మసకగొనును

క్రూరములు మాంసమును దినుకుక్క లెపుడు
సౌమ్యమౌ నన్నమును శ్వాన మెపుడు.

కానఁ బరిశుద్ధభుక్తిని మానకమ్మ
సమసిపోవును జిహ్వాకాచాపలంబు.

దేహధారణమునకెంత తినఁగవలయు
నంతయే తిను, మిగుల నావంతవలదు.

అమితభుక్తిని నాయువు సమసిపోవు
ధాతుసామ్యంబు చెడి రుజల్ దాపరించు
మనసు చలియించు, నిద్దుర, మఱపు హెచ్చు
గామరోషాదులును వృద్ధిఁ గాంచుచుండు
అధికభుక్తిని నరకంబు ప్రాప్త మగును
నిచ్చ మలమూత్రబాధయుఁ బెచ్చుపెరుఁగు.
ఉక్తిభుక్తులు మితములై యుండవలయు.

నీటిచే గాలిచేఁ దినుకూటిచేతఁ
బ్రాకృతపుఁబరమాణువుల్ వచ్చుచుండు
మేనిలోనికి నిమిషనిమేషమునను.
స్వేదమలమూత్రరేచకవిధులచేత
నిమిషనిమిషంబునకు శరీరమును విడిచి

పోవుఁ బ్రాకృపరమాణువులు సతంబు
అమ్మ! నామేన నేఁడున్నయణువులందు
నుండ దేడేండ్లకవ్వాల నొక్కటైనఁ
గాయతత్త్వంబె మాఱును గ్రమముగాఁగ
దనువుతో మాఱుఁజుమీ మనస్తత్త్వ మెల్లఁ
దాను భుజియించువస్తుతత్త్వంబుకొలఁదిఁ.

గనుక నెదితిన్న నేమని యనెడువాఁడు
తెలిసి చెప్పెడివారని తలఁపవలదు.

తాము చేసెడిదాని సిద్ధాంతమంచుఁ బ
వదరుచుందురు నోటికి వచ్చినట్లు.

తాను చెడుటయు బాగౌట తనదుచేతి
లోనికార్య మటంచెంచు మానసమున.

సాత్త్వికపుభుక్తి లేక నీస్వాంత మెపుడు
శాంతిపొందంగఁ బోదంత శ్రమముపడిన.

ఘ్రాణజయ మెంతయును ముఖ్యాంగంబు గాదు
ఇట్లు గెలువంగ వచ్చు దశేంద్రియములు.
జిహ్వాకాచాపలంబునఁ జెడియె మీను
చెవులచపలత్వమునఁ జేసి చెడియెఁ గురంగ
పక్షి వలఁబడి చచ్చును గుక్షివలన
ఘ్రాణరంధ్రంబుచే భ్రమరంబు చెడియెఁ

స్పర్శలంపటమునను గజంబు చెడియె.
తెగియె నైదును నిట్టులైదింటిచేత
నైదిటికి వశుఁడైయున్న నాతఁ డేమి
సౌఖ్యముగ జీవనముచేయ సాధ్యపడును.

## మనోజయము.

జనని! వినవమ్మ యింక మనోజయము విధము.
జయము నిద్దానఁ గొనుట దుస్సాధ మమ్మ
ఏకవిధమున దీని జయింప లేవు.
పెక్కుతెఱఁగుల దీనిని నుక్కడంపు.
అన్నియింద్రియముల గెల్చు టనఁగ నేమి?
మనసును జయించుటే యనుకొనుము తల్లి
ఎట్టియింద్రియమైనఁ దానేమి సేయు
మనసుదోడ్పాటు లేకున్న వినయశీల!

కనులు కనియును గనలేవు మనసులేక
వినియు వినలేవు వీనులు మనసులేక
తినియుఁ దినలేదు జిహ్వాక మనసులేక
యిట్టులే చూమ్ము తక్కిన యింద్రియములు.

వేణువున గాలి చొరఁబడి వెడలునపుడు
ఒక్కొకస్వర మొదవు నొక్కొక్కరంధ్ర
మందు నట్టులె యొక్కొక్క యింద్రియమున
నిలిచి యొక్కొక్కకార్యంబు సలుపు మనము.

గెలిచి తొమ్మిది యొక్కటి గెలువకున్న
నట్టిత్రోవన వెలివచ్చి నన్నిగెలుచు
తనువె పెనుకోట యనుచును దలఁపవస్తు
దాని గవఁకులు పదియయి తనరుచుండు
దానిలో నుండు మన సనుతస్కరుండు
వాని వశపడఁజేయంగ వలయు నీవు
తొలుత, నాశల నాశంబు సలుపవలయు.
మైత్రిచేతనొ గాకున్న శాత్రవమున.
అన్నిద్వారంబులనుమూసి యున్నఁగాని
వచ్చుఁ బోవును వెలికిఁ దా నిచ్చ కొలఁది

కటికిచీఁకటి గదిని నేకాంత ముండి
రంధ్రనవకంబు బిగియించి రమణి! చూడు.
మనసు నిల్చునొ యేమొ యేమాత్ర మైన
మూఁడులోకంబులందును గ్రీడసలిపి
మరలఁ ద్రుటిలోనఁ దానున్నయిరవు సేరు.

మనసును జయించుగతులు కుంభకము, విరతి,
భక్తి, యభ్యాస, మనియండ్రు ప్రాజ్ఞజనులు
శ్వాసమే మానసమునకు వాహనంబు
దానిబంధింప నిలుచును మానసంబు
వాహనమును నిల్ప రాతును వలయు నిల్ప
శ్వాసమును గుంభకమున నభ్యాసపడును.

ఆసనమునుండి సమముగా శ్వాస ముంచి
మఱి విలోకింపు మన సేగుమార్గములను
దానిత్రోవలు కనిపెట్టి తేని నీవు
బయలఁ బోకుండు సుమి రాచపడఁతియట్లు
చోరుఁ డాటను నీవు తఱ జూచువేళ
వెలికిఁ బోకుండఁ బడియుండు వినయమునను
ఎప్పుడో యేమఱించి తా నేగు వెలికిఁ
బోయెనేనియు వెండియుఁ బూనికట్టి
తెచ్చినిలువుము సలువుము ముచ్చికమర.
మంచిహరికథలను స్మరియించుకొనుము.
అటులు గాకున్న దానికాహ్లాదకరము
లైన వానినె చింతింపు మాదియందు.
వెలికి నదిపోవ నీడ్వంగ బలిమినీవు
ఇట్టిపోరాట కొన్నాళ్లు పెట్టుకొనినఁ
దిన్నతిన్నగ నీకు స్వాధీనపడును.

మనసును జయింపఁ బనిపూను మానవునకుఁ
బరమసాధనమౌ హరిభక్తి యొకటె
దాని మించినదెది లేదు తథ్యముగను.
మనసు విలయించు; గుణముల ఘనత చెడును;
ఇట్లు బోధించె నరునకుఁ గృష్ణమూర్తి
మనసును జయింప వలెననుమనసె యున్న
మనసు కావలె నన్నది, మానవలయు.

వలదటన్నది చేయంగ వలయు నీవు.
మనసునకుఁ బ్రియమైనవి మానవమ్ము
అప్రియంబులె కొనుచుండు మహరహంబు.
వానిపై మచ్చికనుగొన్న మానసమును
మార్పు మిట్లైన లోపడు మనసు నీకు
కాకరలు చేదు గావునఁ గాంక్షగొనదు.
మనసు దానిని భక్షింప మాను మనును.
అట్టు లది చెప్ప నీవేమొ యవియె తినుము
కాకరయుఁ దీపె చేఁదేమి గాదటంచుఁ
జెలమునను గొన్నినా ళ్లట్లు సలిపి తేని
కాకరయె నీకు నింపుగాఁ గానిపించు.
వలవ దనిచెప్పఁ టుడుగు నావలను వింటె
అపుడు కాకర చేఁదె తియ్యనయుఁ గాద
టంచుఁ దలఁచుచు భక్షింపు మమ్మదాని
మనసునకుఁ జేఁదుగాఁ దోఁచు మరల నదియె
చిత్త మాడింపు మిటుల దాక్షిణ్య మెసలి
అవలనౌఁ గాదటంచేది యనుట మాను.
మనసు వశపడు చక్కనిమార్గ మిదియ.
అవల సత్కార్యములయందె యనుపు మదిని
మాఱుపల్కక చనును నీమాటఁబట్టి.
ఆసనజయంబు శ్వాసజయంబుఁ గూర్చి
వెనుక వివరించెదను నీకు విశదపడఁగ.

కనులు మనసును వాక్కు నేకంబుఁ జేసి
దెసలు చూడక తూఁగక నుసులుకొనక
పరులతో మాటలాడక ప్రత్యహంబు
రామకోటిని వ్రాసితివా మనంబు
మానసము చంచలత్వంబు మాను నమ్ము

అట్టులే బియ్య మెంచిన నట్టిఫలము
పండుకొని రేయి యాకాశపథముఁ గనుచు
చింతలను మాని మనసును స్థిరముఁజేసి
చుక్కలను నల్లె యెంచినఁ జిక్కు మనసు.
జపము నట్టులె చేయఁ జంచలత మాను.

ఇన్ని చెప్పంగ నేటికి నెట్టిపనిని
జేసినను దన్మయత్వంబుఁ జెందచేయు.
మనసు చెదరక నిలుచుఁ గ్రమక్రమమున

కావవలయును గడిదొంగఁ గాచినట్లు
సర్వవేళల మనసును సర్వగతుల

ఇంతచేసియు వైరాగ్యహీన వైన
నీవు గెలువంగ నేరవు నీదుమనసు.

## వైరాగ్యము.

రాగ మనినను ప్రేమయు రక్తకాంతి
రక్తి విడిచినవాఁడు విరక్తుఁ డయ్యె.

చాయ నద్దినవస్త్రంబు చాయ చనిన
మరల శుభ్రంబుగాఁదోఁచు కరణిఁదల్లి.
చాయ నద్దినవస్త్రంబు చాయఁ బాప
నెంతశ్రమపడవలయునో యెఱుఁగ లేవె

అయిదు నిమిషాల నద్దినయట్టిచాయ
యెంతశ్రమియింపఁ జన దొక యేఁటనైన
కోట్లకొలఁదులజన్మాలఁ గూడియున్న
రాగమును బాపుటన సుకరంబె తల్లి?
ఎందు రాగంబొ ద్వేషంబునందె యుండు.
రాగమును ద్వేషమను నవి ప్రత్యగాత్మ
సహజగుణములుగావమ్మ సత్యముగను.

ప్రకృతిసాంగత్యమునఁ జేసి వచ్చె నవియు
గాఢదాసుండు నైనట్టి కారణమున.

దేహమునయందు మోహంబు దీఱనేని
నవియు నశియించుఁ దమకుఁ దా మమలచరిత!

అమ్మ! దేహంబు నున్నదున్నట్లు చూడ
మాయమగును దదీయాభిమాన మెదను.

కాలు మొదలుగఁ దలదాఁకఁ గలయఁజూడు.
తోళ్లు వెంద్రుకలును మాటి గోళ్లుగాక
వెండి బంగారు రతనాలు వెలయు నేమొ.

జింకతోళ్లను బులితోళ్లఁ జెప్పనేల
శునకచర్మము నేదేని పనికివచ్చు
మనుజచర్మంబు దేనికిఁ బనికిరాదు.
చమరి సెంద్రుకలైనఁ బూజ్యములె యగును.
నరునిరోమముల్ దేనికిఁ దరముగాదు.

వ్యాఘ్రనఖములు దేనికేఁ పనికివచ్చు
దంతియెముకలవెల యెంతొ తలఁచిచూడు
వానితోఁ బోల్చి చూడుమా మానవునివి.

తనువులోపల మాంసరక్తములు క్రొవ్వు
శల్యములుగాక యేమి యమూల్యవస్తు
వున్నదో యమ్మ! యున్నదున్నట్టు లనుమ.

మలపురీషఘటంబుపై మమతయేల

ఆత్మకును బెనువ్రణము దేహంబు సుమ్ము
పుంటిపైఁ గట్టుబంధముల్ పుట్టములగు
స్నాన మనఁ బుండుకడుగంగ జలముపోఁత
అన్న మనఁగను వ్రణలేపనౌషధంబు.

మాంస మెముకలు రక్తంబు మలము క్రొవ్వు
మూత్రమును బ్రేవులును నిండి గాత్రముండు
నెంతకసుమాలమో దీని నెంచఁదరమొ?

దీనిలోనుండి వెలివచ్చువానిప్రేలఁ

దాఁక రానట్టి హేయపదార్థములగు
నెంతపరిమిళమును గల్గి యెంతరుచ్య
మైనవస్తువు లోనికి నరిచినంత
ముక్కుమూయంగవలసినపూతి యగును.

ఎంతచందనమును బూసి యెంతదోమి
యెన్నిస్నానాలఁగడిగిన నేమిఫలము?
కంపుతోఁ గూడి చెమటలే కాఱుచుండు.

ఒక్కదయ్యంబు నివసించియుండునింటఁ
గాపురముసేయ నెంతో దుఃఖంబుగలుగు.

నట్టిచో నైదుభూతంబు లంటియున్న
కొంపలో నెట్టులుండనౌ గోడుకొనక?
ఘటమునం దొక్కరంధ్రంబు కలదయేని
నిమిషమున రిత్తదగుట వర్ణింపవలెనె?

ఇంకఁ దొమ్మిరంధ్రంబు లెనఁగెనేని
నాఘటంబువిధంబును ననఁగవలెనె?

కుండకును గ్రిందివైపున రెండుచిల్లు
లున్న నేముండు దానిలో నువిద చెపుమ?
వానిఁ గావనివాఁ డుత్తవ్యర్థుఁడె కద.
గోరుపడినట్టిగేహంబు గోలుకొనద
టంద్రు గోల్లిన్నియున్న శ్రేయంబు గలదె?

తలుపులును దాళములు నుండు తద్భవనము
కాచుటెంతయుఁ గష్టంబుగాదె మనకు?
హెచ్చరికయెంతొ కల్గియు నెల్లవేళఁ

దలుపులును దాళములులేని ద్వారనవక
వసతిఁ జోరులు చొరకుండ వశమె యాఁప
నింటియాతఁడు తూఁగుఁబోతేని చెపుమ?
తనువొ యల్పంబు నే జగద్వ్యాపకుండ
నస్థిరము మేను, నేనన్న సుస్థిరుండ
నవ్యయానందమూర్తి నే, నఖిలదుఃఖ
ములకు మూలంబు దేహంబు, వెలయు దుఃఖ
మిశ్రమయి దుఃఖమునె తెచ్చుమీఁద నెపుడు
మఱి గనఁ విపరీతాభిమానమూల
మగును స్వాభావికానంద మపహరించు
దాయ యనుచును ధ్యానింపఁ దరము మేని

ఇట్లు దలపోసి తలపోసి హేయ మిదియు
దీనిపై నభిమానంబు మానవలయుఁ
గష్టమే కల్గు దీని సాంగత్యమున ని
జంబు దీనిని సపరిచ్ఛదంబు గాఁగ
విడిచి సుఖియింతు నని పూన్కిఁ గడఁగవలయు.

వ్రతములను దపముల నుపవాసములను
మిగులఁ దపియింపఁజేసిన మేను నిలదొ

యంచు భయమందకుము తల్లి! యల్పమైన
ఇట్లు చేయుచుఁ జచ్చిన నింతకంటె
గష్టమో హీనజన్మంబొ కలుగఁబోదు.
నాకలోకసుఖంబులే ప్రాప్త మగును.
యాతనా బాధ లాదవెడిభీతి లేదు.
ఉత్తమంబైన జన్మంబె యొదవఁగలదు.
కాన భయమేమి మరణంబు కలిగె నేని?

చావకుండఁగ నజునకేఁ శక్య మగునె?
నేఁడో రేపో మఱియుఁగోటి యేఁడులైన
నపరిహార్యంబునకు నేల యంగలార్ప

చివికి చినిగిన చేలంబు దవులఁబాఱ
వేయఁ దగు నేస్వ నేటికిఁ బోయె ననుచు.

కాయములు రాకయుంట దుర్ఘటముకాని
కలుగుటందేమి చిత్రంబు గానఁబడదు.

పతితుఁడో భ్రష్టుఁడో మహాపాతకుండొ
నరుఁడు గాఁడేని భయమేమి మరణమునకు?

చచ్చి యుద్భిజ్జముగ, స్వేదజంబ నైతి
స్వేదజంబుగ మరణించి వెలయఁ గంటి
యండజంబుగ, గ్రుడ్డునై యంతమంది
యైతిని జరాయుజంబుగ నందుఁ బశువు

గాఁగ మరణించి నరుఁడనై క్రాలఁగంటి
ఎన్నఁడేఁ నష్టపడితినే మృతిని గనుట.
అనుచు యోజించి చావుభయంబు మాని
దపము వ్రతములు ధీరత తగులు లేక.
మాని దేహాభిమానంబుఁ బూనవలయుఁ

ఏను జచ్చిన నావారి కేమి గతియొ
యని విచారంబు మానఁగ నగు వివేకి.
ఎవరి గతులకు వారలే హేతువగుట.

తాను బూర్వంబు చేసినదానధర్మ
పుణ్యములఁ బట్టి తానిలఁ బుట్టునపుడె
తనదుకొంగునఁ దాఁగట్టుఁ దనదుకూడు
దీన నావంత లేదు వందేహ మమ్మ.

సర్వరక్షణభారంబు స్వామి యదియె
పెట్టలే దీశుఁ డెవనిపైఁ బెత్తనంబు
లేనిపెత్తనమేటికిఁ బూన మనము!

నలుపలేమికి వగఁ జిక్కి చావనేల?
అప్పు దీర్పక పోక నీకలవి గాదు
నిలువరు ఋణంబు దీరిన నిమిషమైన
నాలు బిడ్డలు మఱి నీకు నైనవారు.
తాళములు వేసి పెట్టెల దాఁచితేని.

వారికై మేను త్రుళ్లంగ వగవ నేల?
వారికతమున మన మేల పాడుగాంగ
మనకు శ్రేయస్కరంబైన మార్గమొదవ.

మేనిపై నభిమానంబు మానుటకును.
భయము లజ్జయు మునుముట్టఁ బాయవలయు.
చలిని వేఁడిమి నెంతయు సైఁపవలయు.
గౌరవంబును గోర నకార్య మగును
కాలకూటంబు జ్ఞానికి గౌరవంబు;
సభ యనంగను భయదయౌ సర్పకాంత
ఎల్లరకుఁ దానె నీచుఁడం చెంచవలయు
తనకు నీచుండు గలఁడని తలఁపరాదు.

అనుచుఁ దలపోసి తలపోసి యనవరతము
దేహమున నభిమానంబుఁ ద్రెంపవలయు
అటులు గాదేని వేఱొండుకిటుకు గలదు.

అభిమతింపుము మేను దేవాలయముగ
అమ్మ! యీశ్వరుఁ డుంట దేహంబునందు,
నదియు దేవాలయం బని యనుట తప్పె?
దేవళంబును నేరీతిఁ బావనముగ
నుంచవలయునొ నిత్యంబు నూడ్చి కడిగి
రంగవల్లులు దీరిచి రమ్యముగను.
శుభ్రముగ నుంపఁ దగుఁగాదె శుద్ధచరిత!

దేహ మిది నాది యనియెడిమోహ మెడలి
దేవు నాలయ మనుపూర్ణభావ ముంచి
నిత్యమును గడ్గవమ్మ పన్నీట నైనఁ
బూయుమీ మంచివాసనపూఁత లెన్నొ
యెన్నిసొగసులనైనను నెలమిఁ జేయు
లలితహేమాంబరముల నలంకరింపు.
మంచితంబైన పరమాన్నపంచభక్ష్య
ముల నివేదింపు మెప్పుడు నళుకులేక
మనసునం గొఱలేకుండ మహితభక్తి
నాత్మలోపలఁ గనుచుఁ బ్రత్యక్షముగను
శాస్త్రవిధిఁ దప్పకుండఁ బూజనము చేయు
మూఁడు మాఱులు దినదినముగ సుశీల!

ఆలయములోపలికిని జండాలశునక
ఖరములును దుష్టవస్తువుల్ చొరకయుండఁ
గాచుగతి శోకమోహముల్ కామరోష
భయములును లజ్జ లోభంబు పాడుగుణము
లేవి మనసునఁ జొరకుండఁ గావవమ్మ
మమతయు నహంత మునుముట్ట మాపవమ్మ.
ఇట్టి నిశ్చితబుద్ధి నీవిట్టు సేయ
నాత్మసాక్షాత్కృతి యగుటేమి యబ్బురంబు.

ఎన్నియో దుర్గణంబుల కిల్లు దేహ
మైనఁ గలదమ్మ యొండు మహాగుణంబు

ఎట్లునీవుప్రవర్తింప నిడెదొ యాజ్ఞ
యటులె వర్తించుఁ, గాదని యనదు తనువు
స్పష్టముగఁ జెప్పకున్న దోషంబు నీదె.
సంశయంబుగ ననిన దోషంబు నీదె.
అఱగొఱగఁ బల్క నీలోప మగ్గువిం'టె.
కాన దృఢచిత్త వగుచు నేకలఁక లేక
పూర్ణమనమున ననుమిటు పొమ్మటంచు
మాఱుపల్కక పోవుఁ దన్మార్గమునను
దేహమును హేయ మనుచును దెగడఁ దగదు.
చేయనేర్చునె యెదియు న చేతనంబు.
అదియ లేకున్న నేమి చేయంగ వచ్చు.
అఖిలధర్మంబులకు నాద్య మగును దనువు.
సాధనము లేక కార్యంబు సలుపుటెట్లు?
ముక్తియబ్బునె దేహసంయుక్తి లేక?
సాధనము దుష్ట మగుఁజుమ్మి సాధకుండు
దుష్టుఁడేనియు; శిష్టుఁడేని శిష్టమగును.
• రామబాణంబు లోకసంరక్షకంబు.
రావణశరంబు లోకవిద్రావణంబు.
అబలునకు సాధ్యపడనట్టియశ్వవరము
అణఁగియుండుసమర్థుఁ డౌనాశ్వికునకు.
కాన దేహంబు దుష్టమే ఖలుఁడు దేహి

దుష్టమనసునకును లొంగి దుష్టుఁ డయ్యెఁ
గాన జ్ఞానంబు భక్తియు గడనచేసి
దిద్ది దేహంబు సుఖియింపు బుద్ధిగలిగి
దేహమున నభిమానంబుఁ దెగఁగఁగోసి
యట్లె ధనగేహదారపుత్రాభిమాన
మెడలఁ జేయంగవలయు నహీనబుద్ధి
దేనిపై వేడ్క పడియెదో దానఁ గల్గు
దోషముల నెల్ల లెక్కింపు తోడుతోన.
పుత్రకాంక్షయొ ధనకాంక్ష పొడమె నేని
దానిచేఁ గల్గుదుఃఖముల్ దలఁపవమ్మ.
దారవిషయంబునం దిట్లు తలఁపవలయు.
కామతృప్తికినై కాదె కాంతఁ గొనుట
కాంతలే కద సంసారకారణములు.
దారవలనను రతియుఁ బుత్రకుఁడు ఫలము.
రతియు నిజమైన సౌఖ్యమా మతిఁదలంప.
ఆఁడుదానవ యైన రహస్య మైన
స్పష్టముగఁ జెప్పుటయె నాకు వ్రతముగానఁ
బలికెదను దప్పు గలిగిన నలుగకమ్మ
అనుభవంబున సరి యని యనెదవీవె.
మగఁడు మగువయు రతికేళి మలయువేళ
నిట్లు తలపోయవలయును హితమనీమ

గజ్జ లేచినగీతడికార్యమునకు
దీనికిని నేమిభేదంబు; దీనియందు
నేమి సుఖమొక్కొ సుఖ మనియెంచుటాక లె
గాక యేమాత్రసుఖ మందఁది గలుగఁజేయు
వేఁడిద్రవ మొకత్రుటిలోన వెషలువలకె.
దాన వెడలినద్రవపదార్థమును వ్రేలఁ
గొనుచు మూచూచినంతనె కను విరక్తి.
దానిఁ దుడువకయుండిన దానిమహిమ
తేటతెల్లంబు నే నేల తేటపఱుప.
అంతతోఁ బోయినను మేలె యట్లు పోదు
బావిత్రవ్వినభూతంబు బయల వచ్చు
కరణి వారిరహస్యంపుఁ గార్య మొల్లఁ
బురము ఘోషింపఁ బుట్టును భూతమొండు.
కావు కావు మటం చనుకంతఘోషఁ
దల్లికిని బ్రాణగోడ్డంపుదశ ఘటించి.

ముట్టునిలిచినమాసంబు మొదలుగాఁగఁ
దల్లి పడియెడి బాధలు దైవమెఱుఁగు;

షండుఁడో నపుంసకుండో గాకుండెనేని
యౌవనస్థుఁడు తరుణీజయంబుచేత
చాలదుర్ఘటమే కా; దసాధ్య మన్న.
కౌశికపరాశరులకైనగాథ విననె

నిక్క మైనవైరాగ్యంబు నివ్వటిలియు
కేవలము క్షీరభోజియై క్లిష్టవేళ
మానసమాహారమును లేక మలయువాఁడు
మాటలాడనివ్రత మూనుమౌని యొకఁడు
నాలుగైదేండ్లనాఁడు కానంగవచ్చె.
పోమిదేవిపల్లె యనెడిగ్రామమందుఁ
గలుగుచటిలోన రమ్మని పిలిచినాఁడ,
నొంటిమిట్టకు, నటువంటియుత్తముండు.
నేఁడువిన భగయోగి యైనాఁడు శూద్ర
విధవకును జేయుచున్నాఁడు బిడ్డకాన్పు.
యోగియొక్కఁడు భూమిలోనుండి నాల్గు
పదులదినములు మృత్యువు భయము లేక
యోగవిద్యను బారంబునొంది తుదకు
వాడవదినెకు దాసుఁడైనాఁడు వింటె.
ఇంతకంటె మతేమినచింతు నమ్మ
పాడుగాఁ బోయి రీరీతిభక్తి లేమి
కాన భక్తిని గడపుమీ కాల మెల్ల
వాసుదేవుఁడె సర్వమన్న భావ ముంచి.
ప్రాయపుం యోగులను నడివయసుయతులఁ
గంపలను దండిగాఁ బెంచుతిండిపోతు
పరమహంసల నమ్మంగ వలదు వలదు.
యోగమెల్లను దుదకు సంయోగ మగును.

పుత్రకులు లేక కలుగవు పుట్టగతులు
అనుచు నుందురు కాముకు లైనవారు.
అదియె నిజమేని శుకభీష్మహనుమదాది
నైష్ఠికబ్రహ్మచారులు నరకగతులె?
సుతులు కల్గినవారి కేసుఖము గలదొ
రామకృష్ణులజనకులఁ బ్రశ్న సేయు
మట్టితనయులవలన సుఖంబు లేక
వ్యసనములఁ దల్లిదండ్రులు వసరినారు.
కామసంభవులిఁక నేమి కావఁగలరు.
అనృతభాషణుఁ డైనట్టియాత్మజుండు
వదలునీళ్లులు చేరవు వానితండ్రి
శ్రద్ధలే కిడుపిండంబు జనకుఁ జేర
దట్టిశ్రద్ధయు సత్యభాషాభిరతియు
భక్తియును గల్గుసుతులను బడయు టరిది
ప్రథమవైవాహికముఁ దప్పుపట్టరాదు.
గాని రెండవపెండ్లియోగ్యంబు గాదు.
పురుషులకునైనఁ బుత్రులు పుట్టకున్న;
తనదుసత్కర్మములె గతుల్ తనకు నిడుట
సుతులు లేకయు సత్కర్మిసురలఁ గలయు;
నరకగాములె సుతు లున్నపురుషు లైన
సాధుకర్మములను దానె సలుపఁ జేని.

కానఁ బనియేమి సుతులతోఁ గర్తమునకు?
ధనము నార్జింప దుఃఖంబు దానికాఁపు.
విధము దుఃఖతరంబగు వెచ్చపడిన
మరణమే యగు వేఱొండుమాట యేల?
ఇంతకష్టించి తుదకుఁ దా నేమి గుడుచు?
పట్టెఁడన్నంబె మ్రింగునే పసిఁడిముద్ద
ఎంతకష్టింప మేరువుచెంతఁ జేర
నెంతప్రాప్యంబొ ప్రాప్తించు నంతమాత్ర
మొక్కతృణమైన లభియింప దెక్కువగును.
శ్రమము లేకయు ఫలియించుఁ బ్రాప్తికాలఁది.
కావున ధనాశ వ్యర్థంబు కష్టపడుట.
విద్య బుద్ధియు నేర్పును; విత్త మిడదు
తనదుదానంబు ధర్మంబు తప్ప నెదియు.
కాన ధనమున్న ధర్మముల్ దానములును
దైవపూజలు సేయుము దనివిదీర
దానధర్మంబులను జేయ ధనముఁ గోరు
కంటె నాశల నుడుగుట కరము మేలు.
అడుసు ద్రొక్కంగ నేటికిఁ గడుగనేల?
ధనికుఁ డెప్పుడు భయపడు దారసుతులు
వెచ్చపెట్టెదరో యని విత్త మెల్ల.
పేదటికమునఁ జూడుమా నీదుసుతుని

భక్తియును, భార్యకుం గలరక్తి, తోడఁ
బుట్టువారలప్రీతియు గుట్టు తెలియ
ననుచుఁ బలుకవె నీతిశాస్త్రాళు లెల్ల

నీదువిత్తంబునే కాక నిన్ను వలచు
వార లెవ్వరు గలుగరు వసుధయందు.

పీన్గుమాంసంబుఁ దినఁగోరి వేగ మూఁగు
కాకులును గుక్కనక్కలకరణివింటె?
చుట్టములు వత్తు రిది కొల్లపెట్టుటకును.

సాధుమిత్త్రుండు రక్షించు సర్వవేళ.
వానికిని మించి యెందు దైవంబు గాచు.

దైవకృపచేతఁ బ్రాప్తించుఁ దగినహితుఁడు
కాన దైవంబె శరణంబుగాఁగఁ గనుము.

ధనము ధాన్యంబు గేహంబు దార సుతులు
చుట్టపక్కముల్ క్షేత్రంబు కట్టుగుడ్డ
గోఁచియును దేహమైనను గూడరాదు.

వీనికై నేల తేరకు వెతలువడఁగ
ననుచు వైరాగ్యమునుబొందు టగ్గనుగును.

భర్త సుగతికి నేగిన భార్యతోడ
నరుగు నదియుఁ బతివ్రత యగున యేని
భర్త దుర్గతికేగిన భార్య యతని

మరల నాకంబునకు లాగు మహిమగలదు.
తనదుశీలంబుపెంపునఁ దనయ! వింటె
పుట్టలో సర్పమును దోఁకపట్టి వెలికి
లాగుమాంత్రికుపోలిక బాగుమీఱ.

కాన శీలంబు గలిగినమానవతికి
శీలమును మించు తపమెందుఁ జెప్పఁబడదు.

శీలవతిగాని చెడిపె వే చేసెనేని
వ్రతతపంబులు జపములు వ్యర్థమమ్మ.

కన్నులకుఁ గనవచ్చువిగ్రహములయందు
నిమిషమాత్రంబు మనసును నిల్పలేక
తనకుఁ గనరానియాత్మసందర్శనంబు
మదినిగోరెడి యామందమతిని బోలుఁ
దనకుఁ గనవచ్చుప్రత్యక్షదైవతంబు
భర్తఁ గొలువంగ నేరక భ్రాంత యగుచు
నన్యదైవంబులకుఁ బాఱుహీనబుద్ధి.

పతిని విడనాడి యన్యదైవతముఁ గొల్చు
నదియుఁ గులటగ భావింపు మాత్మయందు.

శీలవతి యయి తపములు చేసెనేని
చెప్పనేటికి నాసతిచిత్రమహిమ.
నెట్టియోగియు నామెకు నీడుగాఁడు

కాన నీవును బతిభక్తికలిమిఁగలిగి
యోగమును నభ్యసించిననాఁడవు ముక్తి
నీకు నీభర్తకును గూడ నిశ్చయముగ

విశదపఱిచెద నీకొక్కవిషయ మిచట
శుష్కవేదాంతు లగువారిశుంఠతనము

పతియె దైవం బటంచును బలికినట్లు
గురుఁడు దైవం బటం చనుకొనెడికతనఁ
బతికి గురునకు భేదం బభావమె కద
పతులతోడుత రమియించుభంగి సతులు
గురులతోడుత రమియింపఁ గూడు ననుచు
స్త్రీలఁ జెఱుచుచునున్నారు చెనఁటు లగుచు.

అట్టులైనను దండ్రి యభ్యాగతుండు
నతిథి దైవంబు లనుచును నాడఁబడుట
వెలఁది కర్థంబె వీరితోఁ గేలి సలుప?

నీవు బ్రహ్మంబు బ్రహ్మంబు నేను గాన
మన కభేదంబ యద్వైతమార్గ మిదియ
బ్రహ్మమును బ్రహ్మమును గూడఁ బాపమగునె?

దేహ మర్థంబు నాచార్యుదే యటంట
తప్పుగా దేమిచేసిన నొప్పె యనుచు
మెప్పె వేదాంతు లీరీతి మెలఁగుచుండ్రు.

తెలివలను మోసవిధమునఁ జెలఁచుచుండ్రు
అమ్మహో! అంకుముండల కభిమతంబ
కన్నతల్లివిధాన నీకలుషమతము.

కాన వేదాంతిజనముల కనఁగఁ బోకు
తెలివిమై వారిచర్య శోధించికాని
దేహమున సొంపు తిని యెడితిండిపెంపు
నడచువర్తన మివి వానినుడులతోడ
శాస్త్రవాక్యాళితోడుత సర్వగతుల
నైక్య మొనరద యేనియు నట్టివాని
మోసగాఁడని యెంచుమీ ముగుదమిన్న!

కామజయము.

ఖండితముఁ జేసి కామవృక్షంబు నిట్లు
వేళ్లనుంగూడఁ బదపడి పీఁకవలయు
కండ మెండే నశక్యంబు కామజయము.
రాజసము తామసము నగుభోజనంబు
గలుగువాఁడును గామంబు గెలువలేఁడు.

భోగములమీఁద మనసును బుచ్చువాఁడు
విషయకాంక్షల మొదలంట విడనివాఁడు
కామజయశీలి కాఁ డెన్నికల్పములకు.

తనువు ధరియింప నెంతమాత్రంబువలయు
నంతె మితముగ సాత్త్వికాహారములను

గొనుచు నపు డప్పు డుపవాసమునఁ జరించి
క్రమముక్రమముగ నిద్దుర కడిమిఁ దెఱిచి
వ్రతములను బూని సాధుసంగతిని విషక
సచ్చరిత్రలఁ జదువుచు సరవి వినుచు
నాటపాటలకై పోక యాఁడువారిఁ
గన్నజననులపోలికఁ గాంచి మ్రొక్కి
నేలఁ జూచుచు నడచుచు నియతివిడక
యెదిరునంబును లాగునో యదియు నపుడె
తొలఁగఁ ద్రోచి ప్రాణాయామకలన మనసు
నాత్మవశముగఁ జేయుచేకాంతి యగుచు
నలసతను మాని చరియింప నగును బుధుఁడు.
సంగ్రహం బిది మునుపన్న చరితములకు
కాంక్ష యెదియేని కలిగినఁ గమ్రుచరిత
యప్పుడప్పుడె యీరీతి నడిగికొనుము.

ఇట్టికోరిక కొనసాగ నిచ్చితేని
నాత్మకును లాభమేమైన ననువుపడునె?
మెచ్చునా దైవ మిద్దాన? హెచ్చు నొక్కొ
భక్తియును జ్ఞానమును? భవబంధతతులఁ
బాయఁగాఁ జేయునే? దీని వ్యర్థపఱుప
దేహపాతంబు గలుగునే? దీనిఁ జేయఁ
బ్రజకు నుపకారకంబౌనె నిజముగా న

టంచుఁ బ్రశ్నించి యుత్తరంబవు నటంచుఁ
దోఁచెనేనియుఁ దీర్పుము; దోఁపదేని
మాను మద్దాని నెద్దాని నైనఁ దల్లి
బాహిరంబుగ నెవి పాసి ఫలములేదు
మనసుచే వాని ధ్యానించుమందమతికి.

ఐహికంబుల నన్నిటి నవల నీడ్చి
కృష్ణుముంగల నిలుచున్న కీర్తనీయ
గోపకన్యలలో నొక్కగోపి వగుము.
ప్రకృతిబంధంబు లన్నియుఁ బాసిపోవుఁ
బంకజాక్షునిపై భక్తి పదిలపడిన.

కోడ లత్తయు నెందును గూడి యుంద్రు
కొడుకు తండ్రియు నొకచోటఁ గూడ రెపుడు
కాముఁడును రాముఁ డొకచోటఁ గానఁబడరు.

కాము గెల్చెడికోరిక కలదయేని
నేకపత్నీవ్రతస్థు సీతేశుఁ దలఁపు.

ఫాలనయనుని నేత్రాగ్ని భస్మమగుట
నంతకంటెను గ్రూరమగు హరిసుదర్శ
నాగ్నిఁ దలపోసి పఱువెత్తు నందునిలక
మానసంబున నిల్పిన మధువిరోధిఁ
బేరుసైతము సమయునో పృథ్వి ననుచు.

వేరుచెఱిచెడివిధ మింక విస్తరింతు.

కామమును బూర్ణముగఁ జంపఁగాను దగదు.
ధర్మ్యకామంబు విడకుంట తగవుగాన.
భక్తియును జ్ఞానమును గోరఁ బాప మగునె?
స్వామికైంకర్యకాంక్షయుఁ బాప మగునె?
స్వామిసందర్శనమును గోరఁ బాప మగునె?
పరుల కుపకృతికోరుట పాప మగునె?

దుష్టకామంబు లావలఁ ద్రోచివైచి
యిట్టికామంబులకు నెడ మీయవలయు

వీనిపై మది నిల్పితి వేని నవియుఁ
దమకుఁ దాముగఁ జెప్పక తరలిపోవు.

వీనిఁ జేయుము దైవసంప్రీతికొఱకు.

చేసి కొన్నాళ్లు పిదప నాచింత విడుము.

ముల్లుతో ముల్లులాగి యాముండ్లరెంటి
దూరమున వైచు బుద్ధిమంతునివిధాన.

ఈవు గోరిన వచ్చునే యీశుకరుణ
తనకుఁ దావచ్చు యోగ్యత దనర నీకు.

దాని కదియె స్వభావమై కానఁబడుట.
కమలముకుళంబు గోరిన భ్రమర మేగు
దెంచునే వికసింపక, తేనెఁ గూర్చి.
తేనె చిప్పిల్ల విచ్చినఁ దేటులెల్లఁ

ప్రార్థనము లేక పఱతెంచు బార్లుగట్టి
వాని కయ్యదియే స్వభావంబుగాన.

కాన నీహృదయం బనుకమలమందు
భక్తిమధువును నించినఁ బాఱుదెంచు
భక్తజనపక్షపాతి శ్రీవల్లభుండు
వాని కయ్యదియే స్వభావంబుగాన.

కాన నిటులెంచి సర్వసంకల్పములను
ముక్తితోఁ గూడ వీడుము మొదలుముట్ట.

ముక్తి గిక్తియు మన కేల? భక్తి చాలు
సలుపు మద్దానికై కార్యజాలములను.

## క్రోధజయము.

క్రోధము జయించుమార్గంబుఁ గొమిరె వినుము.
గడుసుపని యిది కామంబుకంటెఁ దల్లి!
కామమును గెల్వవచ్చును గాని నరుఁడు.
క్రోధము జయింప మిగులదుస్సాధ మమ్మ

కాముని జయింపఁబూనిన గరళగళుఁడు
క్రోధమునకును దాసుఁడై కొఱలినాఁడు
కామజయశాలియైన యాధిగాసుతుఁడు
క్రోధవశుఁడయి రంభపైఁ గోపగించె

వాసుదేవుండే సర్వంబు సత్య మగుట
సర్వ మాతఁడే యనుచు సాక్షాత్కరింపఁ

జేసికొని భక్తి శ్రీవాసుదాసుఁడనని
స్వాభిమానంబుఁ ద్రుంచినయనఘుఁ డొకఁడె
పరమభక్తిని గ్రోధంబుఁ బాచువాఁడు.
పేరుమాత్రంబు నానలెఁ బెట్టుకొన్న
మాత్ర ఫలమేమి లేదమ్మ మంజువాణి.

కామమున కిది బిడ్డయై కానఁబడియు
దానికంటె బలిష్ఠంబు తల్లి యిదియుఁ
గామమే, విఘ్నమైనప్డు కానవచ్చుఁ
గ్రోధముగఁ గాన దాని నిర్మూలపఱుపఁ
గామమును జయింపవలయును గడఁగితొలుత.

కామమును గ్రోధమనునవి కారణములు
మనుజు లొనరించు సకల పాపంబులకును.
కోరికను భంగపఱిచెడివారిమీఁదఁ
గాదె కోపింతు వెప్పుడు కలుషమతిని.

ముక్తికాంక్షను నీవుండ మొదలుచెఱుచు
క్రోధమునఁ గ్రోధ మూని నిర్మూలపఱుపు.

వైరిపైఁ గాదె కోపంబుపడెద వీవు.
క్రోధమునకంటె వైరి యొక్కండుగలఁడె?

దానిపై డాడిపెట్టి యద్దానిఁ జెఱుపు
మేలు గలుగును దల్లిరో మేలుగలదు.

కోరికలు గోర నేటికిఁ? గోరి నవియుఁ
గొనలుసాగకయున్నను గోప మేల?
క్రోధమే కా దదెట్టిదుర్గుణము నైన
నీవు గెలువంగఁ దలఁపు జనించెనేని
దయయు దాక్షిణ్యమును విడుదానిపట్ల
నదియుఁ బొడసూపు నెపుడెప్పు డప్పు డపుడె.
చేయుమీవు ప్రాయశ్చిత్తశిక్ష స్థిరత
ఇట్టిదుర్గుణ మింకను జూపట్టె నేని
నుందు నుపవాస మని యెంచి యుల్లమందు
నట్టులేయుండుమీ స్థిర మైన మదిని.
క్రమము క్రమముగ నశియించుఁ గలుష మెల్లఁ
గౌశికమహర్షి యీరీతిఁ గాదె సలిపె
ఎంతకష్టంబు గలదొ ప్రవృత్తియందు
హెచ్చుకష్టంబు గలదు నివృత్తియందు.
ఏటికిని నెదురెక్కుడిపాటి యగును.
అన్నియును వీడి పోయిన నవల సుఖమె.
అంతకును మనమనసుతో నెంతయేని
ఘోరముగఁ బోరవలయును గొదుకులేక
తాలిచి యసంగశస్త్రమే వేళయందు.
ఇంచుకంతయు మనసు జయించెనేని
చెడుదు వమ్మరో యన్నిటఁ జెడుదువీవు.

నాటకంబున వర్తించు నరునిపోల్కి
దనుజతతులను దండింప దాశరథియు
క్రోధమును దెచ్చుకొన్నట్లు బాధ లేదు
ఎదిరిమేలునకై యుండెఁ యితరజనుల
బోధమునకొండె కోపంబు పూనుమేని.

మనకు లోపడియదియుండఁ జనునుగాని
మనము దానికి వశపడఁ జనదుచుమ్ము
మనకుఁ దెలియక రారాదు చనఁగ రాదు.
క్రోధ మెపు డేని నిట్లైన బాధ లేదు.

## లోభజయము.

కామమునకును వేఱొండు గలదుబిడ్డ
పరమనీచగుణంబు లోభం బనంగఁ
గ్రోధమును గామలోభముల్ రుచిరశీల
నారకద్వారములుగ జనార్దనుండు
పలికె ఫల్గునకునుమున్ను స్పష్టఫణితిఁ
బలుకఁబడును దురాశ లోభం బనంగఁ
దనది పరులకు నీయంగఁ దలఁపు లేమి
పరులద్రవ్యంబు దనకురా వాంఛపడుట
లోభగుణములె యీరెండు లోలనయన!
హింస వంచన, ద్రోహ మనృతము చౌర్య
మల్పబుద్ధియు లోభిని నాశ్రయించి

బ్రతుకుచుండును నెవ్వేళ భయము లేక.

లేరు భార్యలు బిడ్డలు లేరు హితులు
లేరు చుట్టాలు పక్కాలు లేదులజ్జ
లే దిహంబు పరంబును లేఁడు వేల్పు
లేవు మానావమానముల్ లేఁడు గురుఁడు
పరమలోభాస్పదుం డైనపాపమతికి.

అతనిపాలికి యమదూత యాచకుండె

క్రోధ మెదఁ గొంతకాలంబె కూడియుండు.
పరమలోభంబొ యెవ్వేళఁ బాసిపోక
చచ్చుదాఁకమనంబున సంవసించు.

నమ్మవచ్చును క్రోధకామమ్ములైనఁ
బరమలోభిని నమ్ముట బాగుగాదు.

కోటికొలఁదులు విత్తంబు గూర్చియున్న
పరమదారిద్ర్య మీతని బాసిపోదు.

ఎంతప్రియ మైనవస్తువే నెవ్వరైన
శత్రు వేనియు నడుగఁ దత్క్షణము యిమ్ము.

పరులు చూచుచునుండఁగ వారి కిడక
దేని నే నెట్టిదేనియుఁ దినకు మమ్మ
వారు భుజియింప నర్హమా వస్తువేని.
మందులును మ్రాఁకులును గావు మధురవాణి.

పరుల సంతోషపెట్టుటే పరమగుణము
ధర్మరీతి నధర్మపద్ధతిని గాదు.
పరులద్రవ్యంబుఁ గోర కేపట్టునందు
దానిపై నెంతమక్కువ దనరియున్న
దాన మొనరింపు మీవు తాత్పర్యయుక్తి
భక్తితోడుత నర్హమౌ పాత్రమునకు.
భగవదర్పణబుద్ధిని భద్ర మొదవు.

శోకము.

వాను దేవుండె సర్వమౌ భావ ముండి
సర్వ మేకంబుగా నెంచు సజ్జనుండు
సంతపించునె తనవారు చచ్చి రనుచుఁ?
దాను జచ్చితి నని యేడ్చునా నరుండు?
చచ్చెఁ జచ్చె నటందురు జనము లయ్యొ
చచ్చినది యేది? దేహమా? చావు లేదు
ప్రకృతిపరిణామ మౌ శరీరంబునకును
ఆకృతియె మాఱు దానికా యంగలార్పు?
ప్రకృతి నిత్యంబు దాని కేబాధ లేదు.
నిత్యవిక్రియ కావున నిమిషనిమిష
మునకు మాఱుచునుండును దినదినంబు
బాల్య ముడివోయి యౌవనవంతుఁ డగుట
యౌవనము పోయి వార్ధక మందుచుంట

దానిచేఁ గాదె? వగతురే దాని కెవరు?

మాతృగర్భంబునం దుండి మహిని బడిన
వేళ మూరెఁడుగా నున్నపిల్లవాఁడు
బారెఁ డెట్లయ్యె? ప్రకృతివికారమె కద

యోగసంసిద్ధిఁ గాంచి యన్యోపకృతికి
నాసపడక, స్వయం దాసుఁ డగుచు జగము
జనము దేహంబు తృణముగాఁ గనఁగఁజాలు
నాత్మవంతున కగుఁగాక యన్యులకును.
బెక్కులేఁడులు బ్రదికినఁ బేర్మి గలదె?

ఇంద్రియంబుల బలమెల్ల హీనమైన
నర్థ మార్జించు శక్తియు నణఁగిపోనఁ
బరులకును సేవ చేసెడిబలము తఱుగఁ
గొలఁదివారలె తన్నుఁ జీకొట్టుచుండ
నెపుడు చచ్చున యని బంధు లెదురుచూడ
ముసలినసయని పెండ్లామె విసింగి గొణఁగ
కనులు గనరాక నడువను గాళ్లు లేక
పరుల వేఁడుచుఁ బెనుబాధపడుట మేలె?
తల్లిరో! గంటి నేఁడు నీపల్లెయందు
(దీనిమున్నంగి యందు రీదేశజనులు)
కాలుసేతులు గడగడ కదలియాడ
మేని స్వాతంత్ర్య మేమియు లేనివాఁడు

నడువ నిలువఁగఁ గూర్చుండఁ బడుకఁ బెట్టఁ
దినఁగ మూత్రంబు విడువఁగఁ జనఁగ లేక
పరులఁ బిలుచుచుఁ బడియుండు బ్రాహ్మణునిని
నమ్ముదువొ నమ్మవో గాని యమ్మ నీవు
వాస్తవంబుగ నతఁడు జీవచ్ఛవంబ
ఇంతకును నేండ్లు డెబ్బదియే సుమమ్మ
అతనిఁ గనుఁగొన నాగుండెలదరెఁ దల్లి
అతని నిలువునఁబోసినయంతధనము
గలదు ఫలమేమి? చూడ దుఃఖంబె గాక
వానికి సమీపమందుండి వ్రాయుచున్న
వాఁడ వైరాగ్యమున వస్తుసార మొందు.
వలయు నేనియు నీతని వలయుఁ జూడ
బండి బరువగు గ్రంథంబు వ్రాయుకంటె
వీనిఁ గనుఁగొన్నఁ ద్రుటిలోన విరతి పొడము.

చచ్చునది జీవుఁ డందమా? చావు గలదె
నిర్వికారుండు నజుఁడును నిత్యుఁ డైన
జీవున? కవాసయోగ్యమై శిథిల మైన
యింటివసియింప లేక వేఱింటి కేగు
వానికై యేడ్చువారుండ్రె వసుధయందు?
ప్రాఁతవలువలు విడనాడి నూతనంపు
వలువఁ గొనువానిఁ గనుఁగొని వనరవలెనె?
చలువపందిరిలోపల నిలిచి పోవు

చాటుసారుల కేడ్తురే ప్రాజ్ఞజనులు
వారికర్థానుభూతికై వచ్చు చుండ్రు
పోవుచుండుదు రనుభవపూర్తి యైనఁ;
దాము పోవనియట్టుల తరలి చనిన
వారికేడ్చుచు నుందురారారజనులు.
ఇంతకును మించి వేఱొండువింత గలదె?
అప్పులిచ్చినవార లాయప్పు మరలఁ
గొనఁగ నరుదెంచి కైకొని చనిర యేని
యప్పుదీఱెఁ గదా యని హర్షపడక
వారికై యేడ్చువారెంత ప్రాజ్ఞజనులో.

## మోహాజయము.

అటులె దేనికి మోహంబు నందు బుధుఁడు?
ఎవనిఁ గనికోపగించుఁ దానెవనిఁ దిట్టు?
నెవనిఁగొట్టును? ద్రోహంబు నెంచు నెవని?
కన్ని భగవంతునకుఁ జేసినట్లె యగును.
వాసుదేవుండె సర్వమై వఱలుకతన.

వాసుదేవుండు తనయందు వాసముంటఁ
దనకుఁ దాఁగీడు తలఁచినమనుజుఁ డగును
బరులకును ద్రోహమెంచినపాపరతుఁడు

వాసుదేవుండె సర్వమగు ప్రాజ్ఞతముఁడు
ఎల్లభూతంబులకు మేలె యెంచుచుండు.

సలుపుచుండు శుభంబును శక్తికొలఁది
నఖిలమును భగవత్సేవ యనుమనీష.

నదియె వానికి మేలిచ్చు నన్నిగతుల

మోహ వికార మూఢుల ముంచువిధము.
స్పష్టపడియెడి నొక్కదృష్టాంతమునను?
పురుషులును స్త్రీలు బూరత్వమునను జెడఁగ
హేతువున్న దె లౌకికదృష్టి నైన?
తరుణులెల్లరు నొక్కవిధంబువారు
పురుషు లెల్లరు నొకభంగిఁ బోలువారు

వన్నె చేలల ముసుఁగుల వాసిగాక
వీరిగుహ్యములకు భేదవిధము లేదు
మూత్రపాత్రంబు లగుటయు మోసలేదు
కెంపులను జెక్కలేద యొక్కొతకు బ్రహ్మ
పెంకులను గప్పలేదొండు వెలఁది కెందు.
నరులకును గొందఱకు మూత్రనాళములును
రమణిఁ బైఁడికడానిగొట్టములు గావు
ఎవ్వ రెఱుఁగని గోప్య మందేది కలదొ.
ఏమిటికిని మోహపడుచును హీనమతులు
భార్యలను భర్తలును, దనుపతుల సతులు
వీడి అంకాడుచుందురు వీఱిఁడు లయి.

ఇట్టిదోషంబులను నొడిగట్టకుండఁ

గాచితివి రామ! పెంపారుకరుణఁజేసి.
నీవు సత్యంబు సత్యంబ నేను దేవ
నీవు లక్ష్మీశ! సంద్రంబు నేను దరఁగ
నేను నీకిరణంబను నీవు రవివి.
నీవు పెద్దప్రవాహంబు నేను సుడిని
నీవు జ్వాలదగ్ని, దానిలో నేను మిణుఁగు
రీవు తల్లివి తండ్రివ, యేను బిడ్డ
నీవు స్వామివి భృత్యుండ నేను నీకు
నిన్ను విడనాడి జీవించుటెన్ను గలదె.
ఇంతకాలంబు నీలోననే వసించి
యీవు నాలోన నుండియు నింతవనుక
నిన్నుఁ గానక యుండిన నీచమతిని.
కన్ను లుండియు నిన్ను నేఁ గానలేదు.
వీను లుండియు నీకీర్తి వినఁగలేదు
చేతు లుండియు నీపూజ చేయలేదు.
జిహ్వ యుండియుఁ గీర్తన చేయలేదు.
పదము లుండియు నీకయి పాఱలేదు.
మనసు గల్గియు నామసంస్మరణ లేదు.
ఎన్నిజన్మాలో యెత్తితి నేమిఫలము?
వ్యర్థముగఁ బోయె నన్నియు వ్యసనములనె?
ఒక్కపరి నీకు మ్రొక్కియ యుంటినేని
ఒక్కపరి నిన్ను స్మరియించి యుంటినేని

ఒక్కపరిపాదములఁ బడి యుంటినేని
ఒక్కపరి హరిహరియని యుంటినేని
ఒక్కపరి నీదుకథ విని యుంటినేని
కంటినీ రొక్కబిందువు కార్చియున్న
మనసు నీమీఁద నొకసారి యనిచి యున్న
నిట్టివెత లేల కల్గునో యిందిరేశ!
పరితపింతునె స్త్రీగర్భనరకమునను
కావు కావని యేడ్తునే కుమను ద్రెళ్లి
ఉచ్చలోఁ బీతిలోఁ బొర్లి యుందునొక్క
యంగలార్తునె యన్యసాహాయ్యమునకు
దప్పి నాఁకటనేడ్తునా స్తన్యమునకు
మిడికియుందునె పిడిచెఁడుమెతుకులకును.
భ్రాంతిపడుదునె యన్యులబొసటులకు
కూటికొఱకును బరులను గొల్తునొక్క
అయిన నొకమేలు చేసితి వంబుజాక్ష
ఎట్టిజనయిత్రి కడుపున నేను బుట్ట
నిట్టి సన్నతిగలుగునో యిప్పుడైన
నట్టియుదరాననే నన్నుఁ బుట్టఁజేసి
కాళ్లబందాలు నురిత్రాళ్లుగాఁగ నుండు
నట్టిబిడ్డల నొసఁగని యట్టిదాని
నాలుగాఁజేసి దానిని నవల కనిచి
నీవొసంగినధనమును నీవె కొనుచు

నీదుపదసేవఁ గాలంబు నెఱిగఁద్రోయ
మంచిపన్నాగమును బన్ని మనిచె దీవు
ఏటికోళ్లయ్య యొకకోటియేటికోళ్లు
నీవె కర్తవు భర్తవు నీవె ధర్త
నన్ను నీయంఘ్రిసన్నిధానంబునకును
సదయ రప్పించుకొనఁగ నొసఁగినావు.
సాధనములుగ, నివియెల్ల సాధనంబు
లనుచుఁ దలఁచినఁ జోరుండ నగుదుఁ గాదె?
అంతకంటెఁ గృతఘ్నుండు నవనిఁగలఁడె?
కర్మములును ధర్మములును యోగంబు లెవ్వి
చలుపనేరని దీనుఁడ జాల్మమతిని
శక్తిహీనుఁడ నన్నురక్షణముచేయ
భారఫలములు నీపయి వైచినాఁడఁ
ద్వత్పదాంభోజములపయిఁ బడినవాఁడ
నించుకయు దిక్కులేనియకించనుండ
నీవొసంగినదంతయు నీవె కొనఁగఁ
దల్లిగర్భంబునందుండి తరలి వచ్చి
నట్టు లున్నాఁడ నెవరు దిక్కైన లేక
నీదుచిత్తంబు నాభాగ్యమో దయాబ్ధి
యెట్లుచేసినఁ జింత నాకేమి లేదు.
కీర్తి యపకీర్తి నీయది యార్తినైనఁ
బొందనేరని బాలుఁడ మందమతిని

## గర్వజయము.

అమ్మ! చెప్పెద నీక గర్వ మణఁచువిధము
గర్వమునకు నిదానముల్ గలవుకొన్ని

ధనము విద్యయు బలము యౌవనము నిష్ఠ
కులము సౌందర్య మివి కొన్ని తెలిసికొనుము.

దుష్టగుణులంద యివి తోఁచు దోషములుగ
సాధు లందివి యెంతొ ప్రశస్తతమము
లుపకృతికి నెంతొ తోడయి యొప్పుచుంట.

జ్ఞానమును సాధుసంగతి చంపుదీని
వినయము విధేయతయు భక్తుధనము గాన.

బలము సౌందర్యగరిమ, యౌవనము మూఁడు
నాళ్లముచ్చటలంచును నమ్మవమ్మ

వయసుపోయిన నిన్నియు వఱదఁగలియు
వేగమునఁ బోవు మరలదు వెనుక కెపుడు
వయసుమత్తున నున్నట్టివారు కారె
తలలు వడకాఁడఁ, బదములు తడఁబడంగ
దంతములు రాలఁ గన్నులకాంతి దీఱ
కోల యూఁతగఁ గొని, మేను కుతిలపడఁగఁ
జావు చావని యేకాఱుజనము లెల్ల.

ముదిమి దాఁకను నిజమానె బ్రదికియుంట
అంతమాత్రంబునకు నేల యింతపొగరు

లక్ష్మి చంచల చపల నిల్వదయొకంట
నేఁటిధనదుండె రేపటి కూటిపేద.

విత్తగర్వంబునకు మందు పేదఱికమె.

బలమదంబునకును మందు వ్యాధిబాధ
కులమదంబునకును భ్రష్టుకొడుకొ అంకు
టాలు నగునాలొ మేలిదివ్యౌషధములు.

వేయియేటికి నొకమాట వినుము తల్లి!
స్పర్శమునఁ గల్గుసుఖము లశాశ్వతములు.
దుఃఖపరిణామములు గాన దుడుకుమాని
సాధువృత్తిని వలయును సంచరింప
మనల మించినవారలు మహిని లేరె?
యేల మన కింతగర్వం బహీనచరిత
వాసుదేవుండె సర్వమఁ భావముంచి.
వాసుదాసుండు నయి దాసవర్తనమున
వినయవంతుండు నగునును వెలయునేని
గర్వ మెల్ల నశించును గ్రమము గాఁగఁ
గాన నీయందు గర్వంబు గలదయేని
దానికిని గారణంబేమొ తఱచిచూడు.

ఎన్నినాళ్లుండు నాహొతువెంచి గనుము.
మ్రొక్కుమీ తల్లి! యెల్లకుమోడ్చి కేలు.
సాధుజనులకుఁ బరిచర్య సలుపఁ జనును.

ఎట్టిసేవయు నీచమం చెంచవలదు.
అల్పజనులను బ్రీతిచే నాదరింపు
ఉపచరింపుము కష్టంబు లొందువారి
కన్యసాహ్యాంబు గోరకు మల్పములను.

అన్నిటికి హరిభక్తి దివ్యౌషధంబు.
భక్తునకు సద్వినయమొండె పరమభూష
యంజలియె భద్రముద్రయై యమరుఁగాన.

గర్వి యగుయోగి మహిమలు కలుగుకతన
గర్వి యగుజ్ఞాని తనదుప్రాగల్భ్య మెంచి
భక్తుఁ డొక్కండె దీనుఁడై బంటుపోల్కి
సేవచేయుచు గర్వంబుఁ జెఱుపఁజాలు.

## భయము.

ఏమిటిదో లజ్జ; భయ మన నెట్టిదొక్క
శోక మెట్టిదో మోహంబుచొ ప్పదేదో
సర్వ మేకంబుగాఁ జూచు చతురమతికి
వాసుదేవుఁడె సర్వ మన్భావ మెదను
స్థిరము పడెనేని నివి యెల్లఁ దీరుఁద్రుటిని.

వ్యాఘ్రమును, దేలు, సింహంబుఁ, బాము, దొంగ,
హంత, ఖలు, శతు భగవంతుఁ డనుచుఁ దలఁచి
దేనికిని భయపడఁ డెప్డు ధీరమతిని.
తనకుఁ దా భయపడియెడి మనుజుఁ డున్న

జనని విష మిడ, జనకుండు చంపఁ దలఁప
నడ్డపడియెడివా రెందు నవనిఁగలరె?
దైవమే తన్నుఁ జెఱుపఁగఁ దలఁచె నేని
నెవరితో నైన మొఱపెట్ట నేమి ఫలము?
దైవమే దన్నుఁ గావఁగఁ దలఁచె నేని
నెవరి సాహాయ్యమును వేఁడ నేల చెపుము?
దైవ మేనాఁడు మన మేలె తలఁచుఁ గాని
వ్యసనముల ముంపఁ గోరురాక్షసుఁడు గాఁడు.
నిగ్రహంబులు తుదకు ననుగ్రహములె
యగును; హేతు నెఱుంగక వగతు మిపుడు

వ్యాధిపీడితశిశువు పథ్యంపుఁదిండి
పెట్టఁ దినలేక జననిపై రట్టుచేయుఁ
గాని యద్దానఁ గలమేలు గానఁ గలదె?

శివునియానతి లేకున్నఁ జీమయైనఁ
గఱువ దనియెడి సామెత కల్లగాదు.

మేలు గీడును గావింపఁ జాలు నెవఁడు

మనము చేసినకర్మంబు లనుభవించు
వేళ వచ్చిన విష్ణుండు విశ్వకర్త
వాని ఘటియించుచుండు నెవ్వాని నైన
నెపముగాఁ గొని; తెలియని కృపణమతులు
పరుల భూషింత్రు దూషింత్రు కరణకర్త
లనుచు; నట్లైన హరితోడఁ బనియుఁ గలదె

ఎట్టిపాపంబుఁ జేసిన నేమిభయము

కర్మఫలములఁ గుడుచుట కష్ట మైన.
అట్టు లగుటను బరుల నెగ్గాడరాదు.
కాన భీతియుఁ బ్రీతియుఁ గడకుఁ ద్రోలి
యీశ్వరుం డెట్టివేళల నెద్ది సేయు
నదియె శుభ మని యుండుదు రాత్మవిదులు.

వ్యసనములు రాఁగఁ బాసెను బాప మనుచు
సంతసింపఁగవలయును సన్మీషి

సౌఖ్యములు రాఁగఁ బుణ్యంబు సమసె ననుచు
వ్యసనపడఁ దగు మతిమంతుఁ డైనవాఁడు

సాధుచిత్తుండు వగవఁడు సంతసింపఁ
డేది వచ్చిన భగవత్ప్రసాద మనుచు.
నిగ్రహింపకె యుఱక పరిగ్రహించు.

పాపమునకును లజ్జింపు భయముపడుము.
తక్కువానికి వెఱ సిగ్గు దగదు గొనఁగ.

మరణభయమునుగూర్చి యీమధురవాణి
పూర్వమె వచించితిని నది పోవు విధము.

ఇరుల నొంటిగఁ బో భయమేని తల్లి
యెందు భయ మని తోఁచునో యందు నీవు
దీప మావలఁ బడవైచి ధీర వగుచుఁ
బొమ్ము నిప్పుపుడకలఁ జేఁ బూని నీవు.
పోయి చీఁకటి నిలిచి నీబుద్ధిచేతఁ
దర్క మొనరింపు మీరీతిఁ దల్లి నీవు

నన్ను భయపెట్టునది యేది యున్న దిచటఁ
జూత మనినాల్గు వంకలఁ జూడ వమ్మ
యొక్కఁడైనను గనరాదు నిక్కువంబు.

నిండుచీఁకటి యుండిన నిండువెలుతు
రున్న భయమేమి దోఁపదు సన్నయిరుల
యందె యొక్కటి దోఁచుఁ దదన్యముగను.

అట్టి దేదైనఁ గనులకుఁ దట్టెనేని
వెంటనే పుల్ల గీయుము వెలుఁగు గలుగ
నున్నదున్నట్లు దోఁచును నుడుగు భయము.

బండువస్తువు వేఱయి యుండలేదు
నీమనోవికారమెయిట్లు నీకుఁ దోఁచె
నీకు నీవె భయంపడ నీకుఁ దగునె?

కలది కనఁబడ సిగ్గొందఁ గలవు నీవె
నీదుపిఱికితనమ్మును లోఁ దలంచి
కాన దేనికి భయపడఁ గాదు నీకు.
పాపకార్యంబునకుఁ దక్కఁ బావనాత్మ!

## లజ్జాజయము.

వేయిప్రమిదలయందలి వేయిదీప
ములును నేకాకృతులు గావె తలఁచి చూడఁ?
ప్రమిదలన్నియు దేహముల్, పాంచభౌతి
కములు, దీపముల్ జీవు లేకస్వరూపు
లేకగుణములు గలవార లెల్లవారు

సచ్చిదానందరూపు లసంశయంబు.

తనను గని తాను లజ్జించుజనుఁడు గలఁడె?
శిశులఁ గనుఁగొని లజ్జించు శిశులు గలరె?
వాసుదేవుండె సర్వమ్ము భావ మున్నఁ
దనను గనువార లెల్లరుఁ దాను గాంచు
నఖిలజనములు వాసుదేవాత్మకు లని
తలఁచి వారికి సాష్టాంగ దండమిడును.
గాని నగ్నుండ ననుచు దాఁగండు మూల;

నరులు నారు లదాటున నరుగుదేరఁ
దికమకల్ గొని నిలువండు దిగ్భ్రమమునఁ
బరులు భూషించినంత లాభంబు గలదె?
పరులు దూషింపఁ దొలఁగునా బ్రహ్మపదము?
వారివాక్యంబులనుబట్టి వచ్చు నొక్క-
నీరజాక్షునను గ్రహానిగ్రహాములు
ఎవ్వ రేమాడి రేనియు నేమి కొఱఁత
వారినుడి సడ్డచేయంగ వలదు బుధుఁడు.

పుట్టినప్పుడు ప్రాణముల్ పోవునపుడు
కూడ రా దొకజేనెఁడు గోఁచియైన

నడిమిజంజాట మిది యేల, గొడవ లెన్ని,
దానికై; గర్వ మెంత యద్దానిఁ దాల్చి
దాని కుపచారమెంత ప్రత్యహము నుదుకఁ?
దనువు మాసిన నొర్చి వస్త్రంబు మాయు
నేమొ యని జంకుచుందురు హీనమతులు.

బళిరె! యెంతభిమానంబు దానిపట్ల?
వ్యాధు లవి యెన్ని యద్దానివలనఁ గలుగు
దొలఁగిపోయిన నది, యెంతదుఃఖ మెదను?
వాని ధరియింపఁడే నవమాన మంట.

వచ్చె నెందుండి యీలజ్జ; వయసునందు
బాల్యమున లేదు, లేదుగా వార్ధకమునఁ
బువ్వఁబోఁణులయందును బురుషులందు?
నడుమఁ గద వచ్చె నీతద్దినంబు మనకుఁ

బశువులను బుతుకాలంబు వార్షికంబు.
మంజువాణులయం దిది మాసికంబు.

కామవిజయులు నైనట్టిఘనులు తప్పఁ
బురుషు లెల్లరు భోగైకపరులు గారె?

వారలను బ్రేరణముచేయువారు తరుణు
లాత్మసౌందర్యవిభవమహత్త్వమునను

కనులు ప్రథమాపరాధముల్ కామ మందుఁ;
గాముఁ డంధుండు సెరరేచుఁ గన్నసుతునె?
కాన గుహ్యాంగముల జనుల్ గప్పవలసెఁ
వానిపైనవికృతులఁ దాపంగఁ గోరి.

కాన యద్దాన మోహంబు గలుగఁబోదు.

కుచ్చెళులఁ గట్టి లోపల గోఁచి పెట్టి
రవికబిగియించి పయ్యఁట బివియఁ గప్పి
యింతచేసినఁ బురుషులదృష్టి యారా

తూటి చని స్త్రీలయంగముల్ తొంగి చూచు
మగువలను గన్నఁ జేనులపై మనను చన్న
కూళ యేటికి బిగియించి గోఁచిపెట్టఁ
దనదు నంగ వికారంబు దాఁపఁ గాదె?

తరుణులను గన్నఁ దల్లు లఁట తలఁపు గొన్న
ధన్యునకు నేల గాపీనధారణంబు?
వాస్తవంబున రెండును వ్యర్థము లగుఁ;
దల్లికడ బిడ్డఁ డెట్లున్నఁ దప్పుగాదు.
బిడ్డకడఁ దల్లి యెట్టున్నఁ జెడ్డ లేదు.
తాయిగండఁడె భేదంబు తలఁచువాఁడు.

తరుణు లందఱు తల్లులఁట తలఁపు లొండె
వాసుదేవుండె సర్వమఁట భావ మొండెఁ
దనరకున్న దిగంబరత్వంబు తగదు.
జంకుగొనఁ డిట్టిఁ దేజాలిజంతువునకు
నసతికైనను మాలకే నహము విడిచి
మ్రొక్కుచుండును శ్రీపతిమూర్తి యనుచు.
విష్ణుఁ డీయెల్లయందును వెలయు లేదె?
తనువుధారణమునకయి తినుచు నేదొ
యెందొ పండుచుఁ దిరుగుచు నెందునేని
మమతయు నహంత దేహాభిమాన మెడలి
యెల్లజంజాటమును వీడి యెల్లవేళఁ
బాణిపాత్రుండు నుదరాన్నపాత్రుఁ డగుచు
నాంతరంగికదృష్టి శ్రీకాంతుఁ గనుచు

బాహ్యదృష్టిని సంకోచపఱచుచు యోగి
సార్థముగ నవధూతయై యమరు నేని
నగ్నుఁడై యుండ నర్హుఁ డనర్హుఁ డోరుఁడు.

నగ్నతయు దుష్ట మనియె నామ్నాయవిధులు.
శ్రుతులను బ్రమాణదృష్టిని జూడకుండు
వాఁడు నగ్నుండు చుమి దిగంబరుఁడు గాఁడు.
అనుచు లక్షణమును శ్రుతు లనియెఁ జుమ్ము.

అంతదాఁక విరాగియై యలరువాఁడు
వల్కలాజినములఁ గుశావళులఁ దాల్పఁ
దగు, నయాచిత మప్రయత్నప్రలబ్ధ
మైన కౌపీనమును నైన నగును దాల్ప.

కాలపక్వంబు, లగ్నిపక్వంబు లైన
నష్టకబళంబులం దిని హావిసు నైన
దైవతాన్నంబుఁ భైక్షంబుఁ దప్పనిడిచి
యంటఁబోక యసాత్త్వికాహార మేది
శీతవాతాతపములకుఁ జింతపడక
కష్టసుఖముల సముఁడయి కలఁక లేక
సర్వదా ధ్యానపరుఁడయి చనుఁ జరింప

అర్హుఁడౌనవధూత తానగునుగాక.
మసనముల, బాట, గుళ్లను, మఠములందు,
వనుల, బయలను, నిర్జనవసతులందు
నుండఁ దగుఁ జొరరాదు గేస్తుండు నింటఁ
దానుగాఁగఁ గుటుంబిప్రార్థనము లేక;

శుకునిఁ గనుఁగొన్న దేవతాసుదతులట్టు
లెవని మ్రోలఁ జరింతురో గృహిణు లర్థి
వాఁడె విజితేంద్రియుం డనవచ్చుఁ గాన
వాఁడె యోగ్యుండగును దిగంబరుఁడు గాఁగ.

కుక్కలును రేవుగుఱ్ఱముల్ గోఁచిలేక
వీథులంబడి తిరుగును వీని కెల్ల
మోక్షమున్నదె? మదిలోనిముదుల నెల్లఁ
దొలఁగి నిశ్చలనిశ్చితకలుషహీన
భక్తిపూరితచిత్తంబు పదిలపడక.

దీని కుపలక్షణం బిది తెలియు మన్త
ఇద్దిలేకున్నఁ దచ్చర్య హేయ మగును.
బాహ్యచిహ్నాల లే దపవర్గ మెపుడు
బాహ్య మభ్యంతరంబులు వాక్కు గూడ
నొక్కరీతిని వర్తించుచుండవలయు.
ముందుచెప్పిన దుర్గుణములను నీవు
గెలువవలయును మోక్షంబు వలచితేని.
వానికి విరోధమగు గుణపాళి నెల్ల
గడనసేయంగ వలయును గడమపడక
అవగుణంబుల గెలువ మున్నాడినట్టి.
విధము లే గాక వేఱొండువిధము గలదు.

ఏగుణంబును బాయంగ నిచ్ఛగింతొ
దానిని స్మరింప కించుకేఁ దానిదాయ
యైనగుణమును దలఁపుమీ యనవరతము.

కామము జయింప నీ కిచ్ఛగలద యేని
కామమును గెల్తు గెల్తును గామ మనుచుఁ
దలఁపవలదన్న యద్దాన బలముపడును.
గాని కామంబు చావ దాకరణిసలుపఁ
దలఁపు నిష్కామనుహిమను, దానివలనఁ
గలుగుసౌఖ్యంబు, దానిని గెలిచినట్టి
వారిపెంపును, బలుమాఱు చారుశీల!
కామమును గెల్చినట్టి యాకామవైరి
రామచంద్రుని శ్రీకృష్ణు రాతుసాత్త్మ
జాతుఁ బ్రహ్లాదుఁ బ్రవరాఖ్యుఁ బూతయశుల
వననివాసుల మానుల, వలచి రాఁగ
నల్లయూర్వశి యంతటియప్సరసను
వలదు పొమ్మన్న యర్జును, జెలువ లైన
జానకిని, దమయంతిని, జంద్రమతిని,
ద్రౌపది, శకుంతలలను, నరుంధతిని వారి
స్థైర్యమును, ధైర్యమును, బెంపు సాహసంబు
దానవచ్చినశాశ్వతం బైనయశము.
లోభజయమును గోరిన లోఁదలంపు
దాన మొక్కటె యీయుగధర్మ మనుచు.
దానశీలుర శిబిని రాధాతనూజు
బలిని జీమూతవాహను, బ్రకటయశుని
రంతిదేవు దధీచిని రామచంద్రు
భూమివిబుధు నక్షత్రస్థుఁ బుణ్యచరితు
సంస్మరింపుము వీరలచరితములను.

ఇటులె తక్కినగుణముల నెల్ల గెలువు.
మడ్డినీరున్నపాత్రలో మంచినీరు.
పోయఁ దొడఁగిన నొకకొంతప్రొద్దునకును,
ముఱికినీ రెల్లమాయమై పోవుఁగాదె.

బాలవలె నీవు చరియింప వాంఛఁగొనుము.
దుర్గుణంబు లవెన్నియో తొలఁగిపోవుఁ
గనుకనే బాల్యమున నుండు మనుచు శ్రుతులు
మొఱలుపెట్టుచు నున్న వా తెఱఁగు వినుము.

## బాల్యేనతిష్ఠాసేత్.

### బాల్యము.

మూఁడు నాల్గబ్దములదాఁక ముదితమిన్న
బాల్యమని యెంచవలయు నీపథమునందు.
ఇట్టివయసున నుండెడినట్టివాఁడు
పుత్రకాంక్ష, ధనాశ, కళత్రకాంక్ష
కాంచునే? ధనమార్జింప నెంచు నొక్కొ?
దాని రక్షింపఁ దలఁచునే? పూను నొక్కొ
మాపటికి రేపటికి నని దాఁపధనము?
దీపములఁ బాములను బట్టఁ దివురుఁగాని
భయ మెఱుంగునె? తరుణులు ప్రియము దోఁప
ముద్దులను బెట్టి తమకుచములను నొత్తి
మక్కువను జూపఁ జెక్కు చెమర్చునొక్కొ?
యువతికుచములఁ దన కేల నొత్తిపట్టు
వేళనైనను గామంబుపీడ గనునె?
దండనముసేయఁ దల్లియేఁ దండ్రియైనఁ

గోపముంచునె వారిపైఁ గూర్మి విడిచి?
తలఁచునే పగ పగఁదీర్పఁ దలఁపుగొనునె?
మాన మవమాన మనియెడిజ్ఞాన మున్నె?
మనసునందైన దేహాభిమాన మున్నె?
గంధ మలఁదిన నైనఁ బంకంబుఁ బూయ
నైన భేదంబుఁ దలఁచునే యాత్మయందు?
బిడియ మున్నదె దిసమొల పడఁతిఁ గనినఁ?
దాను దిసమొలఁ దిరుగాడఁ ద్రపయుఁ గలదె?
కూర్కునే గాని యెందైనఁ గొఱఁతపడక?
నిద్ర వచ్చిన సుఖశయ్య నియతి గలదె?
తత్తరముపాటు గొనునె యెద్దాన నైన?
వ్యసన మున్నదె యేవిషయంబునందు?
నెవ్వరైన నుతించిన నెగిరిపడునె?
క్రుంగిపోవునె నిందింపఁ గుతిలపడునె?
దేవురించునె తండ్రికై దీనవృత్తి?
తల్లిపెట్టినయది తిని తనివిఁ గాంచు.
ఏదిచేసినఁ బరులేమి యెంచువారొ
యంచుఁ బరచిత్తములఁ బట్టి తనదుచర్య
దిద్దుకొనుచుండునే లజ్జ దిగులు పడుచు?
యశము గోరునె? యాశించునా ప్రతిష్ఠ?
జనుల వంచింప దంభవేషములఁ గొనునె?
కల్లకపటంబు లెఱుఁగునే కలల నైన?
ఇచ్ఛగించునె వ్యర్థంబు మాటలాడఁ?
గొనరి లోకవార్తకుఁ జెవుల్ గోసికొనునె?

విధినిషేధంబు లెంచునే వేన నైనఁ
దల్లిపెట్టినయదితిని తగులులేక
స్వేచ్ఛఁగోలఁదిని విహరించు సిగ్గు భయము
మాన మవమతి దేహాభిమాన మెడలి.
ఆఁకలెత్తిన నమ్మా యటంచుఁ బోవుఁ
బరులు భయపెట్టిరేనియు బాలుఁ డనెను
వాఁడు మాయమ్మతోఁ జెప్పువాఁడ ననుచు
ఎల్ల కాధారమే తనతల్లి యనుచు
నమ్మి తిరుగాడు బాలుండు నమ్మదమున
అట్టులే జ్ఞానియును గామ హర్ష రోష
మాన లజ్జా భయంబులు మాని మదివి
ధారణము పోషణము సేయు తల్లిదండ్రి
దైవ మొక్కండె యని వేఱుతలఁపులేక
భార మెల్లను హరిమీఁదఁ బాఱవైచి
నిర్భరుండయి వహియించి నిర్భయతను.
దనది యిది యనుకోనక స్వతంత్రుఁ డగుచు.
దైవపరతంత్రుఁడై యహంభావ మెడలి
యన్నివిధముల గాలినా నరుగవలయు.
ఇట్టిదెస నాకు శ్రీరామ యెన్నఁడొక్కో
ప్రాప్తమయ్యెడు నీపదాబ్జములు గొలువ.

## నిద్రాజయము.

నిద్రను జయింప నెంతయు భద్ర మగును
గాని దాని జయించుట కష్ట మమ్మ.
నిదుర హెచ్చిన వచ్చును ముదిమి వేగ

ఆయువున సగభాగంబు నపహరించు.
మత్తతను గూర్చు బుద్ధికి మాంద్య మిడును.
అలసతను గూర్చుఁ గార్యంబులందుఁ గాన
నిదురకడిమిని జెఱచెడి నియతి గొనుము.
జాగరణ ముపవాసంబు బాగుగాదు
యోగమును నభ్యసించెడియుత్తములకు
యుక్తమైనంత రెండును నుండవలయు
రెండుగంటలు రే నిద్ర యుండఁదగును.
ఇదియు భగవంతుసేవగా నెంచవలయు.
అవయవంబులు భగవంతునివియ కాన
విరతి గూర్పక కష్టంబు పెట్ట నగునె?

అభ్యసము, త్రోటకమ్ము నాహారనియతి
క్రమముగా మెల్ల నిద్రవేగంబు నణఁచు.
సత్త్వగుణవృద్ధి నిద్రను సమయఁ జేయు
వ్యాసులు వచించె నిటు మహాభారతమున
నీకు నభ్యాసపడినట్టినిద్రకాల
మందు వారంబునకొ పదునైదుదివస
ములకొ యరగంట చొప్పున ముందుముందు
నిద్ర లేలెమ్ము పనిఁబూని నియతముగను.
నియమితంబైన వేళకు నిద్రలేపు
నట్టిగడియార మైన నీయండ నుంచు
కొనియె నిద్రింపు మది మేలుకొలుపు నిన్ను
మేలుకొనియెద నే నిట్టివేళ కనుచు
మనసునఁ దృఢసంకల్పమును వహించి

యట్టె నిద్రింపు మెలకువ యప్పు డగును.
నిద్ర స్వాధీనపడుదాఁక నీకు రాత్రు
లందు భోజనమును మాని యల్పముగను.
పండొ కాయయొ భుజియింపు పాలుద్రావు
మితముగా నంతె; కడుపార గతుకవలదు.
ఆసనమ్మునఁ గూర్చుండి యట్టులిట్టు
కదల కొకచుక్క సరిగాఁగఁ గన్నులకును
గోడయందుంచి కన్నీరు గురియుదాఁక
మనసు దృష్టియందుంచి కనుము తెప్ప.

వ్రాలకుండఁగఁ గొలఁదియొ కాలమాది
నవల హెచ్చింప నగుఁ బదునైదునిమిష
ములకు దినములు జరగెడి కొలఁదిఁ గంటి
నొప్పి కలుగకుండఁగ; హెచ్చైన నొప్పి వచ్చుఁ
గాన మెలమెల్లఁ జేయంగఁ గార్య మగును.

నాడులును శుద్ధమైతె యున్నఁగీడు లేదు.
అంద్రు యోగులు త్రోటకం బంచు దీని.

నాడికాశుద్ధి లేకున్నఁ గీడు గలదు.
దానిచేఁ గాదె భ్రుకుటిమధ్యంబునందు
దృష్టినిలిపెడివారలు భ్రష్టు లగుట
కంటిరోగాలచేతను గాసిపడుట
ఘనశిరోవేదనలచేతఁ గష్టపడుట
పుస్తకంబులలోఁ గని మూఢగురుల
బోధలను నమ్ముకొని చెడిపోవుచున్న

వారు పెక్కురుపురుషులు నారులిపుడు.

కండువును, నిద్ర, రతియును, గలహాభుక్తు
లభ్యసనమున నభివృద్ధి గనుచునుండు.
నటులె క్షీణించిపోవు నభ్యాసమునను.
ఎదియు నీకు రుచించునో యదియె సలుపు.
పవ్వళింపకు మెత్తనిపాన్పులందు
వంపుకుర్చీలపై శయనింపఁబోకు.
కుక్కిమంచాలమీఁదను గూర్కవలదు.
పండుకొనుటయు నది యొక్కపనిగ నెంచి
పండుకొనకుము నిద్ర పైపడెడుదాఁక
వెల్లకిలఁ బండుకొనకుమీ యెల్లవేళ
ఎడమపార్శ్వంబునం బండు టెంతొమేలు
నిదుర తగ్గును సుఖశయ్య కుదురకున్న.

కాయమెంతయు శ్రమియించి గాసిపడిన
నాఁపఁగారాక నిద్రపై నడరెనేని
అంబ పండుము ప్రేతాసనంబునందు.
సడలఁ జేయుము నరములు సంధులెల్ల
సమముగా శ్వాస ముంచిన శ్రమము దొలఁగు.
ఒక్కయరగంట యిటు నిద్ర నొందితేని
చులకనగు మేను, పనులును సుకరములగు.

గెలువఁగారాని యవగుణంబులును గలుగ
వాని వినియోగపఱుపు శ్రీవరునిమీఁదఁ
బూఁతనయు విషమిడుటను బూఁతయయ్యె.

వైరమునఁ జేదివిభుఁ డపవర్గ మొందె
కామమున గోపికలు ముక్తిఁ గాంచినారు
భయముబలమునఁ గంసుండు భద్రపడియె
అగ్నిలోఁ బడ్డయట్టిపదార్థ మేది
యైన వెసభస్మమై నాశమందునట్లు
గంగలోఁ బడ్డపురిలోనికశ్మలంబు
పూతమై శుద్ధముగ మాఱిపోవునట్లు.
ఎట్టిమనసైన హరిమీఁదఁ బెట్టినంత
విగతకల్మషమై పోవు వెంటవెంట.
కారుటగ్గినిబుటమిడ్డకనకమనఁగ.

శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమాన
మానసత్వ మహావైభవ వావిలికొలను రామ
చంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బ
రాయనామధేయ ప్రణీతంబైన ముముక్షు
హితచర్యయందుఁ బ్రథమా
శ్వాసము.

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.

స్వ స్త్య స్తు.

---

Printed at the B. M. Press, Choolai, Madras:—1929.

శ్రీరామాయనమః.

# ముముక్షు హితచర్య.



## ద్వితీయాశ్వాసము.

### వాసుదేవస్సర్వమ్.

వాసుదేవుఁడె సర్వ మఃభావ మొకఁడె
యవగుణంబుల కెల్ల దివ్యౌషధంబు
అమలగుణావాళి కెల్లను నాస్పదంబు
అనుచుఁ బలుమాఱు పలికితి వప్పుడపుడు
తెలుపవే తండ్రి యదియు సిద్ధించు తెఱఁగు
అనిన జనకుండు తనకూర్మి తనయ కనియె.

అదియె కడమెట్టు భక్తునకైనఁ గాని
జ్ఞానికైనను మఱి యోగికైనఁ గాని
పెక్కు లేఁడులో జన్మాలో వెచ్చపడక
యట్టిదశ ప్రాప్తపడఁగ సాధ్యంబు గాదు
అదియు దృఢనిష్ఠఁ బూని యేకాగ్రవృత్తి
మనసు నంతయు దానిపై మరపవలయు.
అభ్యసించెడి విధ మింక నాడువాఁడ
కర్మయోగికిఁ గర్మముల్ గాదు విడువ
జ్ఞానయోగికి సర్వంబు గానిపించు

వాసుదేవాత్మకంబుగ; భక్తునకును
నక్రూరుతోఁ జెడి; నటుతోఁచునట్టివిధము
నుద్ధవునకును బలికె దామోదరుండు.

తన్నుఁ జూచి హసించెడి తనదుజనుల
దైహికం బగులజ్జయు దంభము నివి
మూలముట్టుగ విడనాడి మ్రొక్కవలయుఁ
గుక్కలకు మాలలకు ఖరగోవులకును
గరములను మోడ్చి యీశ్వరకళ లటంచు.

అట్లుచేసిన మమత నహంకృతియును
స్వాభిమానంబు సర్వంబు నణఁగిపోవు
ఎల్లబ్రహ్మాత్మకం బనుదృష్టి నిలుచు
సాధువులవర్తనంబునఁ జక్కనిలిచి
బ్రహ్మమయముగ సర్వంబుఁ బొలఁజూచు
నిత్యసంగతి యీలాగు నిలుకడొందు
అట్టివానికి మోక్షంబు హస్తగతము.

ఇట్టివానికి దృష్టి యెందెందుఁ బోవు
నందె సిద్ధించుచుండు సమాధి వింటె.
మున్ను వచియించితినిగాదె పూర్ణముగను
గనక మే పెక్కుసొమ్ములై కానఁబడెడు
నట్లు హరియొక్కఁడే పెక్కులాకృతులను
దాల్చి క్రీడించుచున్నాఁడు తథ్యముగను.
కానఁగా వచ్చునదియును గానరాని

యదియు లోపల వెలుపల నంత నిండి
యలరుచున్నాఁడు సుమ్ము నారాయణుండు.
హరిమయము గాని ద్రవ్యంబు హరిమయంబు
గాని శబ్దంబు నొక్కటిఁ గానరాదు
సర్వ మాతని వలననే జన్మమొందు
సర్వ మాతని వలననే సంవసించు
సర్వ మాతని యందునే సంభవించు
సర్వ మాతని యందునే సంవసించు
సర్వ మాతనివలననే జరగుచుండు
సర్వ మాతనియందునే జరగుచుండు

వాస్తవ మిటుండ నజ్ఞానవశత మనము
నే నటంచును నీ వంచు మ్రా నటంచు
గుఱ్ఱ మనుచును నక్కని కుక్క యనుచు
బాఁపఁడని శూద్రుఁడని కాటిబాఁపఁ డనుచు
నింత యేటికిఁ ? గనవచ్చు నెల్లవాని
వేఱువేఱుగ మనము భావింతు మెదను
ఇట్టి విపరీత భావంబె హేతు వయ్యె
గామరోష భయత్రపాగర్వలోభ
మానమాత్సర్య దంభావమానములకు.

ఏది చూచిన హరియంచు నెఱిఁగితేని
ఏది వినినను హరియంచు నెంచితేని
ఏది తినినను హరియంచు నెంచితేని

ఏది కన హరికృత మని యెఱిఁగితేని
ఎట్టి శబ్దంబు హరియంచు నెంచితేని
ఏది తాఁకిన హరియంచు నెంచితేని
ఏది మూచూడ హరియంచు నెంచితేని
సకలమును హరి గావున సకలమునకు
భక్తిమై ధాత్రి సాష్టాంగపడితివేని
భగవతే నమ యని పూర్ణ భావమునను
ఏపదార్థంబు నైనను నీవు గనిన
నీదుమనమెల్లఁ దనువుపై నిలుపఁబోక
యద్ది భేదించి హృదయ గుహాంతరమున
వెలుఁగులోపల నుండెడి విశ్వవిభుని
వీక్షణము చేయునట్లు నీ వెంచితేని
కొంతకాలంబునకు నీకుఁ గొఱఁతలేక
యట్టిభావంబు స్థిరపడు;నట్లె యవల
గాసిపడితేని పదపడి కానవచ్చు
సర్వ మేకాకృతిని నీకు స్పష్టముగను.
తొలుత నిను నీవు గాంచుట గలిగెనేని
సత్వరంబుగ నియ్యది సాధ్యపడును.
అట్టిదశ వచ్చుఁ బోవును నంతెకాని
చాలఁగాలంబు నిలువదు సత్యముగను.
దీర్ఘకాలంబు నిలిచెనా దేహ మనల
నిలువఁబోవదు ధాత్రిపైఁ గలికిమిన్న!
పుట్టఁగాఁబోవు వెండియు భూమిమీఁద

మమతయు నహంత దీనిచే మాయ మగును

శునకనారాయణా యను శునకములను
వృక్ష నారాయణా యను వృక్షములను
పేదనారాయణా యను పేదమనుజుఁ
దల్లు లని లక్ష్ము లని మ్రొక్కు తరుణులకును

తీవ్రముగ దీని నీవు సాధించుతలఁపు
గలద యేనియు వలయు నేకాంతివృత్తి
మౌనమును బూని సంగంబు మానవలయు
నిత్య మచ్యుతుపై మది నిలుపవలయు
దీని సాధింప మేలైన తెరువు గలదు
ఒక్కకొన్నిదినంబు లీయూర నీవు
నిలువఁగలిగిన నీవది నేర్వఁగలవు
జనని! లేఖల నది తెల్ప సాధ్యపడదు.
అవల నభ్యాసవశమున హరికృపా క
టాక్షబలమున నది నీకుఁ బ్రాప్తమగును.
ఎట్టియోగంబు సాధింప నెంత నీవు
ఏండ్లుపూండ్లుగ శ్రమపడి యేమిఫలము?
హరిదయాంభోధి కరుణా కటాక్షవీక్ష
ణంబు లేకున్న నెల్ల వ్యర్థంబ యగును.

హరికటాక్షంబు భక్తిచేఁ బ్రాప్త మగును
గాని పెరత్రోవలను ద్రొక్కఁ గలుగఁ బోదు
కాన హరిభక్తి సేయుట కార్యమగును

హరిపదాంభోజభక్తి నీకమరి యున్న
దొడ్డదుర్ఘటమేనియుఁ త్రుటిఫలించు
స్వప్రయత్నంబు సర్వంబు వ్యర్థమమ్మ
శౌరికరుణాకటాక్షవీక్షణము లేక

వచ్చునో రాదో హరిదయ వ్యర్థకష్ట
మగునో యంచును శంకింపఁ దగదునీకు.
నీదుకృషి పరిపక్వమై నెగడెనేనిఁ
దడవుసేయఁడు నిమిషమేని దాశరథుఁడు
ఫలము నీయంగ సందియపడఁగ వలదు
ఫలము రాకున్న నీదె లోపంబు సుమ్ము.
ఏదియో లోపముండు నీకెఱుఁగరాక
కాన నుత్సాహమెడలక కనులు విచ్చి
చక్క హృదయంబు శోధించి సలుపు సేవ.
ఎంతచేసిన నంతంత హెచ్చుఫలమె
వచ్చునే కాని లవమేని వ్యర్థపడదు.

ఏదిచేసిన విడిచిన నేమిభయము
సతతనారాయణాంఘ్రి సంస్మృతిరతుండు.

కర్మయోగము.

అవగుణంబులు దొలఁగినయంతమాత్ర
నమలగుణములు లభియించినంతమాత్ర
ముక్తి లేదమ్మ హరిమీఁద భక్తి నిలక
భక్తి యవ్యవధానైకముక్తిదంబు

ముక్తిమార్గంబు లీకమీఁద ముచ్చటింతు
నాలకింపుము శ్రేయంబు నందఁగలవు
కర్మయోగంబు జ్ఞానయోగంబు భక్తి
యోగము ప్రపత్తి యన నాలుగొప్పుచుండు
ముఖ్యమార్గంబు లగుచును మోక్షమునకు
అట్టి దాచార్యనభిమాన మైదవదియు.
ఎవ్వఁ డేవర్ణమున జనియించె వాఁడు
వానివర్ణంబునకుఁ దగుపనుల నెల్ల
వరుస దప్పక శాస్త్రీయపద్ధతులను
గొదవ లేకుండఁ జేయుచు గురుమనీష
ఫలము నేమియుఁ గోరక, ఫలము నెల్ల
బ్రహ్మమున కర్పణం బని పలుకుఁ దుదిని.

కర్మములఁ జేయు ఫలమునఁ గాంక్ష లేక
వేదచోదిత మిది యాట విధి యటంచు
వివిధకర్మంబులందు ద్వైవిధ్య ముండు
ద్రవ్యభాగంబు, నదియె పదార్థసమితి.
రెండవది జ్ఞానభాగం బరీణచరిత.

వాసుదేవుండె సర్వాత్మ భావమునను
గార్యమును, గర్త, భోక్తయుఁ, గర్మసాధ
నములు సర్వంబు బ్రహ్మాత్మకం బటంచు
నెంచి కావించి ఫలము నర్పించి బ్రహ్మ
మునకె, తా సాక్షి యగుచును జరగవలయు

ఏది చేసినఁ, దినినను, నేది యిడిన,
నేది హోమంబుఁజేసిన నేతపస్సు
సలుప రామార్పణం బని పలుకవలయు
పలుకుటే కాదు నెఱ మది సలుపవలయు.

శాస్త్రపద్ధతి లోపంబు సలుపరాదు
శ్రద్ధయను భక్తి యింతేని సడలరాదు
పహితకృత్యంబు లేవియు విడువరాదు
కర్మయోగంబు సాధించుకర్మఠునకు.

ఇందు లోపంబు గలిగిన హితచరిత్ర!
బంధమై యది పీడించు వాస్తవముగ.

నిత్యనైమిత్తికంబుల నియమయుక్తిఁ
దపము దానంబు యజ్ఞంబు దైవతార్చ
నంబు సత్తీర్థసంసేవనంబు లెల్లఁ
బరమపురుషార్చనాబుద్ధి వలయుఁ జలుప.

ఇట్లుచేసినఁ గలుషనివృత్తి యగును.
మఱియుఁ దన్మూలరజము తమంబు చెడును.
సత్త్వ మభివృద్ధిఁ గాంచుఁ, దచ్ఛక్తివలన
మనసు నిర్మలమగు, దాని మహిమఁ జేసి
విషయములపట్ల నాతఁడు విముఖుఁ డగును.

జ్ఞాననిష్ఠకు నధికార మూను నిపుడు
ఆత్మసాక్షాత్కరించుఁ గాలాంతరమునఁ

గర్మయోగంబుచేతనే కర్తునకు.
అట్లు గాకున్న జ్ఞానసంప్రాప్తి యగును.
గలికి! యద్దాన నాత్మ సాక్షాత్కరించు.

కర్మమున హాని గలదు సకామ మైనఁ
గర్మమున మేలు గలదు నిష్కామ మైన.

కర్మఫలములఁ గోరఁడేని గర్తుండు
వాఁడె యోగియు సన్న్యాసి వాఁడె చుమ్ము

కామ్యఫలములఁ గోరక కర్మములను
నాచరించెడివాఁడు సన్న్యాసి గాని
కర్మముల మానినాతండు కాఁడు కాఁడు.
వాఁడు నుభయప్రభ్రష్టుండు వాస్తవంబు.

కాన జీవించునందాఁకఁ గర్మములను
జలుపవలయును బామరునట్లె జ్ఞాని
లోకసంగ్రహమునకునేని బ్రాకటముగ.

ఎద్ది శ్రేష్ఠుం డొనర్చునో యద్ది మూఢ
జనులు గావింత్రు గాఢవిశ్వాసమునను.
చేసినంతట మేలేసిఁ జేయకున్నె
యంత సుజ్ఞాని యనుచు జనావళులును
గర్మముల మాని, చెడి, యధోగతులఁ బడుదు
రట్టిదుర్గతిహేతువైనట్టిజ్ఞాని
యాఫలంబును నిరయాన ననుభవించు.

ఇంద్రియంబులు శాత్రవు లెప్పుడెపుడు
తమ్ము గెలిచిన వానిని దడవులేక
మొనసి మరల జయింతమా యనుచు వేయి
కన్నులను గాచి యుండును గాన జ్ఞాని
యప్రమత్తతఁ గర్మంబు లాచరించు
ఫలము బ్రహ్మార్పణం బని బ్రదుకుదనుక.

మనసు నిర్మలముగఁ జేయుమహిమ గలిగి
బహుళప్రతిబంధములఁ ద్రుంచుపటిమ వెలయు
దానతపములు యజ్ఞముల్ మానరాదు
ఫలము గోరక వీనిని జలుపవలయు.

పంచయజ్ఞంబులును సంధ్య వార్చుటయును
అగ్నిహోత్రంబు మఱి తీర్థయాత్ర పుణ్య
నదుల మునుఁగుట, కృఛ్రచాంద్రాయణములు
వ్రతజపంబులు, ఫలమూల భక్షణంబు
అధ్యయన మివి యెల్లఁ గర్మాంగములగు.

అమ్మ యివిచేత కర్మయోగాఖ్యఁ బరఁగు.
స్త్రీలకును గర్మయోగంబు శీలయుక్తి
భర్తృశుశ్రూష గృహభారవహన మమ్మ.

ధన్యచారిత్ర! శౌరి స్వతంత్రకర్త
నీవు పరతంత్రకర్త్రివి నిశ్చయముగ.
కానఁ గర్త్రిని నే ననుగర్వ మెడలి

దాసివలెఁ జేయుమీ కార్యతతుల నెల్ల.
కలికి! హరియె ప్రయోజకకర్త యగును
దలఁప మనము ప్రయోజ్యకర్తలము సుమ్ము.

## సృష్టిహేతువు.

లలన! హరిచేతఁ *క్రీడనకులము మనము
పుట్టచెండాడునట్టి యా భూవరుండు
దానిచే సంతసించుట గాన లేదే
తనదుసంప్రీతికినిగాఁగ దానినట్టు
లిట్టు తనయిచ్చకొలఁదిని గొట్టుచుండు.
అటులె నారాయణుండు తా నాత్మతుష్టి
కెల్లభూతాళిచేతఁ జేయించుకొనును
గర్మముల నెల్ల; వాస్తవకర్త యతఁడె.
స్వోపకరణముల్ దేహేంద్రియాత్కరములు

ఇట్టిభావంబుచేత నే యెల్ల వేళ
నెల్లపనులను జేయుము పొల్లుపోక
ఆత్మ నిలుపుము దాస్యనామనుపదంబు
నీవు కృతకృత్య వగుదువు నిశ్చయముగ

తనదువేడుకకై యిట్లు మనల నేఁప
న్యాయ్య మవునొక్కొ శ్రీరమానాథునకును?
అనిన జనకుండు వచియించెఁ దనదు సుతకు.

---

* క్రీడనకులము = ఆటవస్తువులము.

అఖిలభూతంబులందును హరి సముండు
పక్షపాతంబు లేదెట్టిపట్టునందు
క్రౌర్య మనునది లేశంబు గానఁబడదు
పూతనిర్మల కరుణైక పూర్ణుఁ డతఁడు
హేయగుణముల కావంత యెడములేదు
ప్రకృతిసాంగత్యమునఁ జేసి ప్రత్యగాత్మ
జడసమంబుగ నగుచును జెడుటగాంచి
అయ్యయో మనబిడ్డండు నెయ్య మెడలి
చెడియెనే యని తపియించి చిత్తమందు
వానికామంబు లన్నియు వరుసతోడ
సఫల మొనరించుచును వాన సంభవించు
దుష్టఫలముల నెల్లను దోడుతోన
యనుభవింపఁగఁ జేయుచు యాతినలుగ
వాఁడు విసుఁగెత్తి వేసారి వలదు వలదు
కామసాంగత్య మీకడగండ్లు నాకు
వలదు వలదయ్య దేవుఁడా వలదు వలదు
కుయ్యొ మొఱ్ఱో యటంచును గూఁత లిడఁగఁ
జేరఁదీయును బదపడి శ్రీధరుండు.

అష్ట విష్ణుపురాణంబునందు సృష్టి
జీవులకు నుపకృతి యని చెప్పఁబడియె
వ్యాసముని లీల యంచును బలికినాఁడు
బ్రహ్మసూత్రంబులందు విస్పష్టఫణితి.
కాన జీవోపకారక మైనలీల

యనుచుఁ దలఁపుమ యది యెట్టు లనెద వేమొ
పుట్టచెండాడునట్టి యేపురుషుఁడైనఁ
గొట్టినా చేతికిని వచ్చునట్టు చెండు
అట్టు గొట్టిన నున్మాదుఁ డనరె యతని.
గమ్యతలమును బొంద లక్ష్యంబు దాఁక
నెటులు గొట్టంగవలయునో యటులె కొట్టు
నెదుటివాఁడు నిషేధించు, నితఁడు విడక
యెట్టులైనను సాధించు హృదయగతము.
ఇదియ కాదమ్మ క్రీడనా నెఱుగఁబడెడు.

ప్రకృతికిని జిక్కి దుఃఖించువాని జీవుఁ
గనుచుఁ గరుణార్ద్రచిత్తుఁడౌ దనుజవైరి
తన్నుఁ జేరంగఁ గ్రొత్తనుతలఁపుఁజేసి
దాని కనువైనత్రోవ నాతనికిఁ దెలుపు.
ఐన జీవుఁ డొనర్చిన కర్మజాల
మడ్డమై వచ్చు నాతనియధ్వమునకు.
అంత విడువక కంజాక్షుఁ డతనివేఱె
మార్గమున నుంచు,నతనికర్మంబు లచట
నడ్డపడుచుండు; జీవుఁడో యజ్ఞుఁ డగుచుఁ
గర్మ మొనరించు నది వానిఁ గష్టపెట్టు
దానిఁ దప్పింపఁ జూచును దానవారి.

కర్మములచేతఁ గలిగెడుకష్టములను
వానిఁ దప్పింపఁ బరమాత్మ పడెడుపాటు

తెలిసి జీవుండు జ్ఞానంబు గలిగి వాని
చేయుటలు మాని భగవంతుసేవ సేయు
నంతతో వానిజన్మంబు లన్నిసమయుఁ
జెప్పవే దేవుఁ డొనరించు చెఱుప దేదొ.
ఇట్లు చేయుట క్రౌర్యమా యెంచవమ్మ.

కుంభకారుండు దీర్చుచుఁ గుంభములను
లోనఁ గేలుంచి పలకతోఁ బైన కొట్టు
వంకరలు పోయి చక్కని వర్తులములుగ
నేఱుపడునట్లు;లాతఁడు క్రూరుఁ డగునె
క్రోధ మనదేమొ కుండపైఁ గుమ్మరికిని?
అటులె మన కబ్బుకష్టంబు లంచుఁ దలఁపు.

జనని! నీనుశరీరంబు జడముగాదె?
దానికిని సుఖదుఃఖముల్ దాపరింప
వనరెదేటికి నీకేమొ వచ్చినట్లు?
దానికైనను సుఖదుఃఖతతులు గలవె?

నిజము చెప్పుము దేవుండు నీకు నేమి
హాని సలిపెనొ? చెఱిచెనా జ్ఞానశక్తి?
సదమలానందగుణమును సదమదంబు
చేసెనా? తెర కీశు దూషింపనేల?
నీవు మనసారఁ జేసిననీదుకృతులె
యిన్నియును నీకుఁ జేయుచు నున్నవమ్మ.

నీమనాలుకఁ గోఱికియు నీవె పరుల
దూషణముసేయ నగ్గమా దుష్టులనుచు
బాలుఁడు విషంబు భుజియింప వాంఛపడిన
వైద్యుఁ డీయంగ వచ్చునా వలదు నాక.
అటులె దుష్కామములకు నే నాసపడిన
సఫల మొనరింపనచ్చునా చక్రధరుఁడు?
అనుచుఁ బ్రశ్నించుతనయకు జనకుఁ డనియె.

అమ్మ! బాలుండు దీపంబు నంటఁబోవ
వలదు వలదని తల్లి యావలికి లాగ
మరలఁ జనుచుండుఁ బలుమఱు మాన కతఁడు
ఒక్కపరి చేయి కాలిన నూరకుండుఁ
బొమ్మటన్నను దానికై పోవఁ డవల
అంతమాత్రానఁ బ్రాణభయంబు లేదు
మందు వేసిన గాయంబు మానిపోవు

ప్రాకృతంబులపై నాశ పాయుటకును
గూఁకటులతోడ నటుసేయు శ్రీకరుండు.

బాలు నన నేల? ప్రాయంపువాఁడె యైన
జారతను మాను మనిన దుశ్చరితుఁ డెటిఁగి.
మానునే దాని? దుస్సహామయము దవిలి
కంటినీళ్లులు ధారలుగాఁగఁ గురియ
బాధపెట్టినమానెడిభంగి; నవలఁ
తల్లులని లంజలకు సాల్ల దండమిడఁడె?

## అష్టాంగయోగము.

తెలియ నష్టాంగయోగంబుతీరు వినుము
కర్మయోగంబునందు భాగంబ యదియు
యమము లాదిగ నెనిమిది యంగములను
గలుగుటను నట్టిపేరను జెలఁగు నదియు

మనుజుఁ డగువాఁడు యమములఁ మానఁదగదు
యోగియైనను నైహికభోగియైన
నవియు నిత్యంబు లగుఁగాన నమలచరిత!

ఇపుడు యోగులు కొందఱవెట్టి వాక్కొ
యమము లెఱుఁగ రనుష్ఠాన మనఁగ నేల!
తలఁపవేని యధోలోకముల వసింప
నేమఱఁగఁ బోకు మమ్మగో యీయమముల

యమవిహీనునకును యోగ మబ్బ దమ్మ
వలదు హఠయోగమున నీవు బాధపడఁగ
నేను నేర్పిన పద్ధతి నీవు దేహ
శ్రమము గావింపు మంతియ చాలు నమ్మ
వలయు నాహారనియతి యవశ్యముగను
బ్రహ్మచర్యవ్రతంబును వలయుఁ జలుప

సుకర మైనట్టియాసనం బొకటి చాలు
స్వస్తికం బెంతో సుఖమయి సాగునమ్మ
చాలు సిద్ధాసనం బది కీవెఱింగి

యభ్యసించిన; నది శ్రేష్ఠ మాసనముల
ఆది లభించెడి యందాఁక నాసనములఁ
బద్మమును, బద్ధపద్మమభ్యాపపఱుపు
స్వస్తికమె కొంద ఱకుఁ గాదుసాధ్య మనుచు
ననుభవము దెల్పెఁ బురుషుల కతివలకును.
అట్టివారికి మేలు సిద్ధాసనంబు;

రాజయోగంబునకుఁ దల్లి! ప్రాణజయము
ఐచ్ఛికం బదిలేకున్న హాని లేదు
కాని యొకకొంత యుండుటే కార్య మగును
అనుచు నెఱిఁగితి నమ్మ నాయనుభవమున,

ప్రాణజయ మొండె చాలుఁ గార్యములు సలుప.
జక్క నెఱుఁగుము దీని నాచార్యువలనఁ
బుస్తకంబులఁ వ్రాఁతల మోసపోకు
పుస్తకం బెదియైనను బూర్ణముగను
మర్మమునువీడి చెప్పదు ధర్మశీల!

పుస్తము లటన్న నిప్పుడు పుట్టుచున్న
పుస్తములు గావు ; తొల్లిటిపుస్తకములు
ప్రజల వంచించి విత్తసంచయముకొఱకు
పేర్లుమాత్రము పెద్దవి పెట్టి రిత్త
కాఱుకూఁతలు వ్రాయఁగఁ గంటినమ్మ
నేఁటియోగుల మనువారు నీచమతిని

కాయతత్త్వంబులను మార్పు గానవచ్చు
వారివారికిఁ దగినట్లు వలయుఁ జెప్ప
సక్రమంబుగ నేర్చినఁ జాల మేలు
అక్రమంబుగ నేర్చిన హానిగలదు.

మొదల నెవఁడు ప్రాణాయామమును వచించు
యోగశిక్షను వాఁడె యయోగ్యుఁ డనుచు
నమ్ముమీ తల్లి హానికరమ్ము యదియు.
భక్తి నియమంబు లేదని మొఱుగు నెవ్వఁ
డతఁడు దొంగని నమ్ముమీ యాత్మయందు.

పొట్టకును మించి ఓమ్ము కన్పట్టెనేని
సిద్ధవలెఁ గడుపున్నను సిద్ధ మదియు
వాఁ డెఱుంగఁడు యోగంబు వాస్తవముగ.

పుస్తకములఁ జూచి కొందఱు, మోసగాండ్ర
టక్కుమాటలఁ జెడినారు పెక్కుజనులు

పాముతో నాటలాడినభంగి నగును
ప్రాణవాయువు బంధించుఫక్కి యరయ
అడవియేనుఁగు వంటిదం చనెదు శ్రుతులు
పట్టుదల, ఓర్పు, గట్టియభ్యాస మున్నఁ
దగును నీవిదిసాధింపఁ దగుదువమ్మ.

పలికితిని గాదె యీయోగపద్ధతులను
భక్తచర్యఁ దృతీయసోపానమునను.

ఇచట౯ జర్వితచర్వణం బేల మరల.

వలదు షట్చక్రశోధన మలఘుశీల
దానితోఁ బనిలేదు భక్తప్రవరున

కెనిమిదేఁడులు మొదలుగ నెనుబదేండ్ల
దనుక దీనిని నభ్యాస మునుపవచ్చు
బాలురును వృద్ధులును మఱిస్త్రీలునైన.

జ్ఞాన భక్తుల సాధింప సాహ్యపడును
గాన యోగ ముపేక్షింపఁగాదు తగవు

యోగమును నీవు సాధింపఁ బూనుదేని
యమములను నియమంబుల నాస్థ గలిగి
యాసనము గెల్చి, ప్రాణజయంబు నొంది
కేవలంబనుకుంభక కేళి నేర్చి
యోనిబంధంబు మర్మంబు నొయ్యఁదెలిసి
షణ్ముఖీముద్రసాధించి చతురరీతి
నడిమినాడిని జీవుని నడిపి బ్రహ్మ
రంధ్రమును వేగ భేదించి బ్రహ్మమందు
గలుపుమీ దాని, జన్మంబు గలుగ దవల.
వలయు నేనియుఁ దెలిపెద వాని తెఱఁగు.
కష్ట మోతల్లి! మిక్కిలి కష్టమమ్మ.
దీనికైనను వలయును దేవుకరుణ
అదియు లేకున్నశ్రమ మెల్ల వ్యర్థ మమ్మ
దాని సాధింప భక్తియే తగినయుక్తి

అది లభించినఁ బైదశ ప్రాప్తమగును

యమములను నియమంబుల నాస్థ గలిగి
యాసనము గెల్చి ప్రాణంబు ననువుపఱిచి
భక్తితోడుత ధ్యానంబు పదిలపడినఁ
దక్కినవి యెల్ల దైవమే తక్కఁజేయు.

వెలఁది! న్యాసంబు నాత్మనివేదనంబు
ఈశ్వరప్రణిధానంబు నివియు మూఁడు
నొక్కయర్థంబునే చెప్పు చుండు వింటె,
ఇది సమాధికి శీఘ్రమై విదితమైన
బాటయంచుఁ బతంజలి పల్కినాఁడు

ఆత్మనిక్షేప మనునది యదియె సుమ్మ

భక్తిచేత ధ్రువస్మృతి ప్రబలెనేని
కుండలియు లేచుఁ దనయంతఁ గుదురుగాను
నడచును సుషుమ్న యనునట్టినాడియందు

కలవు నూటొక్కనాడులు కలికి! హృదయ
మందు; నవి యేగియుండు దేహంబునందుఁ
బెక్కుముఖముల; వానిలో నొక్కటియయి
తగుసుషుమ్నయె బ్రహ్మరంధ్రంబుఁ జేరు
భక్తుఁ డగువాఁడు ప్రాణంబు వదలునపుడు
జీవుఁడు ప్రయాణమగువేళ దైవకృపను
నాడికాద్వారవితతు లంధమున మునుఁగు.

జ్యోతి యొక్కటి వెలుఁగుచునుండు నమ్మ
మధ్యనాడీముఖంబున మార్గ మెఱుక
పడఁగ జీవుఁడు పయనమై ప్రాణయుక్తిఁ
దరలి యాత్రోవ బ్రహ్మరంధ్రింబుఁ దూఱి
బయల నరుగును మఱిరాఁడు భవము లోఁద.
స్వప్రయత్నైకసాధ్యమై జరగు నిదియు
యోగులకు నెల్ల; మఱిభక్తియోగరతున
కప్రయత్నైకసాధ్యంబు హరిదయాప్తి.

భార మెల్లను హరిమీఁద వైచి యుంటఁ
జేయఁ దగినవి యాతఁడే చేయుచుండు
మనకుఁ గార్యంబు భక్తితో మనన మొండె.

భక్తజనులయోగాభ్యాసపద్ధతులను
సంగ్రహంబుగఁ జెప్పెదఁ జక్క వినుము.
ఎన్నియో మార్గముల స్వేచ్ఛ నేగుచిత్త
మొక్కచోటున నిలుపుట యోగమయ్యె

త్రికరణములను దేహికి దేనికైన
నెట్టిబాధ యొనర్పమియే యహింస

పరుల నన్యాయముగ బాధపఱుచునట్టి
వాక్య మాడమి సత్యాభిభాషణంబు.

తనది కానట్టిదానిని దా హరింప
నాత్మఁ దలఁపమి యస్తేయ మయ్యె నమ్మ.

సతులయెడ భోగ్యతాబుద్ధిసహితదృష్టి
సాగనీయమియే బ్రహ్మచర్య మయ్యె
శాస్త్రవినిషిద్ధవస్తుల సాధు లీయ
నైనఁ గొనకుంట యపరిగ్రహంబు సుమ్ము;
అమ్మ వీనినె యోగులు యమము లండ్రు

యోగికి నియామకము లయి యొప్పు నవియె
నియమములు నాఁగ విలసిల్లు నియతముగను.

త్రోవ విషయాళి దవ్వ సంతోషమయ్యె
తినమి దుర్భుక్తి, తనధర్మమునసె యునికి
సాధుసంసర్గ మొప్పును శౌచ మనఁగ

ఉపవసించుట లోనుఁగాఁ దపము లయ్యె

వేదవేదాంగవేదాంత విష్ణుకథలు
భాగవతరామచరితలు భారతంబు
చదువుటయును, వినుటయును, జపము, కీర్త
నాదికంబును బరఁగు స్వాధ్యాయ మనఁగ

ఈశ్వరప్రణిధానమా సీశునకును
సర్వ మర్పించి తద్ధ్యానసక్తుఁ డగుట.
అమ్మ యీయేను నియమంబు లండ్రు బుధులు.

ఆసనంబుల వివరింతు నవల వినుము
స్వామిసన్నిధియం దొండె, జనులులేక
యొంటిగా నుండు దేశమం దొండె నలికి

గోమయంబున శుచియైన భూమియందు
దారుపీఠంబుమీఁదను దర్భలునిచి
దానిపై జింకచర్మంబు, దానిమీఁద
నుత్తరీయంబునుం బర్చి, యుత్తరంబు
గానొ తూర్పుగనొండె నాసీనుఁ డగుచు
స్వస్తికము, పద్మమును, బద్ధపద్మ వీర
సిద్ధములునను వానిలోఁ జేతనైన
యాసనంబునఁ గూర్చుండి, యాత్మగురుని
భూరమేశుని ధ్యానించి, భూతశుద్ధి
సలిపి, కాయంబు శిరమును *సక్థి మెడయు
వక్షమును సమముగఁ జేసి, వీక్షణంబు
నాసికాగ్రంబునఁ నిల్పి నయనయుగళి
మోడ్చి, దంతంబు లొండొంటి ముట్టకుండ
నోష్ఠముల మూసి, యొండెఁ; దదూరుమధ్య
మందు మోఁచేతు లొఱయఁగ నవలివైపు
పాణు లొండొంటిఁ గలయఁగఁ బట్టి పిదప
నెడమమడిమను దక్షిణవృషణమునకుఁ
గ్రిందివైపుగ నొత్తి దక్షిణపుమడిమ
వామబీజంబునకుఁ గ్రిందఁ బదిలపఱచి
గుదము బిగియించి వెలివైపు ప్రిదులకుండ
నూర్ధ్వమున వికసింపఁగ నుండఁజేఁత
నాసనం బండ్రు యోగరహస్యవిదులు.

---

* సక్థి = నడుము

వినుతు వినుము ప్రాణాయామవిధము నింక
స్వతనుసంభూతవాయువు ప్రాణమయ్యె
దన్నిరోధ మాయామంబు; దానఁజేసి
వాయురోధంబు యోగప్రబంధములను
వ్యాహృతంబు ప్రాణాయామ మనెడిసంజ్ఞ.

నాసికారంధ్రములఁ బవనంబు లోనఁ
బీల్పఁ బూరక మయ్యెను; నిల్పదాని
దేహమునఁ గుంభకం బయ్యెఁ; దిరిగి దాని
ముక్కరంబుల వెలికిని బోవ విడువ
రేచకం బయ్యె; నిటుసేయు క్రియలయందుఁ
దర్జనియు మధ్యమయు ముక్కుఁ దాఁకరాదు.
కనులు మూసిన మేల్, రేచకంబు పూర
కంబు వేగంబుగాఁ జేయఁ గలుగుఁ గీడు.
ఎంత మెల్లగఁ జేసిన నంత మేలు
వాయుగమనాగమనములు చేయవలయుఁ
దనకె తెలియక యుండెడియనువు దోఁప.

బంధముల రెంటి సాధింపవలయుఁ జుమ్ము
భేదములు పెక్కు లున్న వీ విద్యయందుఁ
దెలిసి చేసిన మేలిచ్చుఁ దెలియకున్న
జాలఁ గీడును గలిగించుఁ జంపుఁ దుదను

విషయములవెంట విచ్చలవిడిగఁ బోవు
మానసంబు నాకర్షింపఁ బూనుకృతియె

యమ్మ! యొప్పుఁ బ్రత్యాహార మనఁగ జగతి.

ధారణ యనంగఁ దనయాత్మ దలఁగకుండ
నల్ల భగవంతుపై నిల్పుటగును జుమ్మి.

చరణమూలంబు మొదలు శీర్షంబుదాఁక
గంటిపాపనొ స్వహృదయకమల మందొ
మఱియు మార్తాండమండల మధ్యమందొ
దివ్యదేదీప్యమానసత్తేజమునను
వెలుఁగు శ్రీకాంతు నిరుపమ విభవయుక్తు
దివ్యమణిభూషణాయుధ దీప్యమాను
దివ్యవిగ్రహమునయందుఁ దెఱపిలేక
యితర చింతకు దేనికి నెడమునీకఁ
దేకరీతిని బ్రవహించుస్మృతివితాన
మునకు ధ్యానం బటంచును మొనయుఁ బేరు.

అట్టి ధ్యానంబె కడుదీర్ఘ మయ్యెనేని
ప్రథిత మైనసమాధిపేరను జెలంగు.

అదియె వాస్తవమైన సమాధిగాని
గారసున్నపు గోరీలు కావు కావు.
దేహమున నభిమానంబు దీరఁ బాలియ
వాసుదేవ పదార్థ మభ్యాసపడిన
నెందుమానసమేగు నందంద యుండుఁ
జుమి సమాధియు యోగికి శ్రమము లేక

యోగవిద్యను గూర్చి వేఱొండుకృతిని
జలుపఁ దలఁపుంటఁ జెప్పితి సంగ్రహముగ
నిందు సర్వ మిదే యని యెంచకమ్మ.

## జ్ఞానయోగము

జ్ఞానయోగంబు వినుతు నద్దాని వినుము.
విషయములపట్ల మనుజుండు విముఖుఁ డగుచు
నింద్రియంబులవ్యాపార మెల్ల నణఁచి
తనకు సర్వేశ్వరుండె యాధార మనుచుఁ
దాను సువిధేయుఁడై దాసతయె స్వలక్ష
ణముగఁ గలిగిన తనయాత్మఁ గ్రమము చెడక
సర్వకాలంబులందును సర్వదశల
స్వాత్మ వెలిఁగించుచుండెడి యంతరాత్మఁ
గలఁ గక స్మరింప జ్ఞానయోగం బయండ్రు

స్వాత్మసాక్షాత్కృతికి నిది సాధనంబు
యోగభక్తులతోడయి యుండవలయు

పాపములు పెక్కు చేసిన పామరుండు
ప్రకృతిగుణములకును వశపడినవాఁడు
విషయములయందు నాసక్తి విడనివాఁడు
ఇంద్రియంబుల గెలువనిమందమతియుఁ
బూర్వవాసనాబలమునఁ బూని కర్మ
పాళి నభిరతిఁ గలిగినబాలకుండు
కర్మయోగంబు సాధింపఁ గానకున్న

జ్ఞానయోగంబు సులువుగ సాధ్యపడదు.
పట్టి వేదాంతవాక్యముల్ వదరినంత
జ్ఞానయోగులు గారమ్మ సత్యముగను
అట్టులగుటను శుష్కవేదాంతు లెల్ల
భ్రష్టులంచుఁ దలంపుము భావమునను.

కర్మయోగంబు సాధించి కలికి! కొంద
అవల వ్యాపారములఁ నెల్లఁ దవులఁ ద్రోచి
జ్ఞాననిష్ఠ సంపాదించి శ్రమము నోర్చి
స్వాత్మ నవలోకనము సేయఁ జాలియుంద్రు

వినుము కొందఱు ప్రకృతివివిక్త మగుచుఁ
బూత భగవంతుని శరీర భూతమైన
యాత్మయాథాత్మ్యసుజ్ఞాన మలవరించి
తమకుఁ గర్తృత్వమును లేమిఁ దలఁచి తలఁచి
యదియె జ్ఞానసమాకృతి నందుకతన
దాన జ్ఞానంబె మిగులఁ బ్రధాన మగుట
జ్ఞాననిష్ఠ నుత్పాదింపఁ బూనుకొనక
స్వాత్మనవలోకనము చేయఁ జాలియుంద్రు
మొదటిమార్గంబునకు మిన్న యిదియె సుమ్ము.

సంతతధ్యాననిష్ఠుండు జ్ఞానయోగి
అట్టిధ్యానంబె ప్రేమతో నంటియున్న
భక్తియోగం బటందురు ప్రాజ్ఞజనులు.
ఉత్తమంబగుజ్ఞానంబు నుత్తమంపు

భక్తియొక్కటె, లేశంబు వాసిలేదు
పరమభక్తుండె జ్ఞానినాఁ బరిఢవిల్లు,

## —అజప—

సోహ మనుదాని స్మరియించుచొప్పు వినుము
దేహమున కాత్మ జీవుండు, దేహి కక్లై
యీశ్వరుం డగు; వానిలో నెలమినుంట;
లోన నీశ్వరుఁ గలిగిన నే నటంచు
నొండె నాలోననుండు నీశుం డటంచు
నొండె ధ్యానించుచుండుట యుక్తతమము

అహ మనుచు వాయి పలికినయంత నాత్మ
కెట్టు లర్థమొ, యట్టులే యీశ్వరునకు
నన్వయించును జీవుం డహ మ్మనంగ

వినుము కేవల మాత్మాభివీక్షణంబు
హేయ మంచును భక్తులు తృప్తిగనరు

ప్రత్యగాత్మ నహమ్మని పలుకరాదు
పదము వ్యుత్పత్తి శోధింప బాగుగాను
జనని! శుద్ధాత్మయును శుభాశ్రయము గాదు
కాన దానినె తలపోసి కష్టపడకు.

హరికి నామధేయంబు సు మ్మహ మనంగ
నదియు నెట్లన్న అ ఇ ఉ ఋ లనెడిచోటఁ
బ్రథమవర్ణంబు గన నకారంబకాదె

అంత్యవర్ణంబు హాల్లని యనెడివేళఁ
గడను గల్గిన యదియు హాకారమయ్యె
సరవిదీనిఁ బ్రత్యాహారసరణిఁ గనిన
* వర్ణసము దాయమెల్ల నహమ్మనంగఁ
దోఁచు; నదె శబ్దబ్రహ్మమై తోఁచెనమ్మ.

అట్లు పరమాత్మవాచక మైనదాని
నన్యునెడ నన్వయించుట యర్హమగునె?
అట్లుచేయుట యగును జౌర్యం బటంచుఁ
బలికెను సనత్సుజాతుండు పార్థివునకు

అమ్మ కొందఱు జపియింప సోహ మనుచు
సతుల గంటిని వారలచరితమునకు
నెంతయేనియు వగచితి నేల యనెదొ
మాతిముక్కను లే దొకరీతి లేదు
శబ్దమున కర్థమెఱుఁగరు స యెవండొ
యెవ్వరో యహ మనువార లిర్వురకును
గలుగుసంబంధ మెట్టిదో తెలియ రకట
అజప యందురి దేమని యడిగినంత
అజప యన జప మానొకో ? యిట్టిదానిఁ
జలుపుక్రమమే నెఱుంగరు; గలదు మేలు
సక్రమంబుగఁ జేసినఁ; బలికె నిట్లు
మాగురుం డని యందురు మఱియు నడుగ

* అర్ణసముదాయము = "అ" మొదలు "హ" వఱకుఁ గల యక్కరములగుమి.

బదులు నేనేమి చెప్పుదు, వగతుఁ గాక.
అహము సాధింపకయె రిక్త సోహ మనుట
శ్వాస సమముగ నడపెడి శక్తిలేక
సోహ మని యంట పారిహాస్యంబు గాదె;
కాశిలో నుండువానిని గాన వీవు
కడపలో నుండువానిని గాన వీవు
కాశిలోనుండు వాఁడును గడప నుండు
వాఁడు సమమని యొకఁడని వాఁగినంత
నేమి తెలిసితివో దాని నెఱుకపఱుపు
మొకని నైనను గని యనవొప్పుఁగాక.
ఇట్టు లున్నది లోక మే నేమటందు

ఇట్టివింతలు చూడంగ నేమొ నన్నుఁ
ద్రిప్పుచున్నాఁడు రాముండు దేశములను.

తత్త్వచింతను భిన్నపథంబు లున్న
నాచరణమునను మతత్రయంబువారు
సములు ద్వైతులు భక్తులు శంకవలదు.
ఆచరణ మెట్టి దని హరి చూచుకాని
వాదసామర్థ్యమునకు నామోదపడఁడు
ఆడనీ కలహంబుల నాడువారు
చక్కఁ గొల్తుము హరి ననుష్ఠానపరత.

ఎట్టి యోగంబునందుఁ దానేగుఁ గాక
ఈశ్వరుండని తా నని యిరువురుగను

గర్మమొనరింపకున్న మార్గంబు లేదు.
కర్మములఁ జేయనొల్లని ఖలుఁడు చెడును.

ధరణిమీఁద శరీరంబుఁ దాల్చుదాఁక
దైవతులే యెల్లవారు నావలనొ వారి
వారి భావంబుకొలఁదిని బయనముండు.
ఆడితిని గాదె మును † క్రతున్యాయవిధము.
అమ్మ నీమగఁ డుండుశయ్యాగృహంబు
కడప దనుకను నీతోడఁ గదలివత్తు.
నిన్ను లోపలి కనిచెద నీవు మగని
పైనపడి కౌఁగిలించెదో ప్రక్కఁబడెదొ
యెదుటఁ గూర్చుండి సేవింతొ, యెందునేని
యొక్క మూలను డాఁగుచు నొదిగి యుందొ
బండవలెఁ బడియుండెదో పలుకు లేక
నీదుదయితునియిష్టంబు నీయభీష్ట
మెటులొ యటుసేయుఁ డాచింత యేలనాకు.

కాన మతభేదవాదంబుఁ గడకుఁద్రోచి
చెప్పినటు భక్తిఁ గర్మముల్ చేయవమ్మ
మగనిప్రీతికిఁ బాత్రమై మనెద వీవు.
మగఁడె దైవంబు దైవంబె మగఁడు నీకు.

---

† క్రతున్యాయము = ఎట్టిఫలమునుగోరి కర్మమొనరించెదరో యట్టి ఫలమునే పొందుట.

## జ్ఞానసాధనములు.

మానమును, దంభమును, హింస మానుటయును,
క్షాంతి, యార్జవము, నసక్తి, శౌచవిధులు
స్థైర్యమును, గురుసేవయు, స్వాత్మనిగ్ర
హంబు, ననహంకృతియు, జరా, వ్యాధి, మరణ
జననముల దోషములయుఁజింతనము, విషయ
పాళి వైరాగ్యము, ననభిష్వంగ యుక్తి
విజనతలవాసమును, మఱివేఱు త్రోవఁ
జననిమనమున నాభక్తి సలుపుటయును
బ్రజలగుంపులయందు విరక్తుఁ డగుట
నియతి, నధ్యాత్మ సుజ్ఞాన నిత్యతయును
దత్త్వయుక్తిని జ్ఞానార్థదర్శనంబు
నిష్టము ననిష్టములయందు నెల్లవేళ
మనసు సమముగ నుంచుట మార్గములుగఁ
గృష్ణభగవానుఁడు వచించె గీతలందు.
జ్ఞానయోగంబునకు నివి సాధనములు
జ్ఞానులకు నేఁడు లే వెట్టిసాధనములు
జాను లైనారు తమనోటిశక్తిచేత.

ప్రకృతిగుణముల గెలువంగఁ వలఁతు వేని
గడుసుమనసును విలయింపఁ గాంక్ష యేని
తనదుమాయను దాఁటంగఁ దలఁతు వేని
భక్తి యొక్కండె తెరువని పలికె శౌరి.

## భక్తియోగము.

భక్తియోగంబు నీకమీఁద స్పష్టపఱుతు
మీఁదఁజెప్పినయట్టులు మొలఁతమిన్న!
యాత్మనవలోకనముచేసినంత గాని
భక్తియోగంబు స్థిరముగఁ బట్టుపడదు.

ఆత్మఁ గాంచుట పరభక్తి యండ్రు బుధులు
ఇంతవఱకును జేసెడిమెల్లకృతులు
గౌణభక్తి యటందురు కమ్రచరిత.

ఆత్మ నవలోకనము సేయునంతదాఁక
భక్తుఁ డనరాదు వాఁ డెంతవాఁడ వైన

స్వస్వరూపాను సంధాన చణత భక్తి
యనుచు శంకరు లనుట యీహైతుకమున.

భక్తిలక్షణమును మున్నె పలికినాఁడ
భక్తిప్రాశస్త్యమును మున్నెపలికినాఁడ
భక్తియభ్యాసవిధమును బలికినాఁడఁ
జలువనేటికిఁ జర్వితచర్వణంబు.
అయినఁ జెప్పెద నొకకొంత యాలకింపు.
భక్తి ప్రాణంబు తక్కినపద్ధతులకుఁ.
గర్మయోగంబు జ్ఞానయోగంబు రాజ
యోగ మనునవి యెల్లఁ దానొక్క భక్తి
లేకయుండిన వ్యర్థమౌఁ గాక ఫలము
నీయఁ జాలవు మఱి హాని చేయఁగలవు.

అవియు లేకున్న భక్తికి హాని లేదు.

ఱెక్క లూడినఁ జచ్చునే పక్కి యెపుడు?
శిరము లేనట్టి పక్షి సజీవ మగునె?
భక్తి యనియెడి పక్షిరాట్పురువునకును
జ్ఞాన, యోగంబు లగును బక్షద్వయంబు.
భక్తియోగంబు శిరమను బ్రథవహించు.
కర్మయోగంబు దనరారు కాళ్లుగాఁగ.

కర్మయోగాధికారంబు గానిపించు
విప్రరాడ్వైశ్యజనులందు విశ్రుతముగ
శంకరమతంబునం జను జనములకును
జ్ఞానయోగాధికారి సన్న్యాసి యొకఁడె
వాఁడు తచ్చిహ్నధారియై వఱలవలయు.
వాఁడు బ్రాహ్మణుడై యుండవలయునమ్మ
వాఁడె యధికారి సుమ్మపవర్గమునకు.
తక్కువారలగతి యేమొ దైవ మెఱుఁగు.

ఇట్టి రెండు తెఱంగుల నేగితేని
యేమిగతి నీకుఁ జెప్పవే యెఱుకపడఁగ.
ఆఁడు దానవు గాన ననర్హ వీవు
శ్రౌతకర్మంబులం జేయ; శక్తి లేదు
నీదు భర్తకుఁ; దెరువేదొ నీవె చెప్పుమ.

కర్మయోగంబు జనకేంద్రుకరణిఁ జలుప
కాదు సాధ్యంబు తల్లి యిక్కాలమునను

సలుపకుండిన నాగీతి ఫలము లేదు.

జ్ఞానయోగంబు సలుప సన్న్యాసి వగుమ
యంచుఁ బీడింపఁ బోవుగా యాత్మవిభుని.
సన్న్యసించినమాత్ర మోక్షంబు గలదె?
దాని నియమంబు లన్నియుఁ బూని సలుప
కున్న రవయంత భంగంబు నొందవెనేని
రౌరవాదులఁ గూలును భ్రష్టుఁ డగుచు.
విప్రకులులము మన కిట్టివెతలు గలుగఁ

దక్కుజాతులవారలదశ యదేమొ.
అందఱును వారు నరకాన కరుగవలెనె?

శ్రద్ధతోడ స్వధర్మంబు సలుపుటయును
సిద్ధిహేతు వటన్నప్రసిద్ధసూక్తి
శూద్రులైనను వైశ్యులే సుదతులైన
ఘోరపాపాత్ములును ననుఁ గొలిచిరేని
కలయుదురు నన్నటన్నది కల్లయేమొ?
కాన నారెండుత్రోవలు మానవమ్మ.

సత్యయుగమున వారికి జ్ఞానపథము
కర్మయోగంబు త్రేతాయుగంబునందు;
వారలకు నెట్టిఫల మబ్బు వానిచేతఁ
గలిని హరికీర్తనంబునఁ గలుగు నదియ
అనుచు వచియించె నమ్మ పరాశరుండు.
భక్తి కధికారి యేజాతివాఁడు నైన.

బాలుఁడైనను స్త్రీయైనఁ, బాపియైనఁ
బరమచండాలుఁడైనను బతితుఁడైన
అన్యసాహ్యంబు లేకయే యబ్బుముక్తి
భక్తియోగంబు సాధించు పరమమతికి

దైవసాహ్యంబు గలుగ వేఱేవి యేల ?
భక్తియోగంబు సుఖ మనపాయ మబల !
తరుణి ప్రియభర్త దనకుఁ గైదండయొసఁగ
బ్రమదవనమున విహరించుపగిది నగును.

తక్కుత్రోవ లెడారిలోఁ జిక్కి యొంటి
సంతపించెడిగతి యౌను, జారుశీల!

భక్తియోగంబె కడువేగ ఫల మొసంగు
నొకటిరెండుభవంబుల నొదవు ముక్తి
అన్నివేళల ఫలమిచ్చు నమరతరువు.

వేలకొలఁదులజన్మముల్ వెచ్చపడఁగఁ
దపములను, యోగమునను, † నిధ్యానమందుఁ
బిదప హరిభక్తి మొలకెత్తె మొదలుపెట్టు.

ఎట్టియోగంబు సాధించితేని నీవు
ఫల మొసంగెడుఁగద భగవంతుఁ డొకఁడె.
ఏమి గని యిచ్చు నీకది యెఱుఁగఁజెపుమ
నీదువిత్తంబు గని యిచ్చునే విభుండు?

† నిధ్యానము = విశేషధ్యానము.

శ్రీవిభుం డాతఁడొకటియుఁ జింతసేయు.

నీదుజ్ఞానంబుఁ గనిమెచ్చునే విభుండు?
జ్ఞానరూపుఁడు సర్వజ్ఞచక్రవర్తి.
నీదుకులమును గని పొంగునే విభుండు?
కాయకష్టంబుపడితని కరుణ గనునె?
కాదు కాదమ్మ యేదియుఁ గాదు గాదు
సాధనంబుగఁ గొని కర్మజాల మెల్ల
నేదియో యొక్కనెపమున నెల్లవేళ
మనసు తనమీఁద నిలుపుటమాత్ర మెచ్చు.

అట్లు తొటను నేమార్గ మైన నేమి
నిత్య మాత్మను హరిమీఁద నిలుపుటకును?
అట్టిమార్గంబులందు శ్రేయస్కరంబు
భక్తి యని నిగమంబులు పలుకుచుండు

మాను లెల్లరు నడచి రామార్గమందె
సురలు తన్మార్గమందునే యరిగినారు
భాగవతు లెల్ల నాబాట పట్టిచనిరి
మతప్రవర్తకు లరిగిన గతియు నదియె.

అమ్మ యొక్కటి నిలుపుమీ యాత్మయందుఁ
బ్రేమపడియెడివారిపైఁ బ్రేమపడెదొ
కొలువునందుండుటను బనుల్ సలుపవలయు
ననుచు సలిపెడి వానిపై ననుపుపడెదొ?

నేను నీవును నొక్కటే నీవు నేను
గలయుదమ యనువానిపైఁ గాంక్షపడెదొ?

నీ పయిని బ్రేమ లేనట్టి నిష్ఠురాత్ముఁ
డెంతబలవంతుఁడైనఁ దానెంత కష్ట
పడుచుఁ బనులను జేసినఁ బ్రతిభయెంత
గలుగువాఁడైనఁ బ్రేమింతె? కలది చెపుము.

ప్రేమ ప్రేమింపఁజేయుట వింతగాదు.
నీకు నాకెంత దూరమో నాకు నీకు
నంతయే కద దూరంబు నరసిచూడ.

కర్మములు గావు జ్ఞానంబు గాదు తల్లి
స్వామిప్రేమకుఁ బాత్రుని సలుపునదియు.

ఎంతప్రేమను నీవెద సంతరింతొ
యట్టిప్రేమయె ఫలమిచ్చు నది నిజంబు.

కాన భక్తివిహీన మహాకర్మసమితి
జ్ఞానమును యోగమును రిత్తశ్రమము కొఱకెః
అనుచు భాగవతంబున వ్యాసు లనియె.

స్నేహపూర్వక మగుహరిచింత భక్తి.
అనుటనో మఱి వినుటనో కనుటనొండె
చనుటనో తలపోఁతనో సలుపుటొండె
భక్తియే యగు నెదిసేయ రక్తి తోడ.
భక్తికిని బ్రేమ ముఖ్యమా ప్రాణ మగును

మనసుచేతనో తనువుచేతనో సతంబు
కార్యములు సేయుటొప్పారుఁ గాయ మగుచు.
ప్రేమ లేకున్న భక్తినాఁ బిలువఁజనదు.
బలిమి, వెట్టియుఁ, గూలియు, భక్తి గాదు.

అట్టిప్రేమంబు హరిమీఁద ననవరతము
తగిలి యుండఁగవలెఁ దైలధారరీతి
ఛిన్న మనునది యేమాత్ర మెన్నరాక
గడియ లఱువది తిరము నేకంబుగాఁగ
నిమిషమేనియుఁ దచ్చింత నిలుపరాదు
సన్నగనో గొప్పగనో యది సాఁగవలయు.
పరమభక్తియ యగు నిది ప్రబలమైన
గడియ యొక్కటి వ్యర్థమై కడచెనేని
జ్వలనమునఁ బడినట్టిదా శలభ మనఁగ
సంతపించును విలపించు జలదరించుఁ
బరమభక్తి లభించిన భాగ్యశాలి.

తన్మయత్వంబు లభియించుఁ దల్లిదీన.
తన్మయత్వంబు గలదిప్డు తనువుతోడ
నదియె భగవంతుతోడుత నమరవలయు.
పొనరకుండిన నీదశ ముక్తిలేదు.

జ్ఞానయోగంబు భక్తికి సాధనంబు
జ్ఞాననిష్ఠను నాత్మవీక్షణము కలుగ
నదియె పరభక్తి యండ్రు రహస్యవిదులు

అప్పుడప్పుడు నయ్యాది యనుభవింప
నది పరజ్ఞాన మగునందు రార్యవరులు
అదియె నిలుకడ నొందిన హాని లేక
పరమభక్తియ యగునని భక్తమతము.

అదియె మోక్ష మొసంగ సమర్థ మగును.

శ్రద్ధ మూలంబు భక్తిని సర్వమునకుఁ.
గలుగ నయ్యాది కలుగు నాకర్షణంబు.
అదియ పూజాదులకు హేతువై తనర్చుఁ
జెలుచు నయ్యాది విషయాళి చింత లెల్ల
మనసు నేకాగ్రమౌ నవి మాసిపోవ.
అవల సంతుష్టి యుదయించు నాత్మయందు
అదియ యాసక్తి నభివృద్ధి నందఁజేయు
నదిరసోద్రేకమున కగు హైతుకంబు
అవలఁ దోఁచును భక్తి సమగ్రముగను
కాన శ్రద్ధను స్థిరపడఁగా ఘటింపు.

వారివీరివిలాపముల్ వలదు వినఁగ.
భక్తిలక్షణ మెఱుఁగని పామరులును
నేవియో వాఁగుచుండెద రెఱుక లేక.
పెడచెవిని జెక్కి వారలనుడుల నెల్ల.

సాధ్విప్రియభర్త, శిశువును జనని, మిత్ర
మిత్రుఁడును, శిష్యుఁడాచార్యు, మేలిప్రేమ
నెట్టు లాలింతు రట్టులే యింది రేశుఁ

గొలువ వలయును భక్తుండు గొదువ లేక.

స్వామిని; సుహృత్తు, గురువర్యు, జననిఁ, దండ్రిఁ
బుత్రు నట్టు లుపచరింతు పూర్ణ భక్తి
నట్లె సేవింపవలయును హరిని భక్తి.

నీవు బిడ్డవు శ్రీహరి నీదుతండ్రి
రక్ష్యవీవాడు శ్రీహరి రక్షకుండు
భార్య వీవాడు శ్రీహరి భర్త నీకు
నీవు జ్ఞాతవి జ్ఞేయుండు శ్రీవిభుండు
స్వమ్ము నీవును శ్రీహరి స్వామి యగును
తల్లి యాధేయ మీవు నాధార మతఁడు
నీవు దేహంబు శ్రీహరి దేహి సుమ్ము
భోగ్య వీవైన శ్రీహరి భోక్త యయ్యె
అంశ మవు నీవు శ్రీహరి యంశి యయ్యె
ఇట్లు తలపోయు జీవున కీశ్వరునకుఁ
గలుగు నవవిధసంబంధములను మదిని.

జడియుచున్నాఁడ గ్రంథవిస్తరముఁ దలఁచి
నీవె తలపోయు మివి మది నిర్మలముగ.

బహుళజన్మంబులందుఁ దపస్సు జ్ఞాన
యోగము సమాధి వీనిచే నున్నపాప
చయము లన్నిటిధ్వంసంబు సలిపినట్టి
పుణ్యునకుఁ గాని హరిభక్తి పుట్టదమ్మ.

పుట్టెనేనియు వ్యర్థమై పోవదెపుడు
అంతకంతకు నభివృద్ధి నందుచుండు.
మొట్టమొదటనె హరిభక్తి పుట్టకున్నఁ
జింత వలవదు ; హరిసేవ చేయుకొలఁది
ప్రేమ తనయంతఁ దా నుద్భవించుఁ జుమ్ము.
ప్రేమ యుదయింపఁజేయును శ్రీవిభుండు
మనసు నిర్మలమైనను మమతఁ బూని
నిమిషమైనను దడియఁడు నిక్కువంబు.

కానఁ దొలుతనె ప్రేమంబు కలుగ లేదె
యనుచుఁ బరితాపపడకుమీ యాత్మయందు.
ప్రేమ యుదయింపకున్నను భీతిలేదు
వ్యర్థముగఁ బోవు స్వామికార్యంబు లెపుడు
పుట్టు మొలకెత్తుఁ బెఱుఁగును జెట్టెయగును
పూచు కాచును ఫలియించుఁ బుష్కలముగ
ఎన్నికల్పంబులకునైన నెండిపోదు.

తక్కినవి యెల్లవీడంగఁ దగునుగాని
భక్తిమాత్రంబు విడరాదు ప్రాజ్ఞతముఁడు
ఎంతకష్టంబు పైపడి వంత గూర్ప.

అన్నిటిని గట్టుకొని యేడ్చుకన్న నొక్క
భక్తి సాధించితేనియు ముక్తి గలదు.

సాంగముగ నదిసాధింపు శక్తి యున్న
భక్తిలక్షణములఁ గొన్ని పలుకువాఁడ

మానితపుగౌరవంబు సమ్మాన మయ్యె
నర్జునుం డిదిసాధించె నమ్మ వింటె
కృష్ణుఁ డరుదేర లేచును నెదురు పోవు.

అట్టివర్ణంబు నామంబు నట్టిపోల్కి
గానరాఁ గొల్చుటయు బహుమానమయ్యె.
కమలములఁ జూడ, మేఘంబు కాంతి గనిన
గౌరవించుచునుండె నిక్ష్వాకువిభుఁడు
జలజలోచను జలధర శ్యాముఁ దలఁచి.

ప్రీతి యిది కానిపించెను విదురునందు
విరహ మదిలోఁచు గోపికా తరుణులందు

మహిమ విఖ్యాతి యమునందు మహితమయ్యె
ఎల్లరకు నేను ప్రభువనే శ్రీశపాద
భక్తులగు వారలకుఁ దప్ప. వారిడాయ
పోవకుఁడు మీరలంచును బుద్ధిచెప్పె
పాశచయహస్తులౌ తనభటుల కార్కి.

తెల్లదీవిని జనములఁ దెల్ల మయ్యె
నితర విచికిత్స నారదుం డేగుదేర
విష్ణుపూజకుఁ దలఁచిరి విఘ్నమనుచు.

ప్రాణములఁ దాల్చుటయును దదర్థముగను
భక్తిరూపంబ పవమానుపట్టియట్లు.

ఉపరిచరవసు వెవ్వేళ నుర్విధనము
భార్యఁ దన్నును వాహనవర్గములను
సర్వమును భగవంతుని స్వమ్మటంచు
స్వాంతమున నెంచెను దదీయభావ మమర.

హరిమయము సర్వ మనుచుఁ బ్రహ్లాదుఁ డెంచె
సర్వభూతమయుండని శార్ఙ్గధరుఁడు
సర్వభూతాళి కవ్యభిచారభక్తిఁ
బ్రముఖ్యుఁడీ జ్ఞాను లనుచును బోధపఱిచె.

తన్నుఁ జంపఁగ రా యశోదాసుతుండు
ప్రార్థనము చేసెఁ జంపఁగ రమ్మటంచు
నాపగానందనుండు భీష్మాహవమున
ప్రాతికూల్యంబు సలిపెడిభ్రమము లేక.

వీనిలోఁ జల్పవచ్చును దేని నేని
ఒదవఁజేయును సిద్ధి యేయొక్కటైన.

ఈవు చేసెడికార్యంబు లెల్లఁజేసి
ఫలము రామార్పణమ్మని పలుకవమ్మ.
అవల దేవాలయమునూడ్చి యలికి చక్క
రంగవల్లులఁ దీర్చి హారములు గట్టి
దీపముల్ వెలిఁగించి సుదీప్తి గలుగ
నీకుఁ జేనైన కార్యముల్ చేయవమ్మ
చచ్చు నభిమానమును లజ్జ, హెచ్చుభక్తి.

పూజనము చేయ నగు నిరుపూంటయందు

కమలనాభాలయము లేని గ్రామమందు
విష్ణుపూజావిరహిత మాపీటియందు
వలదు భుజియింపఁ బక్వ మపక్వమైన
నొక్కదినమైన వసియింప నొప్పదందు.

ఇట్లు ప్రత్యక్షదేవతాకృతులు సేయ
మానసం బెప్డు మాధవు మరగియుండు.

ఇట్టికార్యంబు చేయని యట్టివేళఁ
జరణములు కేలు పనులను జలుపుచున్న
దేవదేవుని కృతులఁ గీర్తింపవమ్మ.
హరిని స్మరియింపు భజియింపు హరికథలను.
వినుము చెప్పుము పరులకు వినుఁగు లేక,
జపముచేతనె మోక్షంబు సాధ్యపడును
జేసినను దక్కువానిని జేయకున్న.

కామముననైనఁ గ్రోధంబుగరిమ నైన
భయముచే నైన ద్వేషంబుబలిమి నైన
బిడ్డలకు హరినామంబుఁ బెట్టి యైనఁ
గేళినైనను నూరక గేలినైనఁ
బాటలను నాటలను గద్యపద్యములను
వేయునేటికి నెట్టియుపాయ మేని
పుట్టఁగా జేసి హరిమీఁదఁ బెట్టు మదిని

సంస్మరింపుము నిరతంబు శౌరిపేరు
గర్భనరకంబు మఱినీకుఁ గలుగఁబోదు.

బలిమి మనసది కొన్నాళ్లు వశముపడక
దొంగవలె జాఱుచుండు నభంగరీతి
వెంటనే లాగి కొనిరమ్ము విడకదాని
నిట్టు లభ్యాస మొనరింప నెట్టకేని
నన్ని వేళల విడువక యంటియుండు.
అదియె సుఖమైనపథ మమ్మ యందఱకును
ఇందు శంకింపఁ బనిలేదు హితచరిత్ర.

వలదు శ్రమియింపఁ దల్లి! యవ్యక్తమునకు
హెచ్చుసుఖ మైన ఫల మైన నేదిలేదు
మిగుల గాసి యొకండ చూమిగులు నీకు
గోటఁ బోయెడిపనికిని గొడ్డ లేల?

ఎట్టియోగంబునేఁ దలపెట్టితేని
ధ్యానవేళల జాతిపై దారువుపయి
వలదు కూర్చుండఁ, గుశలు పైవైచి మృగము
చర్మమును దానిమీఁద వస్త్రంబుఁబఱచి
దానిమీఁద సుఖాసనాసీన వగుము.
పీఁటమీఁద నివెల్లను వేయవచ్చు
మిగులఁ బల్లంపునేలయు మేలుగాదు
మిగుల నున్నతపీఠంబు దగవుగాదు
కాయ మించుకయైనను గదలనీకు

గుడ్డ రానీకు మంగాలి కడ్డముగను
ఆసనంబుననున్నట్టి యవసరమున.
ముక్కుకొనమీఁద దృష్టిని జక్కనిలిపి
ప్రథమమందుఁ బ్రాణాయామపరతనుండి
దిశలు చూడక ధ్యానింపు దేవదేవు.
కన్నుదోయిని మూయుట తప్పుగాదు.
దీని నమవసచూపని తెలుపు శ్రుతులు.
పూర్ణిమాదృష్టియగుఁ గనుల్ పూర్తి విచ్చ
అమ్మ ప్రతిపత్తుదృష్టియౌ నఱ ముగుడ్ప

పాణితలమును నూరులపై నమర్చి
జ్ఞానముద్రను ధరియింపు చతురమతిని

అంగుటము తర్జనియుఁ గొనల్ సంగతముగఁ
బూలుకొనెడి విధమునఁ బూని తేని
జ్ఞానముద్రయుఁ జిన్ముద్ర నాఁగఁ బరఁగు

గాలి వీచెడిచో, గుల్కజాలమీఁదఁ
బురుగులుండెడిచోట్టులఁ బుట్టమీఁద
జనులు తిరిగెడిచోట్టుల, ధ్వనులు వినఁగ
వచ్చుచో, నగ్నిజలసమీపంబునందు
ధ్యాన మొనరింపరాదు కీడైన నగును.

పండి, నిలుచుండి ధ్యానంబు వలదు సేయఁ
జక్కనాసీన వగుచు నే సలుపవమ్మ

తనువుఁ గప్పుట మేలు వస్త్రమునఁ దొలుత
నారఁ దీరిన యోగికి వ్యర్థ మదియు
వెండ్రుకలు చాలఁ దలనిండ నుండెనేని
వానిచే మేను కప్పంగవచ్చుఁ గాని
కొనలు నేలను దగులఁగఁ జనదు తల్లి.

యోగి కెంతయు నివి యుపయోగపడును
ప్రాణశక్తిని రక్షించు పనులయందు
అధమ మగు నందు కార్పాస మన్నిటికిని
ఆవికంబులు క్షౌమవల్కాజినములు
సుప్రశస్తముల్ ధరియింప సుగుణభూష

వస్త్ర మేదియు లేని యవాసనుండు
యోగపట్టంబు దాల్చుట యొప్పుఁ జుమ్ము
అదియు లేకున్న లేకున్నె హస్తయుగము.
నిక్క మగు యోగి తనదేహ మొక్కటియును
దప్ప మఱి యేది యొల్లఁడు దాఁకనైన
వానికిని దేనితోడను బనియు లేదు
అతని కెవ్వారితోడఁ గార్యంబు లేదు.

ఇట్టిశక్తి లభింపక యెవ్వఁడేని
యోగి కాఁడెన్ని వేషంబు లున్నఁగాని
మోసపోవకు తల్లిరో మోసపోకు.

---

* అవాసనుండు — వస్త్రహీనుఁడు.

కర్మయోగంబు జ్ఞానయోగంబువలన
వేగ మంతఃకరణమును విమలపఱచి
యమము లాదిగ నెనిమిదౌ నంగములను

గలుగు యోగంబు తనశక్తికొలఁది సలిపి
వర్ణధర్మముల్ సలుపఁగ వదల కెపుడు
తైలధార విధంబునఁ దలఁపు నిలిపి

ఆప్రయాణంబు నిటుసేసి యహరహంబు
ననుభవించుచుఁ బ్రారబ్ధ, మదియుఁదక్క
సంచితాగామిపాపముల్ సమయఁజేసి

ప్రాణముల్ పోవువేళ నారాయణునిని
సంస్మరించిన మాత్రాన సమయు భవము.
ఇట్టిస్మరణంబు భగవంతుఁడే యొసంగు

బ్రతికియుండినదశ మహాభక్తి యున్న
మరణదశఁ గొయ్యవలెఁ ఱాతి సరణినున్న.
పైన చెప్పినభక్తి యుపాయభక్తి

అదిలభించెడిక్రమము నే నందుమరల
సంగ్రహంబుగ నీమదిఁ జక్కనాట,
తొలుత నిర్వేద మొదవంగ వలయునమ్మ

అవల సజ్జనసంగతి దవుల వలయు.
అదియ కలిగించు భగవంతు నందు శ్రద్ధ
శాస్త్రమార్గానఁ దెలియ వాంఛయు జనించు
దాన జనియించుఁ దత్త్వవిజ్ఞాన మవల

నట్టిజ్ఞానంబుచేఁ గ్రియ లాచరించు
వానిచేత జనించు నుపాయభక్తి.
అపల భగవంతుఁ జూడఁగ నాస పొడము
అవల భగవంతుదర్శనం బబ్బు నిమిష,
మావలవియోగరహిత మానానుభవంబె

లక్షణంబుగఁ గలుగువిలక్షణంపుఁ
బరమభక్తి జనించును, బ్రాప్తియందు
నభినివేశంబు జనియించు, నవలఁబ్రాప్తి
సంభవించును భగవత్ప్రిపాదమునను.

ఏట్టియోగంబు సాధించి యేమిఫలము
పరమభక్తి జనింపని పామరునకు?

ఎవ్వఁ డేయోగమున నిల్చి యెంతయేని
కల్పకోటుల నెన్నని గాసిపడిన
ఫలము లేదమ్మ హరికృప కలుగుదనుక

ఫలము నిచ్చెడు నాతఁ డాప్రభువకాఁడె
యోగముల కట్టిఫలమీయ నున్నశక్తి?
మార్గములె గాక యటువంటిమహిమకలదె?

తన్నుఁ బ్రేమించువానిపైఁ దాను బ్రేమ
చూపునేకాని యొరులకుఁ జూపఁగలఁడె?
తన్ను డాసినవారిశైత్యంబుఁ బాపు
నగ్నిహోత్రుండు పెరవారి కట్టులగునె?
ఛత్రము ధరించితిరిగెడిజనులమీఁద

భాస్కరకరంబు లవియెట్లు పడునొ చెపుమ.
తలుపులు గవాక్షములుమూసి తనగృహమున
లోన నివసించుచుండుఁ డొ వానిమీఁద
మంచిగాలియు వెలుతురు మలయఁ గలవె?
అటులె హరికిఁ బరాఙ్ముఖు లైనవార
లెట్లు హరికృప కర్హులౌ యెఱుఁగఁజెపుమ

భక్తిలేమిని సంసారబంధ మొదవె
భక్తి లభియింప సంసారబంధ మెడలు.

వెలుఁగులేకున్నఁ జీఁకటి విస్తరిల్లు
వెలుఁగుదోఁచినఁ జీఁకటి విరిసిపోవు.

కాన భక్తిని గొలుము శ్రీకాంతు నెపుడు.
భక్తి నీమది నుదయింప వాంఛ యున్న
సాధనంబులఁ గొన్నిటి సలుప వలయు
వీనిచే సత్త్వగుణ మభివృద్ధి యగును.
I మనసు తనచంచలత్వంబు మాను మఱియు
ధ్యానమును స్థైర్య మొందును దల్లి కాన!
నీకు వలయు సదాహారనియతి మొదలఁ.
దెలియఁ జెప్పితి హేతువు దీనిఁగూర్చి
దీనివలననె సత్త్వంబు స్థిరము పడును
మనసు చాంచల్యమును మాను, స్మరణమునకు
స్థైర్య మొదవును, గ్రంథులు జాఱిపోవుఁ
జదువవమ్మ రుక్మాంగద చరిత మీవు

దానియందు వచించితి దానివిధులు.

II విషయరాగంబు మునుముట్ట వీడవలయు
నిదియు రెండవయది యని యెఱుఁగవమ్మ
విషయములయందు రాగంబు వీడితేని
శాంతి యొదవును జిత్తచంచలత మాను.

III అమ్మ మూఁడవయదియు నభ్యాస మగును
ధ్యానవేళలమాత్రము దలఁచి హరిని
యవల మఱచుట గాదమ్మ యభ్యసనము.
ఒక్కత్రుటియేనియు విరామ మొదవనేని
మనసు పోనిమ్ము కైటభమథనుమీఁద.
చేయఁ దగుకృత్యముల నెల్లఁ జేయవలయు
మానఁగా రాదు గాని యోమాననీయ
వానినెల్లను హరిసేవ గాను దలఁచి
ఫలము రామార్పణం బని పలుకవమ్మ
వాక్కు భావంబు రెంటిచేఁ బలుకవలయు.

VI అవల సత్యంబు బ్రహ్మచర్యంబు దయయు
నార్జవంబు తపంబు నుదారతయును
మొదలుగాఁ గలసద్గుణపుంజములను
విడక సేవింపవలయును గడఁకనీవు

V అవలఁ బ్రతికూలదేశకాలాది జనిత
దుఃఖసంస్మరణాదులఁ దొలఁగఁ ద్రోచి
దైన్యమును మాని, చేకొని ధైర్యగుణము

మనసునం దెప్పుడేని ప్రమాదపడక
యాశ్రమంబున కర్హచిహ్నాలు ధరించి
త్రికరణంబుల నొక్కటై తిరుగవలయు,

IV సద్గుణంబులు నాయందు స్థైర్యపడివె
దుర్గుణసమూహ మెల్లను దొలఁగిచనియె
ననుచు మిక్కిలిహర్షంబు చనదు పడఁగ.

నియమయమముల వలయును నియతిసలుప.
ఇట్టిసద్గుణసంపత్తి గట్టిపడిన
భక్తి యుదయించు నేగాసి పడఁగ నేల ?

సంతతధ్యానకర్మ మసాధ్యమేని
యనుచు నుండుము తల్లి ద్వయంబు నోర

నుచ్చరింపుము శౌరి నామోత్కరములు
వానియర్థంబుఁ దలఁచుచు స్వాంతమందు.

రామ గోవింద కృష్ణ నారాయణా ము
కుంద విష్ణు హృషీకేశ గోపతీ త్రి
విక్రమా వాసుదేవ శ్రీవిభు రమేశ
భక్తవత్సల హరి భగవంత శాంత
పీనికర్థంబు మదినిల్పి పిలిచితేని
యేల పరువెత్తి రాకుండు నిందిరేశుఁ
డాత్మ తాదాత్మ్యశుద్ధమై యమరెనేని.
పరువునను రాఁడె గజరాజుభక్తిఁ బిలువ.

అట్టి విష్ణునినామంబు లందుఁ గలుగు
మహిమ రుచియును దెలియంగ మనకు వశమె ?

మోక్షమును గూడనొల్లక మునివరేణ్యు
లైన నారద సనకాదు లధికభక్తి
సంస్మరించుచునున్నారు చక్రపాణి
దివ్యతరములఁ దన్నామధేయములను.

భక్తివిరోధులు.

భక్తికి విరోధు లొకకొన్ని ప్రబలి యుండు
వానినెల్లను దెలియంగ వలయు నీవు
దుష్టజనసహవాసంబు ద్రోలఁగవలయు
బీజ మియ్యది దుర్గుణవితతులకును
సర్వనాశంబుఁ గావింపఁ జాలు నిదియె.
కానఁ గొంచెంబ యేనియుఁ గాదు సలుప
కాముకీకాముకజనసాంగత్య మెపుడు.

కామరోషాదులకు సందు గాదొసంగ
వెలసె నేనియు హరిమీఁద విడుము వానిఁ
జైద్యకంసులు గోపికల్ సలిపినట్లు.

సాధువులతోడఁ జర్చింపఁ జనునుగాని
తత్త్వజిజ్ఞాసచేతను దనయ ! వింతె
వాదు లాడకుమీ భగవంతుఁ గూర్చి
యాయనగుణాళిఁ గూర్చియు నల్పుతోడ.

అనుభవైకసువేద్యమై యమరుదానిఁ
గూర్చి వాదాడ ఫలమేమి గూడునమ్మ.
తిన్నఁ దెలియును గలకండ తీపటంచు
వాదములచేత నది యెట్లు వచ్చుఁ దెలియ ?

మమతయు నహంత వలయును మానఁ దల్లి.
జనులసమ్మర్దమును లేనిస్థలమునందు
నుంట యెంతయు బాసటై యొప్పుచుండుఁ
దనగృహంబుననే నిటు చనును సలుప.

లోకవార్తకుఁ జెవిసీయఁ బోకు మెపుడు
ఎవ్వఁడేరాజ్యమేలిన నేమి నీకు
ఎవ్వరెటు పోవనది యేని నెట్టులైన
సంభవించునె లాభనష్టములు నీకు.

యోగమును క్షేమమును గూర్చి యుదిలపడకు
పూర్వభవమునఁ జేసినపుణ్యపాప
ములకుఁ దగినట్లు మనకిప్డు ఫలము నీయ
గాను భగవంతుఁడెంతయుఁ బూనినాఁడు
మనకు నేటికి శ్రమపడ ననుచుఁ దలఁపు.
చెప్పెఁడే యిట్లు పార్థుతో శ్రీధరుండు.

ఇచ్చినంతయె వచ్చును హెచ్చు రాదు
ఎంత శ్రమయించితేనియు నేల వెతలు.
శ్రమముపడినను బడకున్నఁ బ్రాప్యఫలము
ప్రాప్తమగుఁ గాని తప్పదు భవ్యశీల!

కాన భక్తిని సాధింపఁ గష్టపడుము.

కామ్యకర్మంబులను జేయఁ గాదు నీకు.

నిత్యకర్మంబులను వీడ నీతి గాదు
సలుపవలయును వీనిని శక్తికొలఁది
విహితకృత్యఫలంబుల విడిచి హరికి.

శబరితోడుత శ్రీరామచంద్రవిభుఁడు
భక్తినిగుఱించి సూక్తులు పలికెఁ గొన్ని
వీని వివరింతు వినవమ్మ విశదముగను
స్త్రీలఁ బురుషుల లేదు విశేష మెద్ది
నన్ను భజియించుటందు నోసన్నుతాత్మ.
ఆశ్రమము జాతి నామధేయంబు ననెడి
భేదములు కారణంబులై పేర్మి గనవు.
గాఢభక్తియు నొక్కండె కారణంబు.

ఇపుడు నన్నీవు చూచిన యీవిధమున
యజ్ఞదానతపస్సులు నధ్యయనము
సలుపువారలు చూడఁగఁ జాల రమ్మ.
భక్తిహీనాత్ము లగుచును బరఁగిరేని,

శ్రమణి ! యట్లాట భక్తికి సాధనముల
వినుము చెప్పెద సర్వంబు విశదపడఁగ.

సాధుసంగతియే తొలి సాధనంబు.
అస్మదీయ కథోక్తి రెండవది సుమ్ము ?.

మూఁడవది నాదుగుణములఁ బాడుచుంట
అలచతుర్థంబు మద్వచోవ్యాఖ్య యగును
నిరతమును దనయాచార్యు నే నటంచు
వంచనము లేక కొలుచుట పంచమంబు
యమము నియమంబు పుణ్యశీలమును నాదు
నిత్యపూజా క్రియావాళి నిష్ఠ గొనుట
సాధనం బాఱవదియయి సాగుచుండు
సప్తమము నాదు మంత్రంబు జపము సేఁత
నాదుభక్తులసేవయు నాదరమున
సర్వభూతాళి నే నను శ్రద్ధ, బాహ్య
విషయముల యందు రాగంబు విడిచియుంట
అష్టమం బగుసాధనం బమలచరిత.
నాదుతత్త్వవిచారంబు నవమ మయ్యె.
ఇట్టినవవిధభక్తిని నింతి యైని
పురుషుఁడైనియుఁ బశువైని పూతచరిత

సాధనము చేసెనేనియు సంభవించుఁ
బ్రేమ లక్షణమైనయరీణభక్తి.
భక్తి యుదయించినంతనే ప్రభవమందు
నాదుతత్త్వాను భావంబు నయచరిత్ర,
అనుభవంబున మత్తత్త్వ మమరెనేని
ఆశరీరాంతమందె లభ్యంబు ముక్తి.
కాన ముక్తికి భక్తియే కారణంబు.

ప్రథమసాధన మబ్బినఁ గ్రమముగాను
సర్వ మబ్బును గావునఁ జతురమతులు
భక్తియే ముక్తి యనుచుండ్రు భవ్యశీల!

ఇట్లు వచియించె నమ్మ సీతేశ్వరుండు.

జ్ఞాన మనునది కడదాఁక సాఁగిరాదు
ముక్తికన్యకవాకిటిముంద నిలుచు.

భక్తియొక్కండె విడువక వచ్చి వెంట
ముక్తికన్యకగేహంబు రక్తిఁ జొచ్చి
శయనగేహంబునకుఁ గొని చని స్వకీయ
తల్పముననుంచి యందాఁకఁ దాను వైచి
కొనిన ముసుఁగును దొలఁగించి కనఁగనిచ్చు
ముక్తితరుణీస్వరూపంబు మోహనంబు.

ముక్తియే భక్తి భక్తియే ముక్తి సుమ్మి.

భక్తి బాలిక, ముక్తియుఁ బ్రౌఢతరుణి.

భక్తి ముక్తిగ వయసునఁ బరిణమించు.

వరున శుద్ధవునకు నేమి హరి వచించె
శంకరుం డేమి బోధించె శంకరికిని
నారదుండు పరాశరనందనునకు
నమ్మునీశ్వరుఁ డాత్మజుఁ డైనశుకున
కామహర్షియు నలయుత్తరాత్మజునకు

నేమి ప్రహ్లాదుఁ డెఱిఁగించె నెల్లరకును
నారసింహుని వర మేమి కోరె నతఁడు
అంబరీషునియందు మాహాత్మ్య మెద్ది
కరిపతి యొనర్చినట్టి యాకార్య మేది
సంకటములందు ద్రౌపదీశంకరులును
సలిపినది యేమొ మనమున సంస్మరింపు
వారిమార్గాన మన మేగవచ్చుఁ గాదె.
సఖ్యమును శ్రవణంబు దాస్యంబు సేవ
యర్చనము చింత వందనాత్మార్పణములు
కీర్తనము లని నవవిధకీర్తనీయ
భక్తివిధముల బోధించె భక్తవర్యుఁ
డైనప్రహ్లాదుఁ డద్దాని లోనదేని
నైన సాధింప మోక్షసౌఖ్యంబు గలదు.

## ప్రపత్తి.

మున్ను చెప్పినయోగముల్ పూనుటకును
శక్తిచాలనివారికి ముక్తిగలుగ
యుక్తి యొక్కటిగలదు నానూక్తి వినుము
భక్తి సదుపాయముగఁ గొని పరమువశము
పడఁగఁజేయుట యయ్యె నుపాయభక్తి.
పరముఁడె యుపాయమంచు, నుపాయ మన్య
మేదియైనను గోరక యెలమి నుంట
సాధ్యభక్తియు నగు నిదె శరణుచొరుట.

దీని శరణాగతి యటండ్రు దెలియువారు
న్యాసమందురు దీని సన్న్యాస మిదియెఁ
బలుకఁబడు నమ్మ యిదియె ప్రపత్తి యనుచు.
ఇట్టిపథమునఁ బోయెడునట్టివారు
పలుకఁబడుదురు ధరణిఁ బ్రపన్నులనుచు.

తక్కువార లుపాసకుల్ తమస్వతంత్ర
యత్నమున ముక్తి సాధ్యమం చండ్రుగాన.

దానిలక్షణ మెఱిఁగింతుఁ దల్లి వినుము
ఇప్పటికిసంగ్రహంబుగ నెఱుకపఱుతు.
తపములందెల్లఁ బరమమౌ తపము న్యాస
మనియె శ్రుతి, గీతలందట్ల యనియె హరియుఁ
జరమ మగుశ్లోకమున నరహరి వరాహ
జనకజానాథులును నట్లె యనిరి తల్లి!
దీనినిఁ మించుమోక్షంబు తెరవులేదు
అంగములు గల్గు దీనికి నైదు నొకటి
అందు ననుకూలసంకల్ప మనఁగ నొకటి
యవలఁ బ్రతికూలవర్జనం బవును; బిదప
నన్ను రక్షించు ననియెడినమ్మకంబు
మేలిగోప్తృత్వవరణంబు, నాలుగవది
ఆత్మనిక్షేప దీనత లైదునాఱు
వీని వివరింతు వినవమ్మ విశదముగను.

అఖిల భూతంబులం దంతరాత్మయగుచు

విష్ణువు వసించు ననుచును విశ్వసించి
దాని దానికి క్షేమంబె తలఁచుచుంట
కలికి! యిదియానుకూల్యసంకల్ప మయ్యె

ఎట్టిజీవికి నైనఁ గీడెంచుచుంట
హింససేయుట మొదలగుకృత్యములను
వదలుటయె ప్రాతికూల్యవివర్జనంబు

ఏను బాపాలయంబౌదు నైననేమి
పరమకారుణికుండు శ్రీవల్లభుండు
సర్వశక్తిసమేతుండు సర్వవిభుఁడు
భక్తజనవత్సలుండు ప్రపన్నభర్త
నన్నుఁ దప్పక రక్షించు నమ్మకంబ
పొల్లు గాదిది యనుచుఁ దా నుల్లమందుఁ
జంచలతలేని మతిని విశ్వాస ముంప
నదియె దృఢమైనవిశ్వాస మంద్రు బుధులు.

రక్ష్యుఁడను నేను, నీవన రక్షకుఁడవు
నేను భర్తవ్యుఁడను మఱి నీవు భర్త
ఫలము నేనేదికోర నీప్రాప్తిఁ దక్క
నెన్నిజన్మంబు లందైన నెందు నున్న
నీవె నాప్రాపకంబయి నిలువవయ్య
యని ఫలాపేక్ష లేనిప్రీత్యతిశయమున
హరిని గని పల్క గోప్తృత్వవరణ మగును

తన్నుఁ దనతల్లిదండ్రుల దారసుతుల

నిల్లు ధనధాన్యరత్నాళి హితుల భటులఁ
దనదుబంధుల క్షేత్రముల్ ధర్మములును
సర్వకామ్యంబులు సపరిచ్ఛదము గాఁగ
సర్వమును స్వామి కర్పించి శరణ టంచుఁ
దనదుస్వామ్యంబునైన స్వాతంత్ర్యమైన
నించుకయు లేక హరికి నర్పించి తీర
నిర్భరుఁడు నిర్భయుండునై నివ్వటిలుట
ఆత్మనిక్షేపమందు రో యంబ! బుధులు

కర్మములు చేయునంతటికడిమి లేదు
జ్ఞానయోగంబు సాధించుశక్తి లేదు
భక్తిసాధించునంతటిరక్తి లేదు
ధర్మములు చేయనాయొద్ద ధనము లేదు
ఇంచుకయు శక్తిలేని యకించనుండ.
అన్యగతి యేది యెఱుఁగని యధమజనుఁడ
వీఁడు నావాఁడ యనియెడి వాఁడు లేఁడు
నీదుపదములు దక్కఁగ నేదిప్రాపు
అఖిలలోకశరణ్య యంచాత్మదైన్య
మాత్మఁ దలపోయఁ గార్పణ్య మనిరి బుధులు.

తనదునధమాధమత్వంబుఁ దలఁచి తలఁచి
గర్వ ముడిగినఁ గార్పణ్యగరిమ పొసరు.

వీనికిని గలనియమముల్ వినఁగదమ్మ
పరులకును మేలుకోరుటే ప్రథమమయ్యె

అవగుణంబుల విడుపు రెండవదిసుమ్ము
ప్రాణములు పోవునంత యవస్థ నున్న
సర్వబంధులు విడనాడి చనినఁ గాని
ధనము లన్నియుఁ గోల్పోవు తరుణమైన
స్వామిశ్రీశుండు, భృత్యుండఁ జక్రికేను
కమలనాభుండు కాచె నేఁ గావ నిమ్ము
కాఁచెనేనియుఁ నట్టులే కాఁచనిమ్ము.
ఏల నన్ను నుపేక్షించు నిందిరేశుఁ
డింతకంటెను రక్షకు లెవరు గలరు?
సార్వభౌముని జేపట్టి పామరులను
గాసువీసంబులను గోరఁగాను దగునె?
ఏనుఁగును నెక్కి వెఱవఁగానేల నాకు
మొఱగుచుండెడికుక్కలముఖముఁ గాంచి?
సర్వశక్తుండు నాస్వామి సర్వవిదుఁడు
సర్వదాతయుఁ గరుణాబ్ధి సర్వధాత
దేవదేవుండు నాతండ్రి శ్రీవిభుండు
వ్యభిచరింతునె యాతని వదలి నేన
టంచు నిశ్చలవిశ్వాస మమర వలయు.
ఎట్టిదశయందు నేనియు హితచరిత్ర!
కోరికలఁ గోరె దేనియుఁ గోరవమ్ము
భక్తిజ్ఞానంబు మాత్రమే వలదు వేఱు.
కామ్యకర్మంబు దేనినేఁ గాదు సలుప.

బుణ్య మిదు నని సత్కృతుల్ వ్రాసవలదు
స్వామికైంకర్యబుద్ధిచే సలుపవచ్చు.
హరికి లక్ష్మికిఁ దక్క నన్యంబు దేని
కైన మ్రొక్కకుఁ బరదైవ మనుచుఁ దలఁచి
హరికి నంశంబు లనిమ్రొక్క వచ్చుఁగాని.
భుక్తి కని పరు నాశింపఁ బోల దెపుడు.
సర్వమును యాచితంబు త్యాజ్యంబు సుమ్మి.
వ్రతములన్ హరివ్రత మొండె వలయుఁ జలుపఁ.
గర్మమేదియుఁ దగదు మోక్షంబు కోఱకు

తన్నుఁ గాచునో కావఁడో యనుచు నాత్మ
సంశయింపఁగ వల దెట్టి సమయములను.
ఎన్నొవంకలు చెఱువులు నేఱు లున్నఁ
జాతకము మేఘుఁ డిచ్చెడిజలకణంబు
దక్క వేఱొండు త్రాగునే? యక్కరణిని
తాన యాదృచ్ఛికంబుగ దైవ మిచ్చు
దానితోఁ దృప్తిపడియుండఁ దగు సతంబు.

పరులయాచింప రా దెట్టి పాటనైన.
చాతకంబు ప్రపన్నుండు సములు గాన
వలయుఁ జాతక మన నుండ లలితచరిత;
వేఱెయాధారమును గొన వెరవుగాదు.

అన్యఫలములు గోరు టనర్హ మెపుడు.
పాపహానికరంబులు వలదు సేయఁ

జెట్టులకు రావులకుఁ బ్రదక్షిణము తగదు.
తొలసి లక్ష్మియె కావున వలయుఁ గొలువ.
మనయఘంబుల హరియించు మాధవుండె
కార్య మేమన్య దేవతోత్కరముతోడ.
మనకు వలసిన నొసఁగును మాధవుండె
పనియు లేదేమి తక్కుదైవములతోడ.
పూర్ణవిభవావతారముల్ పూజ తగును
అంశవిభవాళిఁ బూజింప ననువు గాదు.
తన కటంచును బుష్పగంధములు వస్త్ర
ములు గృహంబులు పశువులు భూషణములు
భోజ్యములు మఱి యేవైనభోగ్యతతులు
వలవ దెప్పుడు గ్రహియింపఁ బరులచేత.
దాసునకుఁ బుత్రునకు వేఱు ధనము లేదు.
స్వామిదై తండ్రిదై యుండు సకలగతులఁ
గాన నాకని దేనిని గాదు గోర.
వలదు జోస్యుల నడుగ శుభం బశుభము
వలవదు ధరింపఁగా జటాభార మెపుడు.
కాయమున నిండఁగ విబూది పూయవలదు.
దయ్యముల రోగములను క్షుద్రంబులైన
మంత్రములచేత హరియించు మతము తగదు.
విషములందైన నట్టిదే విధము సుమ్ము.

వ్యాధివచ్చిన శ్రీహరిపాదజలమె
చక్రిభక్తిప్రపూర్ణుం డొసంగుమందౌ

కోనఁగఁ దగుఁగాని వేఱొండు కోనఁగ రాదు.
తన్ను రక్షించు నవి యని తలఁపరాదు.
తనువు రక్షించుకోర్కియుఁ దగదు సుమ్ము
మేనిమీఁదనుగల యభిమానమునను.

వృత్తికొఱకయి యాలోకవృత్తి వలదు-
సంచయమునకు ధనమునార్జనము వలదు.
నిందసేయకు పరుల, మానందపడకు
బ్రదుకునకుఁ, గాలమును వేచి వలయునుండ.
న్యాసవిద్యావలంబక నైష్ఠికులును
భాగవతులస్తుతి నింద, దుర్భావ నుతిగ
నెంచి వర్తింపవలయు సముచితగతి.

షండ పతిత విరోధులు జారిణులును
దీసికొమ్మని వారయి తెచ్చి వేఁడ
నాపదలనున్న గ్రుడ్డి గవ్వైనఁగాని
వారిచేఁ గొనరా దెంతవలసియున్న.

ఆశ, గూలంబనంబు, నహంకృతియు
మమత యనునవి బొత్తిగ మానవలయు.

ఆత్మ నగుదును నేను, దేహంబు గాను.
ఎట్టిదిపరిగ్రహంబు లేనట్టివాఁడ
విష్ణుదాసుండఁ దద్దాస్యవిభవకాంక్ష
శరణుశరణంటిఁ దద్విభుచరణములకు

దాస్యమే నాకు సత్త, తద్దాస్య మొండె
గతియుఁ దక్కనవానితోఁ గార్యమేమి?
అనుచు నిర్భయుఁడై యుంట యనవరతము
సాధ్యభక్తి యటందురు సాధ్వి దీని.

తన్నుఁ దనవియు, సర్వం బుదారమతిని
హరికిని సమర్పణంబు సేయంగవలయు
వస్తువులనైన భావంబువలన నైన
మరలఁ దన కనరా దభిమానమునను
మరలఁ దన వనుకొనరాదు మనసునందు.

ఎరవుసొమ్ములు దా ధరియించినట్లు
లెంగుచుండఁగ వలయును నెల్లవేళ.

ఫలముఁ గోరరు తత్ప్రాప్తి వలచువారు
ఫలముఁగోరియుఁ జేయంగ వచ్చు దీని.

మోక్షవిషయ భరన్యాసమునను దల్లి!
సస్వరూప సఫలపరిచ్ఛదము లెల్లఁ
బాయవలయును; దక్కంగఁ గాయమొండు

నేనొ యపరాధనిలయంబ, నిర్గతికుఁడ
వే ఉపాయఫలంబులు వేఱు దిక్కు
లేనివాఁడను, నీవె నాకైన దిక్క
వగుచు నీవె యుపాయంబు నరయు నన్ను
మనుచు నొకమాట కొఱలేని మనసుతోడఁ

బ్రార్థనము సేయుటే భరన్యాస మగును.
పలుమఱును దీనిఁజేయుట పాడిగాదు.

నేను భగవంతువాఁడ, నే నేమిచేయ
నతఁడె రక్షించు ననుచు దుష్కృతులు సేయ
రాదు; స్వాజ్ఞ నుల్లంఘింపరాదు గాదె?

ధర్మములసేఁత మానంగఁ దగును గాని
తగదు తల్లి యొనర్ప నధర్మములను.

నిత్యముల వీడనాడుట నీతిగాదు
అటులె నైమిత్తికంబులు హరిసమర్చ.

వలయు దీనిని నాచార్యువలనఁ జేయ.

మున్ను చెప్పిన యాఱంగములును గట్టి
నమ్మకంబును, వేఱుపాయమ్ము సేయ
కునికి, సంప్రార్థనముతోడ నొక్కమాఱు
భరము భగవంతుమీఁద నే వైచుటయును
అంతిమస్మృతివర్జనం బమ్మ యివియ
గుణములు ప్రపత్తి యందయి కొఱలుచుండు.

భక్తి ప్రారబ్ధమునుదప్పఁ బాతకములఁ
బాఱఁదోలును గాని ప్రపత్తి ద్రుంపఁ
జాలుఁ బ్రారబ్ధమైనను లీలగాఁగఁ
గాలమును వేచియుండ నక్కఱయు లేదు

అంతతీవ్రంపుటార్తియు నమరు నేని.

భక్తిశీలిని! యార్తప్రపత్తి యిదియె.
దేహపాతంబువఱకు కోర్కెఁ దృప్తుఁ డగును.
కాన సుకరంబు మోక్షైకకాముకునకుఁ
దక్కిన యుపాయములకంటెఁ దల్లి యిదియ.

కోరు దేనియుఁ జేయు మీ గురుముఖమునఁ.
బూర్ణముగ దీనిఁ దెలియంగ బుద్ధియున్న
నెఱుకపఱిచెద సర్వంబుఁ దెలియ నవల.
కర్మఫలములవిడుపు ముఖ్యంబు కర్మి
కాత్మ యవలోకనంబు ముఖ్యంబు జ్ఞాని
కతులితప్రేమ భక్తికిఁ బ్రాణ మయ్యె.
ఫలము భారంబు సర్వంబు వదలవలయు
న్యాసవిద్యైకరతుఁడు విశ్వాసగరిమ.
గళమునం గలమినుకు దక్కంగ సర్వ
భూషణాదుల నెల్లను బూర్ణముగను
దీసి సంప్రీతి నీయిష్టదేవు నెదుట
నుంచి యిట్లు వచింపుమీ యువిదమిన్న!
నేను నాయది యనునభిమాన మెందు
నింతదాఁకను నిలిచె నవెల్ల నీవె
కొనుమ, నాప్రాణమును దేహమునుసమస్త
వస్తుజాలంబు నన్నును వాని నెల్ల
నీకె యర్పించు టయ్యెను, నీవె యవియుఁ

గలుగఁ జేయుము కైంకర్యములను వానిఁ
బ్రీతిచేయించుకొనుము నాచేత నీవె.
స్వామికైంకర్యరూపరత్నాభరంబు
నీదియే కాని శ్రీహరి నాది కాదు.
స్వామికైంకర్యరూపరత్నాఫలంబు
నీదియే కాని శ్రీహరి నాకుఁ గాదు.
నీదుప్రాప్తి కుపాయంబు నే నెఱుంగ
నీవె సదుపాయ మగుచును నిలువవయ్య.
అనుచుఁ ద్రికరణశుద్ధిగ ననుచుఁ గొనుమ.
మరల నిర్మాల్యముగ వాని, నొరులచేల
మెరవు సొమ్ములు దాల్చిన క్రైంచవమ్మ
మమతఁ బూనకు మరల నేమాత్రమైన
నందసుతుమ్రోల గోపకన్యకలరీతి
నిలువవలయును మనసున నళుకులేక
ప్రాకృతపదార్థములనెల్లఁ బాయఁ దట్టి,
ఎవరు చూచెదరో యని మెగిరిపడకు.
ఒంటిగా నీవు గదిలోననున్న నైన
లోకమంతయు నిన్నియాలోకనంబు
జేయుచున్నట్టు లెంచుము చిత్తమందు
వాసుదేవుఁడై సర్వంబు వఱలుకతన.
ఎవరు చూచిన నాకేమి దివు లటంచు
జంకు గొంకును గొనకు నిశ్శంకమతిని
నీమనస్థితి కెంతయు నీవె సాక్షి,

కణమ గోనియు మదిని వికారమున్న
వ్యస్తభూషణములమీఁద నాసయున్న
మరల నాయువి యనునభిమాన మున్న
నీవు కొఱగావు దీనికి నిశ్చయంబు,
ఱఱగొఱగఁ జేయ ఫల మఱగొఱతె యగును,

తివుటఁ గొన్నాళ్లు లిటుసేయ దినదినంబు
మనసులోనికళంకంబు మాయ మగును.
దేహమునయందు సడలును మోహ మెల్ల
దానిపై నున్ననగలు వస్త్రంబు లెల్ల
నెవరో దాల్చిన రీతిని హృదిని దోఁచు,
అట్లు గాకున్న విడిచి సర్వార్థములను
దైవసంప్రీతికై! మఱి తాఁకరాదు
నిలువవలయును మూఁడేండ్లు నిసుఁగునట్లు.
పాణిపాత్రంబె దగియుండు భైక్షమునకు
దోసిటను నీళ్ళు ద్రావుము తోఁచినపుడు
ప్రీతిచే నన్యు లొసఁగ యాదృచ్ఛికముగ
శాటలం బెందునేనియుఁ బడియయున్న
నప్రయత్నప్రలబ్ధమైనట్టిగోఁచి
దాల్పవచ్చును, మదిలోన నిల్పి హరిని
సంస్మరించుచు గాలి నాసంచరించు
చుండవచ్చును, వెంగలియోజ నరుఁడు
తరుణులకు నిటుసేయుంగఁ దగదు సుమ్ము.

కాక యొకచోటఁ గూర్చుండి కదలకుండఁ
గర్మముల నెల్ల మాని, యఖండనామ
జపము గావింపు రేవగల్ జడిమలేక
అర్ధనిమిషంబు నేనియు వ్యర్థపఱుపఁ
దగదు చిత్తంబు హరిమీఁదఁ దగును జేర్ప.

కరములందునో నోరనో కనికరమున
నెవ్వరేనియు నాహార మిడిర యేని
కొనఁగవచ్చును లేదని వనరరాదు
తలఁపునందైన నయ్యది తగులరాదు
శక్తిగలవార లిట్టులు జరుపవచ్చు.

విధినిషేధముల్ లేవమ్మ వీరలకును,
వాని నన్నిటి దాఁటిన వారు వీరు
ఇట్టియేకాగ్రచిత్తు లేకాంతిజనులు
చక్క న్యాసమొనర్చుట నిక్కమైన
యట్టిసన్న్యాసులయ్యెద రంతె కాని
బాహ్యవేషాలతోడుతఁ బనియు లేదు
ఉదరమును నింప నవి యుపయోగపడును.

నిక్కమైన ప్రపన్నుండె నిక్కమైన
యతియు సన్న్యాసి యని నీవుమతిఁ దలంపు-
లక్షణంబును దెలుపుతలంపె కాన
సంగ్రహముగ వచించితి సకలగతులు,
దీనిలో నొండు నీశక్తివిధ మెఱింగి

సలుపంబూనుము శుభ మగు జనని నీవు.
దీని నోయంబ నీవు సాధించెదేని
నీవొకర్తవు గావమ్మ నీమభర్త
తల్లియును దండ్రియును గూడ దాటఁగలరు
చటులసంసారవార్ధి నిస్సంశయముగ,
ఆత్మనిక్షేప మని భరన్యాస మనియుఁ
బడఁతి! శరణాగతి యని ప్రపత్తి యనుచుఁ
బలుకుచుందురు దీనినే ప్రాజ్ఞజనులు.
అదియె యాత్మనివేదనం బనుచుఁ బూర్వ
మల్లప్రహ్లాదుఁ డనియెను సాదరముగ.

దానినే యీశ్వరప్రణిధాన మనుచు
నొప్పగాఁగఁ బతంజలియోగి యనియె.

ఎట్టిమార్గంబునం దేగ నెంచితేని
వలయు మమత యహంకృతిఁ బాయఁదట్ట.
స్వాభిమానంబు సర్వంబు సమయవలయు.
దిక్కు భగవంతుఁడొక్కఁడే తక్కువార
లెవ్వరైనను గారని యెంచవలయుఁ.
బతిని సాధ్వి సేవించెడిపగిదిగాఁగ
స్వామియెడ నుండవలయుఁ బ్రపన్నుఁ డెపుడు.

తొలుత వివరించినట్టి సాధులగుణంబు
లన్ని సమకూర్చుకొప్పఁ జేరాస్థతోడ.
బాలునట్టులు చరియింపవలయుఁ దుదను

శంకరాచార్యవర్యుండు శంకరుండు
మఱియు శ్వేతాశ్వతరుఁ డాది మహానివరులు
శరణుఁ చొచ్చినవారలే శంకవలదు.
పరమభక్తియె గాక ప్రపత్తి యొండె
సత్వరంబుగ ఫలమిచ్చు సత్పథంబు.

భక్తికైనను నధికారబాధ గలదు
దీని కదియును లేదమ్మ తెలియవింటె.
భక్తి కంతిమస్మరణ మవశ్య మగును
విను ప్రపన్నున కటుసేయుపనియు లేదు

## ఆచార్యాభిమానము.

తల్లిరో! కొందఱున్నారు ధరణి జనులు
దేని నేనియు సాధింపలేనివారు.
ఎందు నున్నాఁడొ భగవంతుఁ డెవ్వఁ డెఱుఁగు
నెట్లు సేవింపవలయునో యెవరికెఱుక
యట్లు సేవించుశక్తి మా కబ్బునెట్లు
హేయకాయంబు దక్క వేఱేది లేదు.
మిగుల సేవింపలేము సౌమిత్రియట్లు
పారతంత్ర్యంబుఁ లేదు భరతునట్లు.
ప్రతిభచాలదు ప్రేమయుఁ బట్టుపడదు
శాస్త్రపాండిత్యమా లేదు చదువురాదు.
ఏది గతి మాకు నంచును నెంచువార
లర్హుఁ డైనట్టిగురువు సమాశ్రయించి

యన్నిగతుల నంతేవాసి యగుచు నిలిచి
శుద్ధ మైనట్టిమతిని శుశ్రూష చేసి
వానికిని దమయం దవివార్య మైన
సదభిమానంబు కలుగంగ సంచరించి
వారిప్రేమకుఁ బాత్రులై వారిబోధ
మును గ్రహించి తరిఁపఁగఁ బూనవలయు.

ఒకఁడు గొనిపోవ దీపంబు, నున్నవారు
దానివెలుఁగునఁ బోవుట గానమొక్కొ.
అటులె యాచార్యవర్యసమాశ్రయమున
వానియెడఁ బ్రేమగలిగిన వార లెల్ల
వానిప్రేమకుఁ బాత్రులౌ వార లెల్ల.
నతఁడుపోయెడిగతికిఁ దా మరుగఁగలరు
పశువులైనను నరులైనఁ బక్షులైన.

శబరి నారదుఁ డీరీతి నలిపినారు
అల విభీషణుమంత్రులై యాశ్రయించి
తాము శరణన్నకున్నను దాశరథికిఁ
దత్కృపాదృష్టి నెంతయు ధన్యులైరి
రక్కసులు నల్వు రని చెప్పు రామచరిత.

కలదు దీనియం దొకపెద్ద గండ మిపుడు
యోగ్యుఁ డైనట్టియాచార్యుఁ డొనరవలయు
అట్టియర్హత లేకున్న నతఁడు చెడును.
దోడివారును జెడుదురు తోడుతోన

యంధు వెంటను జని యెడి యింధు లట్లు.

సత్యవర్తనుఁ డగుచు నాచార్యవరుఁడు
పరమభాగవతుఁడు భగవంతుకృపకుఁ
బాత్రుఁ డైనట్టివాఁడయి వఱలవలయు.
కాక యుండినమే లేమి కలుగఁబోదు
జాతినీతిమతాచారసరణులందు
తన్ను మించినవాఁ డయి తనరవలయు
విపుల మగుభక్తి శ్రద్ధయు వెలయవలయు.
దుర్గుణంబుల నన్నిటిఁ దొలఁచవలయు
సాధువర్తనుఁ డగుచును జరగవంయు
ఇట్టివానిని జను లాశ్రయింపవలయు
శ్రేయమును గానవలెనను జింతయున్న.

స్వామి సేవించువారికి సందియంబ
కలుగునో కల్గదో ముక్తి ఫలము గాని
పరమభాగవతోత్తమచరణసేవ
సేయువారికి మోక్షంబు సిద్ధఫలము.

సందియంపడఁ బనిలేదు స్వాంతమందు
భాగవతపాదసేవచేఁ బావనముగఁ
జిత్తమైనట్లు శ్రీహరిసేవఁ గాదు.

స్వామి మనమీఁదఁ గినిసినఁ జాలుగావఁ
బరమభాగవతుం డెప్డు; భాగవతులు;

కనలిరేనియు హరియేనిఁ గావ లేఁడు.
అంబరీషుండు గుఱిగాదె యంబ మనకు.

వ్యాధిబాధితుఁడైనచో బాలుఁ, డతని
తల్లిగద మందు తినుచుఁ బథ్యమ్ము సలుపు
నాత్మసౌఖ్యంబులందుఁ దా నాస విడిచి
చేరి తన్ను భజించెడి శిష్యుపట్ల
నతనియాచార్యవర్యుండు నట్లె సేయుఁ
దొలుత భగవంతు నియమంబు గలదయేని.
మోక్షమును గోరువారలు పోవుత్రోవ
లైదు, కర్మంబు, జ్ఞానంబు, నమితభక్తి
మఱిప్రపత్తి యాచార్యాభిమాన మనఁగ
వీని నన్నిటిఁ దెలిపితి వీనిలోన
నేది రుచియించు నాత్రోవ నేగవమ్మ.
తెలిపితేనియు నీవోవవలచు తెరువు
పూర్ణముగ దానినే తెల్పఁ బూనువాఁడ.

## విరోధులు.

వైరు లున్నారు కొందఱు భక్తులకును
వారివిధమును దెలిపెడి వాఁడ వినుము.
స్వస్వరూపవిరోధి నా వఱలునొకటి.
ఆత్మ యెటుగాదో దేహేంద్రియాదికములు
ఆత్మ దాసోహ మనుటెట్లు సార్థకంబొ,

ఆత్మకొక్కఁడె స్వామి నారాయణుండు
అతఁడె పరముండు ముక్తిదుఁ డతఁడె కాన
నన్యసేవయు భక్తియు హానికర మ
టంచుఁ దెలిపితి నిలిపితే యాత్మయందు.
ఆత్మ గానట్టిదానియం దాత్మబుద్ధి
పరుని స్వామిగ గ్రహియించుపాడుబుద్ధి
నే స్వతంత్రుఁడ స్వామిని నేనె నాకు
ననెడిదుర్బుద్ధి యత్యంతహానికరము
లనుచు నమ్ముము చేయకు మట్టి తప్పు.
ఇట్టిపొరపాటునకు నుండు హేతు వొండు
మతము లుత్పత్తియైనట్టి మార్గములను
బలుకుచోటను రెంటినే పలికినాఁడ

దేహ మని యాత్మ యని స్థూలదృష్టి కవియె
కానవచ్చును గాన లోకంబునకును
వానిమాత్రంబు దెలిసినవారు వాని
యందు నుత్తమమైనట్టి యాత్మ కంటె
నన్య మేదియు లేదని యాత్రపడుచు
నదియె సర్వంబు స్వస్వామి యదియె యనుచు
మదిఁ దలంచిరి సుమ్ము ప్రమాదమునను.
జీవుపడియెడుపాటులు దేవురింపు
లరసి స్వామికె యిటువంటి వ్యథ లటంచుఁ?
దరచి తత్స్వామి వేఱంచు దార్ఢ్యమూని

రాత్మ నామ్నాయవిదు; లవి యనెడి నిట్లు;
బానఁ బొరపడఁబోకు మో తల్లి కాన
విను పరస్వరూపవిరోధివిధము నింక.
అన్యదేవత ముక్తిదుఁ డనుతలంపు
అట్టిదేవత రక్షకుఁ డనుతలంపు
అట్టిదేవత హరిసముఁ డనుతలంపు
శౌరి యవతారముల మానుషత్వబుద్ధి.
ఇట్టి యర్చాకృతిని దీర్చి యేనె కాదె
నిలిపినాఁడను మనుజులు సలిపినట్టి
విగ్రహంబును గొల్చిన వెతలుగాదె
దీని కెట్లు లభించును దివ్యశక్తి.
యిదియె స్వామి యటంచును నెట్లుపలుక
నిదియె యీశ్వరుఁడని పల్క నెట్టు లగు న
టంచుఁ దలఁచినఁ జెడియెద వమ్మనీవు.
తరచి కనుము దేవాలయ తత్త్వకృతిని
సమసిపోవును నీమదిసందియంబు.

సాధనవిరోధిఁ జెప్పెదఁ జక్క వినుము
మిగులఁ గష్టించినఁ గాక మేలుగలదె?
సౌఖ్యమార్గంబునందు మోక్షంబు గలదె?
నామమే మోక్షదాయి యహా నా స్మరింప?
అంతసులభంబె మోక్షం బటన్నబుద్ధి
నన్యసాధనములు గొప్ప లనుతలంపు

మదిని భగవంతుఁడో మహామహిముఁడాతఁ
డెల్లలోకంబులకు వేలు పీశ్వరాజ
శక్రముఖ్యులకైనను సాధ్యపడఁడు
నానమస్కారమాత్ర నానందపడు నె?
ఆకులును నీళ్లు నొసఁగిన హర్షపడు నె.
నాదుపరిచర్యచేత నామోదపడు నె?
శేషుఁడనో లక్ష్మినో నాదుచేత లెంత
వ్యర్థ మనుభావ మెంతయు హానికరము.
మహిని గోట్లకొలంది జన్మంబులెత్తి
క్షణముక్షణమున లెక్కింపసాధ్యపడని
యలఘు పాపంబు లెన్నియో సలిపిసలిపి
మేరు వింధ్యహిమాచల ధారణీధ్ర
కోటితుల్యంబుగా రాశి గూడియున్న
నాదుపాపం బమేయంబు నాశపఱుప
శక్యమే యెట్టివాని కసాధ్య మనుచు
స్వాఘబాహుళ్యమెంచుట హానికరము.
మేదినీధర మంతటి దూదిరాశి
నడపొడయులేక చేయదే యగ్నికణము
టంచు భగవంతుమహిమయే యెంచవలయు
అతనికరుణ యపారంబ, యమ్లై శక్తి
వినుము పురుషార్థసువిరోధివిధము నింక.
ప్రేమయున్నను ధర్మార్థకామములను

ఇచ్చుకొలఁది స్వతంత్రించి హేయ మనక
స్వార్థపరతఁ గైంకర్యంబు సలుపుటయును
మోక్షశత్రువులంచును బుద్ధి నిలుపు.
ప్రాప్తిశత్రువు నీకమీఁదఁ బలుకువాఁడ
పరఁగఁ బ్రారబ్ధదేహసంబంధములును
దేహసంబంధమును గలదేహితోడ
నొదవుసంబంధ మనుతాప మొదవకుంట.
భాగవతులకు, భగవంతుపట్ల, మఱి య
సహ్య మైనట్టి యీయపచారములును
స్వాభిమానంబు శత్రువుల్ ప్రాప్తి కెపుడు.
జ్ఞానప్రతిబంధి యన్నదోషంబుసుమ్ము.
మొగిని సహవాస దోషంబు ముక్తిభోగ
శత్రువంచును దలఁపుమీ స్వాంతమందు
ఈవిరోధుల నేనింటి నెట్టులైన
హాతులఁ జేయకయున్న శ్రేయంబు లేదు.
చెప్పవలసినవానిని జెప్పినాఁడ
సంగ్రహంబుగ నీకవాని సార మనెద
ముక్తికన్యాభిలాషియౌ భక్తవరుఁడు
మునుపుచెప్పినవానిసాధనముచేసి.
మమత విడి కృతకృత్యుఁడై మహిని నిలిచి
యీశ్వరాహ్వానమును వేచి యీశరీర
యాత్ర సలిపెడునందాఁక నలఁత లేక
కాలమును ద్రోయవలయుఁ గైంకర్యపరత.

భర్త నింటను బూజించి బయలఁ దిట్టి
బయలఁ బూజించి యింటిలో భంగపఱుచు
భార్యలను నెంచుదురె పతివ్రత లటంచు
నటులె పూజించి తనయంతరాత్మ హృదిని.
స్థూలజగమును భంగించుతులువకైన
బాహ్యమునఁ బూజచేయుచుఁ బ్రబలముగను
హార్దుఁ బూజింపనొల్లనియట్టిదాని
కగునె భక్తసమాభిఖ్య సార్థకంబు.

ప్రజలకును మేలుసేయుచుఁ బరమరక్తి
భగవదర్చలఁ బూజింప బాహ్యభక్తి
కుంభకంబునఁ గూర్చుండికొంచెమంత లేక
హార్దు ధ్యానింపఁగా నంతరంగభక్తి.
విడువ కరీతి జేయువివేకి యొకఁటి

వాస్తవంబుగ భక్తాఖ్యఁ బలుకఁబడును
ఘోరసంసారతాపంబుఁ గూలఁద్రోయ
వర్ణమున కాశ్రమమునకు వైష్ణవత్వ
మునకు నుచితంబుగా, ధర్మములను జలిపి
విడిచి వినిషిద్ధకర్మముల్ విహితరీతి
నన్నపానాదు లార్జించి యల్లవాని
సాత్త్వికత్యాగమొనరించి స్వామిస్వమ్మ.
టంచుఁ దలఁచుచు శాస్త్రీయ మైనరీతి
భగవదాజ్ఞగఁ దలఁచుచుఁ బాత్ర మెఱిఁగి

మీాయందగు దుర్వ్యయంబును జేయరాదు.
భాగవతులకు స్వాచార్యవశ్యనకును
పూర్వమున భగవంతుకార్యమ్ములకును
దాన మీాయంగఁ దగు దేహధారణమున
కెంతమాత్రంబువలయునో యంతె కొనుచు
నదియు దేవప్రసాదం బటన్నమతిని.

విడువవలయును మమతను విద్యమాన
పుత్రమిత్రకళత్రసక్షేత్రధాన్య
ధనము లందెల్ల స్వామివే యనుచువాని.

కాముకీకాముకుల నెన్న కలియరాదు
దుష్టసంగతి దూరానఁ ద్రోలఁగవలయు.
భక్తిహీనులతోడుతఁ బల్కరాదు
పాంచకాలిక వృత్తిని బరఁగవలయు.

భాగవతసన్నిధిని భగవంతునికట
మందు స్వాచార్యసన్నిధి నగును నిల్వ
సర్వవేళలఁ గైంకర్యసక్తుఁ డగుచు

జ్ఞానహీనునికరణి స్వాచార్యమోాల
భాగవతనికటంబునఁ బారతంత్ర్య
మొనర భగవంతుసన్నిధిఁ దనదుదోష
ముల వచించుచుఁ నిలఁబడి మ్రొక్కి విడుచుఁ.

దనదునాచార్యసర్వజ్ఞతావిభూతి

స్వామికల్యాణగుణవైభవము నుతించి
పాము తేలును బులిఁ గన్నపగిదిఁగాఁగ
భయముచేత నసాధులవంకఁ గనక
హార్దకరుణార్ద్రదృఢనిశ్చయంబుతోడ
నిర్భరత నిర్భయత్వంబు నివ్వటిల్లఁ
దనువుఁ బాసినయాతండు తరలిరాఁడు
మరల జన్మంబులకు స్వామిసరస నిలుచు
కోటికల్పంబులకునైనఁ గొఱంతలేక
పూర్ణబ్రహ్మానుభవమునఁ బూరటిల్లు.

బాహ్యవస్తులపై భ్రాంతిఁ బాయవేని
యాంతరంగికముల నెట్టు లణఁపఁగలవు?
శవమురీతినిగనుఁగొమ్ము జగము నెల్ల
శవమువలెఁ దోఁచుచుండుము జనుల కీవు.
జగమునకు నీవు నీకును జగమునకై
లేనివిధమున వర్తింపఁ బూనవమ్మ
నీదుసౌందర్యవిభవంబు నీదురీవి
నీదుయశమును భాగ్యంబు నీదుకులము
నీదుపాండితి చాతురి నీదుతర్క
నైపుణియు వాక్యకుశలత నాగరకత
మెచ్చఁడోయమ్మ దేవుండు మెచ్చఁడమ్మ
భక్తి నీమానసమున నభావమైన.

మగనిపైఁ బ్రేమ సుతుపట్ల మక్కువయును

దేనిఁ జదివి యెఱింగినదాన వీవు?
ఎవరు తల్లక్షణముఁ జెప్పి రిట్టిదనుచు
నట్లె యభ్యాస మొనరింప వమ్మభక్తి.

సాధనపుభక్తి నీకృషి సాధ్య మగును
రామవిభుకృప లభియించుఁ బ్రేమభక్తి
దానికై యేల చదువ గ్రంథములు పెక్కు?

తినుము కలకండ తద్రుచి తెలియవచ్చుఁ
దెలియఁ గలవె యుపన్యాసములను విన్న
వాడునకుఁ బోవవలవ దెవ్వారితోడ.

నాల్గుపదివిద్యలును బురాణములు స్మృతులు
కంఠగతములుచేసినఁ గలదె ఫలము.
భక్తనై శ్రీశుకృప నీవు పడయకున్న?

భక్తి హరిసేవకై పాటుపడుట తప్ప
వ్యర్థ మోతల్లి సర్వంబు వ్యర్థ మమ్మ.
అర్థమునకు శ్రమించుట వ్యర్థమమ్మ

ప్రాప్తమున్నను వెదకుచువచ్చు నదియె
లేకయున్నను శ్రమ మెల్ల శోక మిడును.

అర్థమును నమ్మి తిరుగుట వ్యర్థమమ్మ
లేదు లేదమ్మ సుఖ మొకలేశ మైన
తల్లికిని బిడ్డకును బగ దానఁ గలుగు

నిలువ దరత్రుటి మబ్బులనీడయట్లు
దినము రేయియుఁ జంతచేత నె తపించు
నర్థ మెటుచూడ మిగుల ననర్థకరము.

యశము బిరుదులు పరువులు వ్యర్థ మమ్మ
కాయసౌఖ్యంబునకుఁ గోరుకాంక్ష లెల్ల
వ్యర్థ మోతల్లి! మీఁద ననర్థకములు.
కాయసంస్పర్శఁ గలుగుసుఖంబు లెల్లఁ
దుదకు హేతువు లగుఁజుమ్మ దుఃఖములకు.

సాధువృత్తిని జీవింపఁ జాలకున్నఁ
బెక్కు లేఁడులు బ్రదుకుట వెతలకొఱకె
సాధువయి మూఁడుదినములు చాలు బ్రదుక
వ్యర్థుఁడయి వేలయేఁడులు బ్రదుకుటకును.

పరమునందు సుఖంబెడివాంఛ లేక
యైహికసుఖంబె కోరుట వ్యర్థమమ్మ
కాన శాశ్వతసుఖకాంక్షఁ బూనినీవు
నశ్వరంబులమీఁద మనంబునిడక
ఎండమావులనీళ్లచేఁ దృష్ణనార్ప
పూనక రమేశుసేవకై పూనవమ్మ.

జ్ఞాన మని జ్ఞాన మని యజ్ఞజనము పల్కు
భక్తి లేకున్న జ్ఞానాన ఫలము గలదె?
జ్ఞానహీనుండు భక్తుండు సౌఖ్యపడును

భయము భక్తియుఁ గలిగి శ్రీపతి భజించు
వాఁడు చండాలుఁడైనను వాఁడె మేలు.
శ్రుతులు తలక్రింద వల్లించుశ్రోత్రియునకు
బొక్కలను డాఁగునాయోగిపుంగవులకు
ఆత్మగానక బ్రహ్మంబు నట్టిదిట్టి
దనుచుఁ దర్కించువేదాంతిజనములకును.
భక్తిహీనత వీరలు వఱలిరేని.

వాస్తవంబుగ జ్ఞానియౌవాఁడు తన్నుఁ
గరము హీనునిఁగా నెంచుఁ గానఁ దన్నుఁ
బొగడ నెవరైన మదిలోనఁ బొంగఁ డెపుడు.
గోడుఁగొనుఁ గాని యిదియేమి పీడ యనుచు.

యమునిసన్నిధికిని నీవు నరిగినప్పు
డెన్నిశాస్త్రిలు చదివితి వేమిబిరుదు
సంతరించితి కొర్నాడు సరిగచీర
లెన్నికట్టితి దాల్చితి వెన్నినగలు
భక్ష్యములు భోజ్యములు కుక్షి పట్టకుండ
నెన్నితింటి వటంచును నిన్ను నడుగఁ
డెట్టిధర్మంబు దానంబు లెన్నిచేసి.
తోడుజీవుల కీవెట్టి కీడుపాపి
తనుచు నడుగును దాని కేమనెదు చెపుమ.

నిత్యముగ దీనిమనసున నిలుపవమ్మ
పాండితిని నీవు గడియింపఁ బాటుపడకు.

చిత్తసామ్యంబునకు నది చీడపురుగు
అదియె వంచించు నిను నిట్టు లట్టు లాగి.

పండితుం డైనవానికిఁ బ్రజలయందుఁ
దనదుపాండితిఁ బ్రకటింపఁ దమక మొదవు.
వారు తను మెచ్చవలె నను వాంఛఁ జేసి
గర్వపడుటకు నది యౌను గారణంబు.

గర్వమే సర్వహానికిఁ గారణంబు.
ప్రశ్న చేయండు దేవుండు వారు వీరు
మెచ్చిరా నిన్నటంచును సచ్చరిత్ర!

కాన నెవరెంత మెచ్చినఁ గలదె ఫలము?
వీరి నుడిఁబట్టియా కాచు విశ్వవిభుఁడు
వీరు తిట్టినఁ ద్రోయునా నారకమున.
మనకు శుభకర మగుదారిఁ జనఁగవలయుఁ
గాని యజ్ఞులనుడు లేల గారవింప

మాధవుఁడు మెచ్చు మగువను మగఁడు మెచ్చుఁ
బరుల మెచ్చులతోడుతఁ బనియు లేదు.

అన్ని తెలిసిన పండితు లమవసలను
గలికి! యేమియెఱుంగ కేకాదసులను.
జత్తు రనుమాట వినలేదె చారుశీల!

తెలిసి తెలిసియుఁ బాపంబు సలుపువాఁడు
హెచ్చుశిక్షకుఁ బాత్రుఁ డౌ హీనుకంటెఁ.

తెలిసి తెలిసియుఁ బుణ్యంబు సలుపువాఁడు
హెచ్చు సుఖపాత్రుఁ డౌఁజుమ హీనుకంటె.

అట్టులౌటను నేను విద్యావతినని
గర్వపడకుము శీలంబు కలిగి మెలఁగు
ఎంద ఱిలలేరు నీకంటె హెచ్చువారు
విద్యయందును దెలివిని విభవమందు.
వారి భావించుచు వినయవతివి గమ్మ

అధమముగఁ దన్నుఁ బరులను నధికులుగను
సతము భావించు టుత్తమజ్ఞానఫలము.

కలుష మెవఁడేనిఁ జేసినఁ దలఁపకమ్మ
యతనికంటెను నేఁ బుణ్యురాల ననుచు.

ఈశరీరంబు పడిపోవునింతలోనఁ
బాపమును జేయకుండువట పంతమున్నె?

ఎవ్వఁ డెఱుఁగును నీమన సెప్పుడేమి
కృత్యముల నీకుచేతఁ జేయించునొక్కొ
అంతకు నికృష్టకార్యంబె యాచరింతొ,
సాపరాధులె యందఱు జగతిలోన
మనల మించినయపరాధి మహిని లేఁడ
టంచును నిగర్వియగుట శ్రేయస్కరంబు.
సర్వమేకంబుగాఁ జూచు చతురుఁ డెవఁడొ
సర్వమొకదానఁ గనియెడిజ్ఞాని యెవఁడొ

అన్నిటను నొక్కటే చూచుననఘుఁ డెవఁడొ
వానిచిత్తంబె సర్వదా వఱలు శాంతి,

వాఁడె వసియించు సర్వదా బ్రహ్మమందు

చదువఁ జదువఁగ వినఁగఁ గత్తెఁ జాలుఁ జాలు
విద్యలన్నియు నీయందె విస్తరిల్లు
నిన్నెఱింగిన నీదాసుఁ డన్ని యెఱుఁగు
నిన్నెఱుంగఁగఁ జేయవే కన్నతండ్రి
జానకీరామ రఘువంశజలధిసోమ
అనుచు ధ్యానమొనర్చుచు నన్నిగతుల
అన్నిటినివీడి యొకట నేకాంతముండి
యేకచిత్తంబుతో నున్న నేమిగాని
లేక తోఁచు రహస్యముల్ ప్రాకటముగ

అట్టిదశబోధగురు వగు నంతరాత్మ

తన్నుఁ దానుజయించుటకన్నఁ గష్ట
తరము గాదమ్మ యరికోట్లఁ దఱిమి గెలువఁ
గానఁ బ్రతిదినమును దనలోనఁ గలుగు
దోషముల నెల్ల లెక్కించి తోడుతోన
జంకు గొంకును లేక నిశ్శంకమతిని
జక్కఁ జంపఁగవలయు నొక్కొక్కదానిఁ
గ్రూరుఁడైనవిరోధిని గూల్చునట్లు

అట్లు లైనను నీమది గట్టిపడును

సకలశాస్త్రంబులను నీవు చదువుకంటె
మేలు నిను నీవెఱుంగుట శీలభూష

అదియె యాత్మసాక్షాత్కార మొదవఁజేయు

వ్యర్థముల్ విద్య లని నేను బలుకలేదు.
ఫలము గలదమ్మ విద్యలవలన నెంతో
తల్లి! నిర్మల మైన యంతఃకరణము
సాధువృత్తమ్ము శ్రేష్ఠంబు చదువుకంటె
అవి యొసంగని చదువులు వ్యర్థ మగును.

సాధువృత్తంబు నిర్మలస్వాంత మెడలి
చదువుమాత్రంబ నేర్తురు జనులు నేఁడు
పొట్టకూటి నిమిత్తమై యట్టు లగుట
విద్యలను నేర్చి గర్వించి వీతిఁడులయి
పరము సేవించి భుజియించి బాగుపడక
వ్యర్థులై యెంద అరిగెడువారు కంటె

పరులు తనకంటె నెక్కుడు వారు, తాను
జిన్న యనియెంచువాఁడు చూ శ్రేష్ఠతముఁడు

సకలభూతంబులందును సదయవృత్తి
జెలఁగుచుండెడివాఁడె చూ శ్రేష్ఠతముఁడు

వాసుదాసుఁడు నై పాంచభౌతికముల
మలమువలెఁ జూచువాఁడె పో మాన్యతముఁడు.

అర్థములుకోట్లు కలిగినయతఁడు కాఁడు

అమితపాండిత్యమును గల్గునతఁడు కాఁడు
అవని యంతయునేలెడు నతఁడు కాఁడు
స్వేచ్ఛయనుదాని నెంతయు నీశడించి
భగవదిచ్ఛను జనువాఁడె పండితుఁడు

యముఁడు వైవస్వతుండు రాజైనయట్టి
నీదుహృదయనివాసితో వాదు లేక
సర్వవేళల వర్తింపఁ జాలుదేని
కాశిరామేశ్వరము పోక గాసి కొఱకె

నీదుహృదయనివాసితో వాదు పడినఁ
గాశిరామేశ్వరముపోక గాసికొఱకె

ప్రకృతిసంబంధ మాపదార్థంబునందు
దేనిపైనేని యత్యాశఁ బూనితేని
నధికదుఃఖంబునకు హేతువగును నదియు
శాంతి లేదమ్మ గర్వి కాశాపరునకు.

తన్నుఁ దాను శవంబుగాఁ దలంపనట్టి
వాని నింద్రియములు ముంచు స్వల్పముననె
యెప్పుడో యెట్టిదానికో యేమరించు,

బలవిహీనుండు నింద్రియవశుఁడు విషయ
పాళిపై నాశ బొత్తుగఁబాయలేఁడు

ఇంద్రియంబుల నీవు జయింపవలచి
తేని కోర్కుల నన్నిటి మానవమ్మ

శాంతి చెలువారుఁ క్షమ యాత్మవంతునందె
ప్రాకృతాశున కది దుర్లభంబు సుమ్ము.
మనవలెనె కర్మబద్ధులై జననమొందు
జనుల నమ్మంగరాదు రక్షకు లటంచు

నిన్ను నీవును నమ్మంగ నీతిగాదు
నమ్ము భగవంతు నేవేళ సమ్మదమున
భక్తులను మోసగింపని ప్రభు వతండె
సకలశక్తులఁ గలిగినజాణ యతఁడె
సర్వమును జక్కఁ నెఱిఁగినచతురుఁ డతఁడె
లాభలోభంబు లెఱుఁగని లలితుఁ డతఁడె
దీనజనతాటిపక్షపాతియును నతఁడె
భక్తజనవత్సలుం డయిపరఁగు నతఁడె
సర్వభూతసముండయి జరగు నతఁడె
నిరుపమానదయారసనిధి యతండె.

ఇట్టివానిని జేపట్ట నెసఁగు శుభము

బక్కవేల్పులఁ గొలిచిన ఫలము గలదె?

మనుజులా యింక మనలను మనుచువారు
శక్తిభక్తులయందు వంచనము లేక
యర్థిలిని భజియింపుమీ యంతె చాలుఁ
దోయజాక్షుండు తప్పక తోడుపడును

విశ్వసింపకు పరులను విత్తమైన

విశ్వసింపకు నీబుద్ధి పెంపునైన
వలదు నమ్మంగ హితు నెంతవాని నైనఁ
గావఁగా లేరు వీరు సంకటము వేళఁ
గావఁగలయాతఁ డొకఁడె జగత్ప్రభుండు

ఎల్లవారికి నీమన సీయఁబోకు
కామదోషంబు లేనట్టిఘనునితోడఁ
దల్లివలె నిన్నుఁ జూచెడిధన్యతోడ
సొంతబిడ్డగ నినుఁ జూచుసూరితోడ

నీకు మేలె తలంచెడి నిపుణుతోడ
పాపభయమును గలహరి భక్తుతోడఁ
గలికి వచియింపు మేదేనిఁ గార్య మున్న

బాలకులతోడ మఱిక్రొత్తవారితోడ
హెచ్చుముచ్చట లాడకు మెప్పుడేని

ఇచ్చకంబుల ధనవంతు మెచ్చరాదు.
తానుగా నధికారిని దాయరాదు
సాధుసాంగత్య మలవడఁ జాలకున్న
సంగరాహిత్యమే మేలు చతురమతికి
పరపురుషుతోడఁ జనవుండవలదు సతులు.

పురుషులకు నట్లె స్త్రీలతోఁ బొత్తు తగదు
తల్లిదండ్రులభావంబు దనరకున్న
స్త్రీలు పురుషులఁ బురుషులు స్త్రీలఁ దండ్రు

లట్లు తల్లులవిధమున నగును గొలువ.

ఎంతచనవైనఁ జేయుమీ యీశుతోనె
నరులతోఁ జెల్మి చేయ ననర్హ మెపుడు
జీవికోటులయెడఁ బ్రేమ చెల్లుగాని
చనవుసేయంగఁ జన దెల్లజనులతోడ.

అల్పజనులను బరిహాస మాడఁబోకు
ఇంతులకు నైనఁ బురుషులకేని తగదు
కడుస్వతంత్రత యెంతటి ఘనునకైనఁ
గేవలం బవధూతలై పోవువఱకుఁ
గాక యంతటివారయి క్రాలువఱకు
మనుజసాహాయ్యమునఁ గోర్కిమానువఱకు
శిష్యులుగ నుంట మేల్ గురుస్థితికిఁ దల్లి

దొరికినను మంచిగురువులు దొరకవచ్చుఁ
జిక్కఁ డోయమ్మ నిజమైనశిష్యుఁ డొకఁడు
అక్కఱ అవసరములఁ బట్టియణఁగియుంద్రు
కొంద ఱవితీరఁ జనుదురు గురుని విడిచి

ప్రేమచేతనె కొలిచెడి వినయపరుఁడు
వీడఁ డోయమ్మ దేహంబు విడుచువఱకు

కానశిష్యులఁ జేర్పంగఁ గాదు గురుఁడు
కఠినముగను బరీక్షించి కాని యెపుడు

శిష్యురాలను నన్నేమి సేయు మనెనా.
గురువునకుఁ దెల్పుమీ నేను గొంటితలేక
చేయుదాన నటంచును జెప్పదేము
వలదు వలదమ్మ నీవేమి సలుపవలను
గురుఁడు చెప్పినదానిని గొంటితలేక
యాంస్థతోడుత సాధింపు మంతె చాలు

చెప్పినది నేర్చి యీవలఁ జెప్ప మనుచుఁ
బోయి యడుగుము సంప్రీతిఁ బుణ్యశీల!

నీవు నిలువుము నీయింట నియతితోడ
గురువువెంబడి దేశముల్ దిరుగవలదు

ఎదురుగా నున్న వేళలయందు నేని
శాస్త్రులందుఁ బరుండుఁగరాదు సరిసి.

గురునిదేహంబుఁ దాఁకంగఁ గూడ దపుడు

చరణములు దప్పవిడి నమస్కారవేళ
అదియు నెపుడేని కాని ప్రత్యహముకాదు
దూరముననుండి మ్రొక్కుటే నొప్పుబుద్ధి

యంగ శుశ్రూష యని యంగలార్పవలదు

స్త్రీలు చేయంగఁదగినట్టిచేఁత గాదు
వృద్ధుఁడైనను దండ్రియటా బుద్ధిచేతఁ
దనయరీతిని దాఁకుట తప్పుగాదు

వ్యాధితుండైన నేదైన నవసరముల
నన్యసాహ్యాంబువలసిన యదనులందు
భావశుద్ధియెముఖ్యమే పట్టులందు

భుక్తికై యిమ్ము; కట్టఁగఁ బుట్ట మిమ్ము
వానికిని దేవపూజకు వలయునట్టి.
వాని సమకూర్పు నీచేత నైనవాని
ఫలములో పూలొ మఱియేవి వలసియున్న
ఆసనమమర్పు, పాత్రంబులమలపఱుపు

ఎంగిలిని దినఁబోకుమీ యెట్టివేళ

కలికి! యుచ్ఛిష్ట మనిన నెంగిలి యటంచుఁ
దెలివిమాలినవారలు పలుకుచుంద్రు
తపిలెఁ డన్నంబులోఁ గొంత తలఁగఁదీసి
తినిన మిగిలినదుచ్ఛిష్ట మనఁగఁ బడును.

వాతినీరంబు సోఁకిన వలదుముట్ట
పగులవదనగతంబును బలుకుచుందు
రెఱుకగలిగిన పెద్దవా రెంగిలనుచు
ఎంగిలి నిషిద్ధ మదియు నస్పృశ్య మమ్మ
తినఁగరాదని వేఱుకా ననఁగ నేల?

ఇంతి! తినకుమయాచార్య నెంగిలెపుడు
అన్య ముపభుక్త మేదైన నగును గానఁగ

అమ్మ! యుచ్ఛిష్టభోజి శేషాశనుండె
కాని యెంగిలి తినువాఁడు గాఁడు సుమ్ము.

భోగవస్తువుల్ సమకూర్పఁ బూన కెపుడు
మత్తునొసఁగెడి వస్తుల మాటదోల.

కామవిషయప్రసంగంబు గాదు సేయ
ఉండకుము స్త్రీలఁ బనియు లేకున్న వేళ
శీలహానికరంబులఁ జెప్పనేని

మొగమునను నుమ్మివేసి పోపొమ్ము దవ్వు
వలదు చూడంగ నాతనివదన మనల.
సాధుకార్యంబు నాతఁడు సలుపు నేని
సలుపు సాహ్యంబు నీశక్తికొలఁది తల్లి!

గురునిఁ గొలువుము బ్రహ్మంబుఁ గొలిచినట్లు
అతని పేరు జపింపు తదంఘ్రితీర్థ
మును గ్రహింపుము ధ్యానింపుము ననవరతము.

కులముతక్కువానిని గుణవిహీను
నియమహీనుని భ్రష్టుని నీతిహీను
మఱిసదాచారహీను నమాన్యశీలు
గురువటంచును నెప్పుడు గొలువవలదు.

పురుషులకు నన్వయించు పనుల నెల్ల
పనియుఁ బడెనేని తాఁకంగవచ్చు వాని
అంగశుశ్రూష చేయంగ నర్హమగును

గురువు శ్రమపడి గాసిలి కోరనేని.
చెప్పినది విని చేయుట శిష్యుఁ డయ్యె
సలుపరానివి దాఁచుట ఛాత్రుఁ డయ్యె
దరిని నుంటనంతేవాసితనముఁ గాంచు
ఇట్టి రీతఁడు తనువుండు నంతదాఁక
నంతదాఁకను సేవించి యంతమందు
బ్రహ్మపదమును బొందు శబరనిబోలె
చెప్పితిని మేలుకోలుపున శిష్యచరిత
వెండిసేటికి నిచ్చుట విస్తరింప.
సాధుగోష్ఠి లభింపనిసమయమందు
మౌన మూనుట యుత్తమమైన వ్రతము.
జనులకోలాహలము మాని చనుము దవ్వు
మూఁగనై యుండుమీ బీడుమూఁకలందు
ఇంటివారలతో నైన నంతమాత్ర
పనిగొను యూమాత్రమే నీవు పలుకవమ్మ
వాదమున కేగకమ్మ యెవ్వారితోడ
దైవవిషయంబునందు నేఁ బావనగుణ!
అనుభవజ్ఞంబు దైవమహత్త్వ మగుట
కంఠశోషణమున నేమి కార్య మగును
మననశీలుండ వౌనియూఁ గాన నీవు
మౌన మూనియెస్మరియింపుమా రమేశు.
ఎఱుఁగఁగోరెడివారికి నెఱుకపఱుపు

వాదమున గెల్వ వలె ననుపన్ను విడుము.
మాటలాడక కొందఱు మౌనుల మని
వ్యావహారికకార్యముల్ వ్రాయుచుంద్రు
కాలనష్టంబు కష్టంబు గాక యేమి
ఫలము లేదని యద్దానఁ దలఁపవలయు.

ధ్యానపరతకుఁ దగుఁగాని మౌనవ్రతము
తగవుమాలినయట్టి వ్రతంబు లేల
మాను లగుదురె మూఁగలు మౌను లేమి
ఇట్టి వ్రతమునకంటెఁ దా నెంతో మేలు
స్పష్టముగ హరికీర్తనపరతఁ గనుట

మనకు నిసుమంతసంబంధ మునగ నట్టి
వానిఁగూర్చి ప్రసంగింప మానినంత
సగము వ్యర్థప్రలాపంబు సమయు నిక్క!
కరము శ్లాఘ్యంబు సుమ్ము యే గాంధియుక్తి
శాస్త్రమైనమనశ్శాంతి సంభవించు.

అఖిలప్రాపంచికవ్యవహారములకుఁ
జచ్చుటం గాదె కొందఱు సంయములును
నట్టిఘోరతపంబుల గట్టిపడిరి
చిత్తమంతయు హరిమీఁదఁ నిల్పఁ గలిగి
విగుణమొందైనఁ గూఁకటివేళ్లతోడఁ
బెఱికి వైవంగఁ జాలనికోఱిక లెయ్యవి.

మంచిగుణ మెద దృఢపడఁ బెంచి పెద్ద
చేయ నేకారుచుండనిచే టొాకండు
వీనిచేఁ బుద్ధి మనమేమి వృద్ధిఁ గనమి

ఏటి కొాకదుర్గుణం బైన నేటఁ గలుప
సిద్ధులముగామె తల్లిరో! శీఘ్రముగ నె?
శ్రద్ధయును భక్తి దినదినవృద్ధి గాంచ
వింతయే సిద్ధి నొందుట యింతలోన.

పూనినప్పటియాసక్తి పూన్కి నిలదు
క్రమముగా నాఁడునాఁటికి క్షయముఁ గాంచుఁ
జిత్తదౌర్బల్యమున నదే చేటు మనకు.

ప్రథమమున నెంతకష్టమేః పడఁగవలయు
మనసును జయించుటందు నోమధురవాణి!

ప్రథమకష్టంబుతీఱ నావల సుఖంబు
గాఁగ లోపడు చిత్తంబు గాసి యిడక.

అధికకష్టంబు చుమి దురభ్యాసముక్తి
యంత నధికంబు మనసు జయంబు గనుట
స్వల్పముల నీవు గెలువంగఁ జాలవేని
బలితముల నెట్లు పూని గెల్వంగఁ గలవు

స్వల్ప మిది యెంత యనకు మేయవగుణంబుఁ
దొలుతను నసడ్డచేసిన బలియు నదియె
కష్టములు వచ్చెననుచును గలఁత పడకు

కష్టపడినను శ్రేయంబు గలదు చాల
నిన్ను నీవు విమర్శింపు నెమ్మనమునఁ
దెలివితేటలు దార్ఢ్యంబు బలము నోర్పు
తెలియఁగలవీవు కష్టంబు గలిగినపుడె
మనపరాధీనతయు బంధుజనులతోడు
పాటు కష్టసమయముల స్పష్టపడును
లోకవాస్తవతత్త్వ మాలోకిత మగు.
చిత్త మచ్యుతుపదములఁ జేరి నిలుచు
పొగరు సమయును వినయంబు పొందుపడును.

వినితివేనియు నపనింద కినియఁబోకు
మాత్మ శుద్ధంబ యేనియు నది యసత్య
మన్న సంతుష్టి గనియెద వాత్మయందు.

పరవశమె దుఃఖ మగు; స్వవశమె సుఖము
దీని నీవు విమర్శించి తెలివితోడ
విడు పరాధీనముల నెల్ల వెఱపులేక
ఆత్మవశములమాత్రమే యాదరింపు.

నిండుమది నీకు హరిమీఁద నుండెనేని
వాసుదేవుండె యొసఁగును వలయువాని

భుక్తి సృజియించి ముందుగ, భూతతతుల
నావల సృజించె బ్రహ్మ యక్లాట నీవు
తెలివిచెడి దేవురింపకు తిండికొఱకు.

శిశువు జనియించుటకు ముందె స్పష్టమయ్యెఁ
దల్లిచన్నులఁ బాలును దనివిదీర

ఎట్లుపుట్టించు మఱియెట్లు గిట్టఁగలనో
యట్లులే నుండఁగల వేల యటమటింప

లేదు స్వాతంత్ర్య మెందును లేశమైనఁ
గాఁగలది గాకమొ యెట్లును గాఁగలదియె.
కానిదేమియు నెట్లును గానియదియె
అంతమాత్రంబునకు నేల యారటంబు.

కూడుగుడ్డవిచారంబుఁ గూలఁద్రోచి
చేయుయత్నంబు భగవంతుఁ జేరుటకును.

తిండిపోతులు కొందఱు తిండినేమి
గల దటంచును దిందురు కడుపునిండ.
జిహ్వాకాచాపలంబునఁ జెనటితిండి

ఇంద్రియములను దిండి జయింపఁగలదు
శ్వాసమును గెల్వవచ్చును సౌమ్యభుక్తి
ఆసనము గెల్వవచ్చు నాహారశుద్ధి
రోగమును దుఃఖమును బోవు శుద్ధభుక్తి
ఆయువును సత్త్వ మారోగ్య మతిశయించుఁ
గఠినరోగంబు లైనఁ బ్రశమముఁ గాంచు
ధనము వమ్ముగఁ బోవమి దానధర్మ
దేవతాకార్యవితతులఁ దీర్పవచ్చు

బడుగులకుఁ బేదసాదల కిడఁగవచ్చు
పూతము మితంబు శుద్ధ మాహారభుక్తిఁ గొనిన.
తలఁపు లన్నియు బోడులై తనరకున్న
తలలు బోడులు నైనంత గలదె ఫలము?
అర్థములభుక్తిచే నింద్రియములు బలియఁ
గడుపు గాల్చిన మాత్రానఁ గలదెఫలము?
ఇంద్రియజయసాధనము గాదేనియదియు,
గాయమును శుద్ధముగఁ దోమఁ గలదెఫలము
చిత్తమును రాచి శుద్ధంబుఁ జేయకున్న.

నిత్య మానస మజ్జన నిపుణమతికి
నీట నిత్యము మునిఁగెడి నియమ మేల?

సతతనారాయణధ్యానసక్తమతికి
జపతపోయోగకర్మముల్ సలుప నేల?

నేల హాయిగ నిద్రించు నియతమతికి
మంచములదిండ్ల పాన్పులమూట యేల?

మానరక్షకుఁ జిన్నకౌపీనముండఁ
బెద్దదోవతులకు నేల ప్రియముపడఁగఁ

దొరకకుండునె యొకగోఁచి తెరువులందు.
మానవతు లెవరైనఁ గాపీన మిడరె

మారుతాహతి నాగోఁచి మాయమైనఁ
బైఁటలోఁ జించి యీయదే పార్వతమ్మ;

ఆశ్రమంబున నేనున్న యవసరమున.

గ్రామసంచారమును జేయుకాలమందు
తల్లులెందఱో యుడిరక్తి యుల్లమలర
ధర్మశూన్యంబు గాలేదు ధరణి యింక
పురుషు లేవేన పోకలం బోవుచున్న
జాతిమతనీతిధర్మముల్ చావు లేక
బ్రతికియున్నవి చుమి పుణ్యసతులవలన.

తైలధార యనఁగ భక్తి దనరువఱకు
నిత్యకర్మంబులనువీడ నీతిగాదు.

శౌరిచింతనచేసెడి సమయమందుఁ
గర్మభంగభయంబేది గలుగఁ బోదు
అన్నికర్మఫలంబులు నదియెకాన.
తీరమును జేరి నావలం దెప్పవేల
ఏటినడినీట నుండి నే నేలు దాఁటి
నాఁడ నని చెప్పఁ గాల్చినఁ గీడు కలదు.

కాయ మున్నంతవఱకును గర్మ ముండుఁ
గాన హరికార్యములె చేయఁ గడఁగు మెపుడు

ఫలము భారంబు నతనిపైఁ బాఱవైచి
బంధములఁ గాల్చి ముక్తిని బడయవచ్చు

దినముకాలంబు గనవచ్చు దీర్ఘమగుచుఁ
గాలమును వ్యర్థపఱిచెడి బాలిశునకు

దినముకాలంబు కొలఁగాఁగఁ గనఁగవచ్చు
భజనఁ గాలంబు గడపెడి భక్తునకును.

జగమునకు నెంతదవ్వగాఁ జనెద వీవు
అంతదాపుగ నుండుదు హరికి నెపుడు.

ఎంతలొచ్చుగఁ జూచు ని న్నిజగంబు
అంతహెచ్చుగఁ జూచుఁ జక్రాయుధుండు

పరులకంటెను బలియంగ వాంఛ వలదు
పరులకంటెను సిరిహెచ్చ వాంఛ వలదు
అన్యులను మించి సుఖియించునాశ వలదు
అన్యులను మించి భుజియింప నాశ వలదు
అన్యులను మించి కట్టంగ నాశ వలదు,

అన్యులను మించ నణఁకువ నాశపడుము
అన్యులను మించు నుపకృతి నాశ పడుము
అన్యులను మించ హరిసేవ నాశపడుము
అన్యులను మించ భక్తిచే నాశపడుము
అందఱను ద్యాగమున మించ నాశపడుము.

బలుపుచూడఁడు హరి మదిఁ దలఁపుఁజూచు
వలువచూడఁడు హరి భక్తివిలువఁ జూచు
కలిమిఁ జూడఁడు దీనులచెలిమిఁ జూచు
భక్తబాంధవుఁ డగురామభద్రవిభుఁడు.

వెలికి నున్మత్తురీతిని వెఱ్ఱిరీతి

బాలువిధమునఁ జిరియింపవలయుసుమతి
అంతరంగంబునఁ జ్యోతి యంతకంత
మసక లేకుండఁ జూడు ప్రమాద మెడలి

అమ్మ! చాలింపునిద్ర చేనైనవలుకు
మాను మీవు పరాకు సోమరితనంబు
వ్రాయుమీ గ్రంథములను శ్రీరామకోటి
సలుపుము తపంబు ధ్యానంబు జపము నైన
చేయు లోకోపకృతికి నేచేఁత నైన
గోష్ఠి నుండుము సద్భక్తకోటితోడ
వినుము చదువుము వినిపింపు విష్ణుకథలు
అంతియే కాని నిమిషంబు నైన నీవు
వ్యర్థపఱుపకు సోమరివగుచు నెపుడు
భర్తృశుశ్రూష కివి యడ్డపడఁగరాదు.

ప్రజల కేరికి సంబంధపడనియట్టి
సాధనంబుల బయలందు సలుపరాదు.
సలుపవలయు రహస్యంపుఁదలమునందు

జనములకు మేలు గలిగెడి సాధనముల
బాహిరంబుగఁ జేసిన భయము లేదు
గాని దంభార్థమునకునై కాదుసేయ.

పట్టుదల యోపికయు నోర్పు భక్తి శ్రద్ధ
కలుగ నేకార్యమందైన ఫలము గలదు.
తలఁచినంతఫలంబును దలఁచినంత

వేగ లభించకున్నను విసుఁగుపడకు.
వెతలనొందకు హరి చేయిపీడె ననుచు.

అట్టిఫలమున కర్హత యబ్బలేద
టంచు శ్రమియింపు దాని కనన్యపరత
నీకు యోగ్యత కలిగిన నిమిషమైన
దానిఫల మీయ దేవుండు తడవుకొనఁడు

సత్య మిది సత్య మిది యిది సత్య మమ్మ
మనదె లోపంబు నిందింపఁజనదు హరిని
సాధనము దినదినమును సలుపవలయు
నితరకార్యంబు లున్నను నెన్నియేని

ఒక్కదివస ముపేక్షించి యుంటివేని
పెక్కుదినములు పట్టును జక్కఁజేయఁ
జేయి జాఱిన దారపుఁజెండువోలె

వదలి యుండకు మేకాంతవాసనియతి

నిన్ను శోధింపు మీ నీవు నిపుణమతిని

దొలఁగఁ ద్రోయఁగ వలసినదుర్గుణముల
సాధనముచేయవలసినసద్గుణముల
నెన్నిత్రోచితో గెలిచితో యెన్ని వాని
వరుస లెక్కింపు నిష్పక్షపాతబుద్ధి.

భక్తి శ్రద్ధ విరక్తియుఁ బరమదయయుఁ

గలుగఁజేసెడిగ్రంథముల్ వలయుఁ జదువ
నర్థమే బోధపడనివేదాంతములను
నాచరింప నసాధ్యమగా నట్టిక్రియలఁ
గాలమును వ్యర్థపఱుపఁగఁ గాదు నీకు

మనసు తనయందు నిలిచెనా? చనెనె వేఱు
ఫలముఁ గాంక్షించి వేర్వేఱుబాటలందు
వేఱువేల్పులఁ గొలువంగ వెకలి యగుచు
ననుచు వీక్షించునే కాని వనజపాణి

నీవు వేదాంతినివె యంచు నీవు యోగి
నీవె యటంచును నడుగఁడు నిన్ను శౌరి
వలదు హఠయోగలయయోగవైభవములు
వెఱ్ఱివేదాంతముల నైన వినఁగవలదు

చెప్పుచున్నాఁడ మేలైన చొప్పు నీకు
గలుగదు శుభంబు హరియనుగ్రహము లేక
భక్తి లేకున్న నది లభ్యపడదు నిజము
ముద్రలును వెఱ్ఱివేదాంతములును మిగుల

వ్యర్థములు హానికరములు వలదు వినఁగ
పడఁగవలయును దానికై పాటులెన్నొ
వానిఁ దెలిసినపురుషుండు గానరాఁడు
ఉబుసుపోకకు వదరుచు నుందు రంతె

నీవు బ్రహ్మంబు బ్రహ్మంబు నేను బ్రహ్మ
మఖిల మనుచును వదరుట యంతెగాక
వాస్తవంబుగ నది యనుభవములేదు.

విమలమతి గాక శిశ్నోదరములకొఱకుఁ
బరుల వంచింప నారీతిఁ బలుకుచుంద్రు
వెఱ్ఱివేషంబులను వేసి వేఱుగాడు

సదమలంబైన హరిభక్తి కుదిరియున్న
వ్యర్థములె తక్కినవియన్ని యమలచరిత
విను పతంజలి పల్కినవిధము గాఁగ
యోగమును నభ్యసించుట యొప్పు యగును
గాని తక్కినయవి నేర్వ హానిగలదు.

రిక్తమహిమల ముక్తియు హత్తఁ గలదె?
అదియు సాహాయ్యమున కని యాత్మ నిలుపు.

భర్త యెవ్వండొ యెవ్వతె భార్య యనఁగ
వానికిని నీకు నేమిసంబంధ? మేటఁ
గట్టెతోఁ గట్టె కలిసిన కరణిగాదె?
బ్రహ్మ మేనును నీవును బ్రహ్మ మగుట.
ద్వైతభావంబు మనలోనఁ బనికిరాదు.
పండుకొందము రమ్మని పలుకుశుంఠ
శుష్కవేదాంతులను నీవు చూడఁబోకు.
గుడిసెవాటులకును వారు గురులు మగలు.

అన్నము నమేధ్యమును దినుచున్నవారె ?
బ్రహ్మభావన సమమని భ్రాంతివిడిచి
వారియాండ్రను దల్లులుఁ బరపురుషుల
ప్రక్కఁ బండఁగ నోర్తురే బ్రహ్మబుద్ధి ?
పరులబిడ్డలఁ బడఁద్రోచి బావియందు.
వేడుకలు చూచి నవ్వెడివిధమె కాక.
పెండ్లి పెండ్లని విధవలపెండ్లివోలె
మతము మతమని నెపమిడి మనసు దీర
వారితోడ సంభోగించు వాంఛయున్నఁ
గన్నకసుగాలమును దినుకాంక్ష యున్న
నట్టిముండలు పోయిరా యరుగ నిమ్ము
దాన మోక్షంబు కలదని తలఁపవలదు
సాధ్వులావంకఁగననైనఁ జనఁగరాదు.

గురుఁడె దైవంబు దైవంబె గురుఁడు నిజము.
కానటంచును బలుకను గాని గురుఁడు
జనకుఁడును మామగారును సములు గారె
కూఁతురును శిష్యురాలును గోడ లొక్క
వరుసవారలు గారొకో యరసి చూడ
న్యాయ్యమా వారితోడి యనంగ కేళి ?
కచుని-చరితంబు వినలేదె గాథలందు ?

హేయ మగుకాయమును గామదృష్టిఁ జూచు
పరమనిర్భాగ్యుఁ డగ్వాఁడే గురుఁడు గాఁగ

వాఁడుచెప్పెడిదానిచే ఫలముగలదె?

శీలమున సాధ్వి లేనాఁడు చెడఁగరాదు.
కలధనం బెల్ల గురునకుఁ గానుకిమ్ము
అంతభక్తియు శ్రద్ధయు నమరియున్నఁ
గాదటంచును బలుకను గాని తల్లి
బ్రతికియుండినఁ జచ్చిన భర్త దాను
భార్యదేహంబు పరులంటఁ బాడిగాదు.
తల్లిదండ్రు లొసంగిరి దానముగను
దన్ను భార్యగ నగ్నిహోత్రంబు గురులు
సాక్షులుగ నట్టిదాని నేన్యాయమునను
బరునకీయంగఁ దగు భర్త పనుపులేక?

అగుట చిత్రంబె దత్తాపహార మిదియు.

జన్మజన్మంబునకు వేఱు జనని జనక
పుత్రికా పుత్ర సోదరుల్ పొలుచుచుంద్రు
మాఱరోయమ్మ యెన్నిజన్మంబులైన
భర్తయును భార్యయును నిది వాస్తవంబు

భార్య మున్నేగె నేనియు భర్త వచ్చు
దాఁక స్వర్గాన వసియించుఁ దరలిపోక
కలిసియిర్వురు నిట్లు నాకంబునందుఁ
బుట్టుచుందురు వెండియు భూమిమీఁద
నెచటఁ బుట్టినదాంపత్య మెసఁగు నచట.
పోవుచో బాటసారివై ముల్లెయొకటి

కానవచ్చిన నీకేది కార్య మమ్మ
చౌర్యమగుఁ గాదె నీవది సంగ్రహింప
హాంతిగానికి నీయరే శుద్ధమతులు
వాఁడు దెలియంగరాకున్నఁ బ్రభులయొద్ద
నీయరే యుట్లుగాదోకో యింతులందు.

పరులసొత్తును హరియింపఁ బాడిగాదు
భర్తయుండిన లేకున్నఁ బాపమొదవు.
అన్యపురుషుండు కామేచ్ఛ నంటసతిని
భక్తిహీనతఁ గొండంత పైఁడి యిడిన
మనసులో సంతసింపఁడు మాధవుండు
భక్తితోడుత రవయంత పత్ర మిడిన.
మిగులసంతోషపడును లక్ష్మీధవుండు.
సత్యభామయు రుక్మిణి సాక్షు లమ్మ!
పరులు నీదోషముల నేఁపవలయు ననిన
నేఁపవలయును బరులదోషంబు లీవు.
సత్రమున బాటసారినా సంచరింపు
మననిపై నీవు బాగొంద నాశయున్న
మనస్ప్రతంబులు మననిష్ఠ మనతపంబు
చింతనము సేయ మదిలోన సిగ్గు పొడము.
పూర్వఋషులను భక్తులఁ బోల్చిచూడ
పండ్లకొలఁదులు పస్తుండి హింసపడుచు

దారుణాటవి నేకపాదమున నిలిచి
వశముపడఁ జేసికొనిరమ్మ వాసుదేవు.

క్షుద్రవస్తుసంపన్నత గొప్ప మనము
భవ్యదైవదయాలబ్ధి వారు గొప్ప
బయట నెంతెంతగుణశాలిఁ బ్రజలు మెత్తు
రంతరంగాన దానికి నతిశయింపు

అంతకును హీనురాలవై యమరవలదు

మనుజులకు రెండుకన్నులుమాత్ర ముండు
వేయికన్నులవాఁడమ్మ విశ్వవిభుఁడు.
జనులు కానంగలేని వాఘనుఁడు చూచు

వాఁడు మెచ్చఁగ బనిసేయవలయు మనము

ఎంతయారంభశూరత్వ మీవు బోలుతఁ
బూనెదవొ దాని మించుమీ పూఁటఁబూఁటఁ
దగ్గిపోవంగ నీకు నుత్సాహ మెపుడు

ప్రతిదినంబును హరిమ్రోలఁ బలుకు మిట్లు
"నిన్ను నారాధనము సేయఁ బూని నేను
ఇట్టివ్రతమును బూనితి నిందిరేశ!
నాదుసంకల్పసిద్ధికై నాదుపూన్కి
పూర్ణముగ నెఱవేఱంగ బుద్ధి నిలుపు"
ఈక్రియల్ విఘ్నపఱుప ననేకరాగ
శుభము, లచ్ఛేద్యము లనా ద్యశుచులు పాప
కర్మములు వైరు లౌచు విఘ్నంబు సలుపు

వాని నన్నింటి నణంచి స్వభావకృపను
నాదుకోరిక నెఱవేర్పు నలిననేత్ర!
నీదుబలమును నీతేజు నీమవీర్య
గరిమ నాయందు నొకకొంత గలుగుకతన
నీదు పూజావిధానంబు నే ఘటింతుఁ
గేవలము కృపచేత నంగీకరింపు.

మఱిఁ దలంపుము యీరీతిఁ బ్రతిదినంబు
అయ్యయో నిన్న యెంతయో వ్యర్థమయ్యెఁ
గాల మీశ్వరుఁ గొలువక కాన నేఁడు
కొలుతు నిన్నటికంటెను గొప్ప గాఁగ
ననుచు హరి సేవ సలుపుమీ యమలమతిని

ఇంతవఱకును జేసిన దేమొ లవము.
ఇంకఁ జేయంగఁ దగినది హెచ్చు గలదు.

అనుచు స్మరియింపు మీలోన దినము దినము
వార్త కల "దతి సర్వత్ర వర్జయేత్త"
టంచు నది యనుష్ఠింపుము హరి సపర్య
కూడు గుడ్డయు నిద్దుర కొంప ధనము
సర్వమును వీడి హరిసేవ సలుపవలయు

ఏమి పనిచేసినను మది నెంచు మిట్లు

అన్నివిధముల నాకు నియంత యగుచు
నన్నిగతులను దనదాస్య మభిలషించు
నట్టి నాచేతఁ దనసాధనాళు లైన

యింద్రియంబులచేఁ బరమేశ్వరుండు
తనదునారాధనమె ప్రయోజనముగాఁగఁ
దనదుప్రీతికిఁ జేయించుకొనుచు నున్న
వాఁడు కైంకర్య మిద్దాని స్వయము గాఁగ
ననుచుఁ గావింపవమ్మ యేఁపనులనైన
అమ్మరో! సాత్త్వికత్యాగ మండ్రు దీని.

కొంచె మైనను హరిసేనఁ గొఱంతవలదు
ఎంతకష్టించి చేసిన నంత మేలు
పరుల మేలున కో, స్వామిపనులకొఱకొ
యరుగుటను నీయనుష్ఠానమందు విఘ్న
మొదవె నేనియు వ్యసనంబు నొందవలదు.
సలుపఁగా వచ్చు మఱుదివసమున దాని

విసుఁగు చేత నసడ్డచే విషయకాంక్ష
నలసత నుపేక్ష చేసినఁ గలుగుఁ గీడు.

అనుదినంబును భగవంతుధ్యానమునకు
నీకు ననుకూల మగు వేళ నిర్ణయింపు
మట్టి సమయాన నన్యకార్యంబులకును
బోక యుండుము నీపుట్టి మునుఁగుచున్న
జనులోపలఁ దిరుగంగఁ జనకు మెపుడు
ఆటలకుఁ బాటలకు నెప్పు డరుగవలదు
పామరులతోడ నుబుసాడ వలదు వలదు

వ్యర్థభాషణముల నెప్పు డాడ వలదు
ఒక్కనిమిషంబు పనిలేక యుండవలదు
శాపిలోపలఁ బడి నేను బాధపడఁగ
నీఁదులాడ నుపన్యాస మిచ్చు నొకఁడు
జలములం దీఁదనేర్పుపుస్తకము వైచు
నొకఁడు త్రాటిని గంప నొక్కరుఁడు నొకఁడు
నిచ్చెనయు వేసె నొక్కఁడు నిపుణుఁ డొకఁడు
తటుకుననను నీట దూఁకి యాధార మగుచు
మేదిని వరాహమూర్తినా మీఁదికెత్తి
యొడ్డుచేర్చె నటంచెంచు ముల్లమందు.

వందుఁ డెవ్వాఁడో నాకీవె పలుకవమ్మ
వాస్తవంబుగఁ గడపటివాఁడు కాఁడె?
అట్టిలే మనహృదయంబులందు నిలిచి
మనకు నాధార మగుచు సంసరణ వార్ధి
నుండి మనలను జెడనీక యుద్ధరించు
నట్టికరుణాళుఁ దలఁపక యన్యమార్గ
గామి యగువానికంటె మ్రుక్కడియుఁ గలఁడె.

## —పదార్థ వివేకము—

సరవిగాఁగఁ బదార్థసంజాత మెల్ల
మెలఁత రో ప్రమాణ మనఁగఁ బ్రమేయ మనఁగ
ద్వివిధ; మందుఁ బ్రమాణంబు త్రివిధ మగును.

జననీ! ప్రత్యక్ష మనుమాన శబ్దము లనఁ
గొఱలుఁ బ్రత్యక్ష మింద్రియగోచరంబు
అదియు శోధింప సవికల్ప మనగనిర్వి
కల్ప మనఁగను ద్వివిధమై కానిపించు.

ఊహ యనుమాన మగుఁ బొగ యుండఁ జూచి
నిప్పు కలదని యూహించు నిపుణబుద్ధి
వేదమే శబ్ద మనఁగను; వీనిచేతఁ
దెలియఁబడిన ప్రమేయంబు ద్వివిధ మగును.

ద్రవ్య మద్రవ్య మని, యందు ద్రవ్య మయ్యె
జడ మజడ మంచు రెండుగా; జడము ప్రకృతి
కాల మంచును ద్వివిధమై కానిపించుఁ

బ్రకృతి కిరువదినాల్గు తత్త్వములు కలిగె
వఱలుఁ గాలంబు భూతంబు భావి వర్త
మానమనఁ గను ద్రివిధంబు వానిలోనఁ

గడచిపోయినయది భూతకాల మయ్యె
భావి రాఁబోవుకాలంబు వర్తమాన
మయ్యె నప్పుడు జరిగెడునట్టిదైన
ద్రవ్యసంతతి యిదియు, నద్రవ్యమునకు
సత్త్వరజములు తమమును స్పర్శరూప
శబ్ద రస గంధ సంయోగ శక్తు లనఁగ
బిడ్డలాదవిరి సుమి పదివిధములుగను.

అచిదము పరాక్కు ప్రత్యక్కు ననఁగ నొప్పు
పొగలును బరాక్కు నిత్యవిభూతి మఱియు
ధర్మభూత సుజ్ఞానప్రథఁగ ద్వివిధము.

వినుము ప్రత్యక్కుసంతానవిధము నింక
జీవుఁ డీశ్వరుఁ డన నది చెలఁగుచుండు.

మూఁడు విధములజీవులు పొలుచుచుంద్రు
వరుస నిత్యులు ముక్తులు బద్ధు లనఁగ

బద్ధులను రెండు తెగ లొప్పు వారి వినుము.
పొలుచుచుంద్రు బుభుక్షు ముముక్షుసంజ్ఞ.

భోగమునఁ గోర్కె కల్గి బుభుక్షులైరి

మోక్షకాంక్షను గల్గ ముముక్షులైరి

వారిలో ధర్మకామైకపరులు ధర్మ
పరు లటంచు బుభుక్షువుల్ పరఁగుచుంద్రు

ధర్మపరులందు ద్వివిధంబు దనరుచుండు
దేవతాంతరపరు లని తెలియ భగవ
దేకపరు లని కామ్యంబు లిచ్ఛగించి
క్షుద్ర దేవతలను భక్తిఁ గొలుచువారు
కామ్యములఁ గోరి శ్రీకాంతుఁ గాక గొల్వ
రన్యులను భగ,వత్పరు లైనవారు

ఆలకింపు ముముక్షువులందుఁ గలుగు

వాసి నింకను గైవల్యపరు లనంగ
మోక్షపరు లన ద్వివిధంబు మొనయుచుండుఁ
బరఁగు ద్వివిధంబు భక్తిప్రపన్న భేద
ములను మోక్షైకపరులందు ముగుద వింటె.

అలప్రపన్నులయందు నేకాంతు లనఁగ
నబల మఱి పరమైకాంతు లనఁగఁ గలరు.

రెండువిధముల వారందుఁ దృప్తు లనఁగ
నార్తులనఁ బరమైకాంతు లైరి తల్లి!

అనుభవించుచునిందుఁ బ్రారబ్ధ మోర్వ
దేహపాతంబు దాఁకను దృప్తుఁ డగును.

కారుచిచ్చునఁ జిక్కిన కరణి దేహ
సంగతిని నోర్వఁజాలక క్షణము యైన
నెప్పుడెప్పుడు హరి కన నేగువాఁడ
నని తపించుచుఁ దహతహ వనట గుడువఁ
దీవ్ర వేదన దేహంబు దీఱనేని
యట్టివాఁడార్తుఁ డందరు న్యాసవిదులు.

అందుఁ దృప్తుండ నైతినే నార్తిలేమి
నంత మాత్రమ నామీఁద హరికిఁ గరుణ.

యిప్పటికి నెంతయేడ్చిన హెచ్చు గలదె?
ఎప్పటికి నైన వచ్చునా శ్రీశుకరుణ

యింతకంటెను హెచ్చుగా సంతసింతుఁ
జెప్పవే లోకమాత యోసీత జనని
ఏడ్వఁగా నైన నాచేత నేమికాదు.
కన్నులను నీరుగాఱు కరఁగ దెపుడు
చట్టుబండగ హృదయ మేనెట్టు లేదు
దేనికిని గొఱగానట్టి దీనజనుఁడ
దిక్కుమాలినవాఁడ నాదిక్కుగమ్ము
పాపములఁ బడువాఁడఁ గాపాడవమ్మ
అన్నివిధముల బాధించునసురసతులఁ
గాచి తేఁట నన్నుఁ బుత్రకుఁ గావలేవె
కన్నబిడ్డను ద్రోచెదే కాల నగ్నిఁ
గన్నులారంగఁ జూచెదే కాలిపోవఁ
గఠినచిత్తవు నీవెప్డు కావు కావు.
నే నెఱుంగుదు నీమదిఁ గానఁ గాదె
నిర్భయత సంచరించెద నిఖిలజగతి
నీవె వస్తువు నన్నాత్మ నీవె యంక
తలమునం జేర్చి కొనిపోయి దయదలిర్ప
నీమనోనాథు చేతిలో నెమ్మనిడఁగఁ
గలవు సత్యమ్ము సత్యమ్ము కల్లగాదు.
ఇంక నీశ్వరతత్త్వము నెఱుకపఱుతు.
అదియు నైదువిధంబులై యమరియుండు
నందుఁ బర మేకవిధమయి పొందియుండు

యింతకంటెను హెచ్చుగా సంతసింతుఁ
జెప్పవే లోకమాత యోసీత జనని
ఏదయ్యెఁగా నైన నాచేత నేమికాదు.
కన్నులను నీరుగాఱుచు కరఁగ దెపుడు
చట్టుబండగ హృదయ మేనెట్టు లేద్దు
దేనికిని గొఱగానట్టి దీనజనుఁడ
దిక్కుమాలినవాఁడ నాదిక్కుగమ్ము
పాపములఁ బడువాఁడఁ గాపాడవమ్మ
అన్నివిధముల బాధించునసురసతులఁ
గాచి తఁట నన్నుఁ బుత్రకుఁ గావలేవె
కన్నబిడ్డను గ్రోచెదే కాల నగ్నిఁ
గన్నులారంగఁ జూచెదే కాలిపోవఁ
గఠినచిత్తవు నీవెప్డు కావు కావు.
నే నెఱుంగుదు నీమదిఁ గానఁ గాదె
నిర్భయత సంచరించెద నిఖిలజగతి
నీవె వస్తువు నన్నొత్తి నీవె యంక
తలమునం జేర్చి కొనిపోయి దయదలిర్ప
నీమనోనాథు చేతిలో నెమ్మనిడఁగఁ
గలవు సత్యమ్ము సత్యమ్ము కల్లగాదు.
ఇంక నీశ్వరతత్త్వము నెఱుకపఱుతు.
అదియు నైదువిధంబులై యమరియుండు
నందుఁ బర మేకవిధమయి పొందియుండు

## -సృష్టి హేతువు-

భూతసృష్టికి నేమొకో హేతు వనుచు
గొప్పసందేహ ముదయించెఁ గూ ర్మిజనక
ఏల యీరీతిఁ గొందఱ హింససేయ
వ్యాధులను బాధలను బేదవారిఁ జేసి
కొందఱకు సిరి సంపద కూఱఁ జేసి
సౌఖ్యముల నోలలాడంగఁ జలుప నేల?

సర్వసముఁ డైనయతనికి సలిపినారె
కొంద ఱొకమేలు, కీడును గొంద ఱెందు
పక్షపాత, మన్నా మె, భగవంతునందు?
ననుచుఁ బ్రశ్నింపఁ దండ్రి యిట్లనియె సుతకు.

జీవులకు నుపకృతి యనిచెప్పె వ్యాస
జనకుఁ డంచును మున్ను నే ననిన వాఁడ.
లేమ యీసృష్టియంతయు లీల యనుచు
బాదరాయణమౌని యె పలికినాఁడు
దానిఁ గాదని పలుకఁగఁ దలమె నాకు?
కేళి యననాట యనఁగను లీల యగును,
అవనిపతి వేడుకకు బంతి యాడునట్లు.
తనదుసంతుష్టి కీరీతిఁ బొనరఁజేయు
బంతి నిర్జీవమాటను బాధలేదు.
మనకు నట్లానె చెప్పుమా యనెదె పిల్లి
కగుతఁ జెల్లాటమెలుకకుఁ బ్రాణహింస

గాదె నారాయణుం డంత కరుణలేఁడె.
యనదె? వినవమ్మ తెలిపెద వినిన తెలుఁగు
దేవుసంకల్ప మెవ్వండు తెలియ నేర్చు
దేవుఁ డొక్కండె శక్తుండు తెలియ దాని
జ్ఞానబలశక్తులును క్రియాశక్తి గలవు.
బ్రహ్మమున కని నిగమముల్ పలుకుఁ గాదె.
సంతతక్రియారతి క్రియాశక్తి యయ్యె
నలసుఁడై యుండఁ డొకనిమిషార్థ మైన
నదియుఁ గాక 'రసోవైస'యనుట కతన
మఱియు 'నానందయాత్రియర్' మాటవలన
ననవరతము నానంది యగుచు నుండు
కాన నానందకరమైన కార్యతతిని
సర్వదా చేయుచుండుట శస్త్రమయ్యె
హరి'స న రమేత, ఏకాకి' యనును శ్రుతు లు
చాన! యొంటిగఁ గ్రీడింపఁ జాలఁ డతఁడు
కాన రెండవక్రీడనకంబు వలెసెఁ
దాను గాకన్య మగుపదార్థంబు లేదు
కాన సంకల్పమున సృష్టికలుగఁ జేయు
నిలువఁ జేయును మఱియును దొలఁగఁ జేయు
ప్రకృతిలోఁ జొచ్చి వివిధముల్ వికృతవేష
ములను ధరియించి యాడుజీవులను గలసి

లలన! భగవంతు డిచ్ఛాబలంబుచేత.
అమ్మరంగుల రాట్నంబునందు నీవు
బిడ్డ నొడిలోనఁ గూర్చుండఁ బెట్టికొనుచుఁ
దిరిగినట్లుగ భావింపు, తిరుగు వేళ
భయముపడి యేడ్చు బిడ్డండు ప్రాపుగాఁగఁ
దన్ను నీవటు బిగఁబట్టియున్న నైనఁ
నీదుప్రాపును నీశక్తి నీదుకరుణ
రక్షకత్వంబు దెలియక శ్రద్ధలేక.
అట్టిబిడ్డలవంటివా రమ్మ జనులు
ప్రకృతియే యగు రంగులరాట్న మమ్మ
దైవముఁ దలంపుమీ బిడ్డతల్లి గాఁగ.
ఇపుడు నిందింపు తల్లి నీయుచ్చకోలఁది
కల్ల లోయమ్మ' సుఖము దుఃఖంబు కూడ
నెంచుమీ యొండు సుఖమె కల్గించుదాని
నెన్నుమీ యొండు దుఃఖంబె యిడెడుదాని
లేదు లేదమ్మ జగమున లేదు లేదు.
ఒక్కదానినె యొకవేళ నుల్లమందు
నుబ్బుదువు సౌఖ్య మని మఱియొండు వేళ
దానినే దుఃఖ మనుచు సంతాపపడెదు
ఎండ యొకవేళ సుఖదమై యొండువేళ
దుఃఖ మయి నీదుమదికిని దోఁచుఁగాని

యెండ యెండయె యేవేళ నేని గాని.

ఎండ నీవు సుఖం బని యెంచువేళ
నన్యుఁ డొక్కఁడు కడుదుఃఖ మనుచు నుండు
ఏగుణంబున్నదో చెప్పు మెండ యందు

కాన భగవంతుఁ డిడఁడు దుఃఖంబునైన
సౌఖ్య మైనను జీవికి; నముఁ డతండు
తండ్రిముసుఁగిడి తనచిన్నతనయు నెదుట
వికృతరవమును నెసఁగింప వెఱచు నతఁడు
తండ్రి యెం దేగెనో వచ్చె దయ్య మనుచు.
నేడ్చు నోనాయనా యని యెఱుఁగ లేక.
ముసుఁగు దీసిన నమ్మును ముదముతోడ.
నేమి యున్నది ముసుఁగునం దెఱుఁగఁ జెపుమ.

ఎట్టికీడును లేదని యెఱుఁగు తండ్రి.

భయము పెట్టిన యాతఁడే నయముతోడ
నెత్తి ముద్దాడు ఱొమ్మున కొత్తికొనును.

కాన భయపడుటయు మేలె కలుగ, జేసె;

మూఁడు నాలుగుమాఱు లాముసుఁగు చూప
వెఱపు లే కది క్రీడగా నెఱుఁగు శిశువు.

ప్రకృతి యనియెడి ముసుఁగిడి వికృతవేష
హారియై శౌరి నాటకం బాడుచుండ.
వారివారిమనస్థ్సితి వారువారు

సంతసింతురు దుఃఖింత్రు స్వాంతమందు.
దానఁ గల్గు నపాయంబు గానరాదు.
ఎప్పు డిది యెల్ల నాట యుంచెంచెదీవు.
నాయనా యని బిగ్గ వాపోయెదవు.
సేఅను దొలఁగించి తోఁచును దేవుఁ డెదుట
నట్టిపుణా మంది యూవల హర్ష మొదవు.
ప్రకృతిముసుఁగునకును నీవు భయము వశము
మరల మరలను బడకుండు తెరువు లెన్నొ
యన్ని యూహించి విడుచు దయామయుండు.

ఆట యదియూన? యద్దాన హర్ష మున్నె
సేఁకరీతిని సర్వదా మెసఁగనేని

కాన భగవంతుఁ డాడించుకరణి నీవు
నాడుమిూ సంతసమున నాయాసపడకు

డాన నాతండు హర్షించుఁ దథ్యముగను.

గవ్వలాడెడి వేళలఁ గాయ లేవి
చావకుండిన నద్దాన హర్ష మున్నె
చచ్చినవి యెల్ల మఱి మఱి వచ్చుచుండుఁ
బండునందాఁక! నావల భయము లేదు.

కాన జీవాత్మ లెల్లను గాయ లనుచు.
నాడునాతఁడు జీవాత్మఁ డనుచునమ్మి.
యతనిసంప్రీతికొఱకునై గూాతఁడెట్టు

లాడఁ జేయునో యటులాడు మడల వలదు.
ఆడినంతనె మనకేమి కీడు లేదు
భేదభావంబుచే నిట్టివెతలు గలుగ.
ఆత్మయంశంబు పరమాత్మయంశి యనుచు
నైక్య మెదఁ దోఁప వెతలు లేవమ్మ మరల.
అన్నిశ్రుతులు బహుస్యా మటంచుఁ బలుకు
నేనె బహురూపి యగుదు నంచెంచికొనియె.
బ్రహ్మ మాతఁడె యటులయ్యె భద్రచరిత
ఇట్టిచో మనమెవ్వరో యెవఁడొ యాతఁ
డనుచు నైనఁ దలంపుమీ వ్యథదొలంగు
కాలిపై జిలయెత్తినఁ గేలుపోయి
గీఁచినంతనె న్యాయ్యమా కీడుపలుకఁ
గేలిమీఁదను కాల్ కాలె కీలు కీలె.
యైన నేమమ్మ చెడియెనే యైక్య మింక
దీర్ఘముగ దీని యోజించి తెలియవలయుఁ.
గాని యిటువంటి వ్రాఁతలఁ గాదు తెలియ
తెలిసినను మది నాటుట సులువు గాదు.
ఆత్మయును జీవుఁడును భిన్నులైన మాత్ర
భయముపడఁగను నేటి కోభామ చెపుమ.
వెలదిఁ నీబిడ్డఁడును నీవు వేఱయైన
వెలఁది నీభర్తయును నీవు వేఱె యైన

వారికిని నీవు భయపడవలెనే చెప్పుమ?

ఆపదల నిన్నుఁ గావరా యతివ వారు.
నీవు చేసిన శుశ్రూష నేటఁ గలిపి
మేలు మఱపొంది కరుణను గాలద్రొచి
కడుఁ గృతఘ్నులు నొచ్చును గష్టపడెడి
నిన్నుఁ గనుఁగొని యూరక నిలువఁగలరె?

ఏది యేమియు నీదాసి కెడరు గలుగ
మిన్నకయ చూచుచుందువే మెలఁత చెప్పుమ.

అమ్మ! నీమాత్ర మైన వాత్సల్యజలధి
పరమకరుణాళుఁ డౌభగవంతుఁ డాత్మ
సేవకులకును దగుమేలు చేయలేఁడె.
ఒక్కటిరెండొ నీకేల యుత్తచింత?
నీవె శరణం బటంచును నిర్మలమతి
శరణు చొరవమ్మ సర్వంబు చక్కఁబడును.

## దైవసంకల్పము.

అన్నిటికి దైవసంకల్ప మనెద వీవు
సృష్టి స్థితియును విలయంబు నిచ్ఛ యనెదు.

ఏమిసంకల్పమన? నది యెట్లు హేతు
వయ్యె సర్వంబునకుఁ? దెలియంగఁజెప్పుమ,
అనుచు నడిగెడితనయకు జనకుఁ డనియె.

దైవసంకల్పరీతి నాతరమె తెలుప

నయిన నీకును దెలియంగ నయినరీతిఁ
గొలఁదిచేఁ జెప్పువాఁడను గొప్పదాని.

అమ్మ! యేకాంతముగను నీవలరువేళ
నుబుసుపోకకు నాటకం బొండు వ్రాయఁ
దలఁచి దానికిఁ దగినపాత్రముల నెల్ల
సంవిధానంబుఁ గావించి చతురరీతి.
నెట్టిపాత్రం బదేరీతి నెట్టివేళ
నెట్టులాడంగ వలయునో యితరపాత్ర.
లెట్లు చరియింపవలయునో యిన్ని నీవు
కల్పితముచేసి నీమనః కలన నాట
కంబు నెల్లను నాడించి గాదె పిదప
వ్రాయఁ బూనెదు కలమెత్తి పలుకవమ్మ.

పాత్రలెల్లరు నీకుఁ గన్పడుచు నుండ్రు
తిరుగుచుందురు నీయిచ్చ నరణిఁ గాదె
కల్లయో సత్యమో యది కలికి! పలుకు

నీవు కల్పించుపాత్రముల్ నీమనఃప
దార్థమునఁ గాదె కలిగె యథార్థముగను.

నీమనము సూక్ష్మప్రకృతియై నెగడుఁగాదె

స్థూలప్రకృతియె దేహంబు సూక్ష్మప్రకృతి
మనసు; దానికిఁ దగినసాధనములు లున్నఁ
గాయమును జూచినట్టులే కనఁగవచ్చు.

ప్రకృతిశాస్త్రంబు శ్రుతులును బలుకు నిట్లు
త్వచ్ఛరీరస్థ పరమాణుతతులచేత
నఖిలపాత్రముల్ ఘటితంబులైన కతన
అన్న! చెపు మిన్న నీయంశమగునో కాదో
త్వన్మనఃకల్పితంబు లాపాత్రతతులు.
మన సచేతన మగుట నీమతిని గలదె?

చేతన సహాయమున నది చెలఁగుఁ దిరుగు

కాన నీపాత్రములు దిరుగంగవలసి
యున్నఁ జైతన్యమునుగూడి యుండవలయు

గల్లొ సత్యంబొ నీమనఃకల్పితంబు
పలుకవే లెస్స యోజించి స్పష్టఫణితి

సత్యమేనియు నీ వవి సత్యములగు
కల్లయేనను నీ వవి కల్లలగును.

నీవు నిత్యంబు గామిని నీదుపాత్ర
చయములను గావు నిత్యముల్ చారుశీల!

నీవు బ్రదికినయున్నాళ్లె నిలుచు నవియు

నిత్యుఁడును శాశ్వతుండును, సత్యుఁ డగుట
వలికి! భగవంతుఁ డతనిసంకల్ప భవము
లన్ని నిత్యముల్ సత్యంబు లెన్నిచూడ.
నీమపాత్రాళిసృష్టికి నిలుచుటకును

మానుటకు హేతు వెన్న నీమనమె కాదె

నవల యట్టులే యీజగన్నాటకమునఁ
బాత్రములకెల్ల నాభగవంతుమనమె
హేతు వంచును నీమది నెఱుఁగవమ్మ.

అమ్మ! నీనాటకంబున నఖిలపాత్ర
ములను రాజులఁ జేసితే? క్రొలఁదిపాత్ర
మేదియును లేదె? యటుసేయ హేతు వేమి?

రాజపాత్రంబు నీకేమి రాజ్యమిచ్చె.
నల్పపాత్రంబు నీకేమి హానిఁగూర్చె
పక్షపాతంబు నీకేల పలుకు మనిన
భామరో! యేమి చెప్పెదో పలుకవమ్మ?

అట్టులే యని యెంచుమీ హరివిధంబు
ఆయ నాడించినట్టులే యాడవమ్మ
కరము సంతోషమందు జగత్ప్రభుండు.

తల్లి! నేనాడినట్టి తత్త్వముల విధము
ఎక్కనే నీదుమనసున కిప్పుడైన.

## —ఃఃఃఃః శ్రీవైకుంఠగతి చింతన ప్రకారము ఃఃఃఃః—

చిన్నవిన్నప మొక్కటి సేయుదానఁ
దీర్పవే తండ్రి నాదిసందియము నీవు.

బ్రతికి యునట్టివేళల భక్తితోడ

రామ! కృష్ణ! ముకుంద! నారాయణా! ము
రారి! గోవింద! శౌరి! జనార్దనా య
టంచు స్మరియించుచుండిన నంతెచాలుఁ
గాష్ఠపాషాణ సన్నిభగతిని మరణ
సమయమునఁ బడియున్నను స్మరణచేయ
శక్తిచాలక యిట్టివంటి సాధుచరితు
నేన స్మరియించి కొంపోదు వానినాదు
నిలయమున కని శ్రీశుండు పలికెఁగాదె.

ఎట్లు కొంపోవుఁ దద్విధ మెల్ల నాకుఁ
దెలియఁ బలుకుము నామదిఁ గలఁకతీఱ
ననినఁ దనకూర్మి తనయకు ననియెఁ దండ్రి

అమ్మ యోయమ్మ యోయమ్మ యమ్మ యమ్మ
యనుచు నీమీఁదిప్రేమచే నంగలార్చు
తనయుఁ జేరంగఁ బోవె సత్యంబు చెపుమ.
వానికిని సంకటమ్ములు ప్రాప్తమైన
ఎత్తి ముద్దాడవే వాని నెంతోప్రీతి.

క్షుద్రజనముల నమ్మికఁ గొలుచుచున్న
వారు పరిజనములచేయి వదలకుండు
రక్షఁణలయందు నవసరమందుఁ గాదె?

అట్టిచో భక్తవత్సలుఁ డైనచక్రి
యార్తజనరక్షకుండు దయాంబురాశి

పరమసౌశీల్యసౌలభ్య వరగుణుండు
ఆలి బిడ్డలఁ జుట్టాల నర్థ మిల్లు
వాకిలియు సర్వమును వీడి పరమభక్తి
నన్యగతి, నన్యకాంక్షయు నన్యసేవ
మాని తన్నొక్కనినె గొల్చు మానవులను
జేయివీడెడికర్కశచిత్తుఁ డగునె?

ఎన్నఁటికిఁ గాఁడు కాఁడమ్మ యెన్నఁటికిని.

వ్రణము వేచిన యేక శరీరంబునందు
గాటుమందుంచ నదిమండఁ గష్టపడుచు
శోకమందెద రెవ్వరో చూడవమ్మ.
శిశువా తలిదండ్రులో నీవె చెప్పవమ్మ.
బాధపడలేక యేడుచు బాలకుండు
వానికష్టంబుఁ గనలేక తనరుఁ దండ్రి.
చేయఁగారానిపాపంబుఁ జేసెనేని
దుష్టతనయుని దండించి తోడుతోన
తరలి చని యావలికి నేడ్చుతల్లిదండ్రు
లవని నుండుట యెఱుఁగవా యఖిలహారియు.

తనశరీరంబు పోలికఁ దనదురక్ష
ణమునకును మఱి పరిపోషణమున కెపుడు
పాలుపడువారి కాధారపదవి నిల్చి
బిడ్డలకుఁ దల్లిదండ్రులవిధము నగుచు
జీవకోటులరక్షించు దేవుఁ డర్థి

ఎట్టు లన్నను దద్విధం బెఱుఁగ బఱుతు.

పరమకారుణికుండు శ్రీవల్లభుండు
క్రూరసంసారవారిధిఁ గూలియెంతో
కాలముగఁ గూలమును జేరఁ జాల కడలు
చేతనులఁ గాంచి వారి రక్షింపఁగోరి
తెలియకైనను గాకయాదృచ్ఛికముగ
నానుషంగికముగ నైన నట్లుగాక
యేదియొ ప్రసంగవశమున నేనిఁదెలిసి
బుద్ధిపూర్వకముగనైనఁ బుణ్యమేది
యేనిఁ జేసిన నపము నద్దానిఁ గొనుచుఁ
దరతరంబుగ నుత్తమదశకుఁ దెచ్చి
వారు జనియించునప్పుడే వారిమీఁదఁ
దనవిశేషకటాక్షంబుఁ దనరఁజేసి
విలయ మొందించి తనమీఁదిద్వేషబుద్ధిఁ
దనకు నభిముఖముగఁ జేసికొనుచు సాధు
సద్గసంభాషణాదుల సరఁగఁ గూర్చి
సాధుచరితుండు సాత్త్వికాచార్యకరుణ
కర్హులుగఁ జేసి జ్ఞానంబు నలవరించి
వారిముఖమునఁ దనయందు భరసమర్ప
ణాదికృత్యంబునుం దీర్చు హరియె కృపను.

ఇట్టివాఁడు శరీరంబు నిఁక ధరింపఁ
బనియు లేదని శోఁచినపట్టునందు

వానిసుకృతంబు హితులకుఁ బంచిపెట్టు
వానిపాపంబు ద్వేషులలోనఁ బంచు.

కాయమును వీడవలసినకాల మైనఁ
గాష్ఠపాషాణసన్నిభగతిని నుండు
జీవుఁ గేవలకరుణావిశేషమునను
దానె శౌరి ప్రబోధించుఁ దగినరీతి
తనదు స్మరణంబు గలిగించు దయదలిర్ప.
సంచ్యుతము గానిపూర్వసంస్కారకాంతిఁ
తాళిఁ గావించి బ్రహ్మరుద్రామృతాళి
కాంతులకుఁ బోలె యమభటకాంక్ష లేక
స్వయముగాఁ దానె జీవుండు బయటరాఁగఁ
గారణం బగుచుండును గరుణబలిమి,

అప్రశస్తప్రశస్తనియమము లేక
తానుఁ దలఁచినకాలంబు దారసిల్లఁ
గాయవిశ్లేషమున కెదే గారణంబు
కల్పితము సేయుఁ దానె శ్రీకాముఁడు.

అంత వాగాదికర్మేంద్రియంబు లైదు
పరఁగ జ్ఞానేంద్రియంబులపంచకంబు
మనసుతోఁ గూర్చి యటువంటిమానసంబుఁ
బ్రాణవాయువుతోఁ జేర్చి యట్టిప్రాణ
వాయువును జేర్చుఁ జుమ్ముఁ జీవాత్మతోడ
పదునొకండింద్రియమ్ములు ప్రాణములును

తోడుగూడినజీవాత్మ స్థూలదేహ
మథనసంభూతములును సూక్ష్మంబులైన
భూతములపంచకంబుతోఁ బొత్తుగలుపు.

ఇంద్రియప్రాణసూక్ష్మభూతైక్య జీవు
సహజసౌహార్ద్రుఁ డైనయీశ్వరుఁడు హృదయ
సీమ నుండెడితనయందుఁ జేర్చుకొనును
అట్లు స్థూలశరీరంబునందు నుండి
పండితాగ్రణులకు మఱి పామరులకు
సమమ యైనట్టి యుత్క్రాంతిక్రమము నొందఁ
జేసి యావలఁ గొంపోవుజీవు నట్లు
నాకనరకాదిలోకాళి కరుగుత్రోవ
లకును ద్వారంబు లగుచు నాళములు నూఱు
గలవు హృదయంబునందుండి వెలికిఁ బోవ
తాను గావంగఁ దలఁచినవాని జీవు
వానివెంటను బోనీక పట్టి నూట
నొక్కటవయది యాచును నొప్పుమీఱి
బ్రహ్మనాడి యటంచు మూర్ధన్యనాడి
యని సుషుమ్నయుననుచును నాఖ్యగన్న
హృదయమధ్యస్థనాడియం దేగఁజేయు.

పదునొకొండింద్రియంబుల ప్రాణములను
గూడుసూక్ష్మశరీరంబుతోడ నడిమి
నాడిలోనఁ బ్రవేశించి నళినకోశ

కదళీకాపుష్పకుచసామ్యకలన వెలయు
హృదయకమలంబు నడుమను బొదలుసూక్ష్మ
సుషిరమున మీఁదిభాగంబు సొరిది నెక్క-
వలనుగాఁగ నేకాదశద్వారయుతము
బ్రహ్మపురనామకంబైన వపువునందు
బ్రహ్మరంధ్రం బనంగను బ్రథితమైన
ముఖ్య మగువాకిలిని దీసి మోక్షకామి
నాపథంబునఁ బయనించునట్లు చేసి
నాడులను * శృంఖలాబంధన్యాయమునను
స్యూతమై యుండి సూక్ష్మమౌ సూర్యకిరణ
పాళి నవలంబముగఁ గొనులీలఁ జేసి
ముద్దులొలికెడి పలుకుల మురువుచూపు
బాలు లాలించు నాసార్వభౌమురీతి
గను ముముక్షువుఁ దన కేలఁ గనికరమునఁ
బట్టుకొని వెండి సంసారవార్ధిలోనఁ
బడఁగఁ గారణభూతమై పరఁగుకర్మ
వాసనారూపనిశ్రేణివలనఁ దొలఁగ
దీయుచును దేవయానంబు తెరువునందుఁ
జొరఁగఁజేయుచు హరియు నా తెరువునందు
నర్చియనియు నహస్సని యవలశుక్ల
పక్ష మని యుత్తరాయణవర్ష వాయు
సూర్యచంద్ర వైద్యుతులను పేరులొప్పి

* శృంఖలాబంధన్యాయము= గొలుసువలెనుండు ధర్మము.

పరఁగుచు సమానవాఖ్యులై వారలసహ
చారు తావరుణేంద్రప్రజాపతులను
వారలును బ్రీతి నెదురుగా వచ్చి మిగుల
స్వబహుమానంబుగాఁగను స్వస్వసీమ
దాఁటువఱకును మార్గప్రదర్శు లగుచు
వెంటరా నతివాహికుల్ వీరిలోనఁ
దా నె ముఖ్యుఁడు నై యుండి తరతరంబ
క్రమముక్రమముగ నన్నిటిఁ గడవఁజేసి
అచ్చటచ్చటి పొలిమేర లందు జీవుఁ
గరుణచే భగవచ్ఛాస్త్రకథితము లగు
వివిధభోగంబుల ననుభవింపఁజేసి
యర్చిరాదిమార్గం బని యాఖ్యగన్న
దేవయానంబునం గొనిపోయి విభుఁడు
ప్రకృతిమండలమున కూర్ధ్వభాగమందు
సొబగుమీఱుచు నెప్పుడు చూతు నొక్కొ
కన్నులారఁగ ననియెంతొ కాలముగను
వాంఛపై వాంఛగలిగి యవైష్ణవులకుఁ
బొందఁగారాని వైకుంఠభువనసీమఁ
గదియఁ గాఁ దెచ్చి యద్దానిగఱుసునందుఁ
బాఱునప్రాకృతాంబుల మీఱువిరజ
పేరినదికిని నీవలితీరమందు
పరమభక్తిప్రపత్తులబలిమిఁ దన్నుఁ
వశముపడఁజేసికొన్నయాబద్ధజీవు

పయనమున కనువ ర్తింపవలసియుంట
స్వస్వసంకల్పమునను సంస్థాపితంబు
నైన సూక్ష్మశరీరంబు నవలఁ ద్రోచి
కాయమెట్టిది లేక సంకల్పమాత్ర
విరజయావలియొడ్డున విడియఁ జేసి
యచట నప్రాకృతశరీర మందఁజేసి
యవల నైరమ్మదీయమహాహ్రదమ్ము
నవల సోమసవన మనఖ్యాతి గన్న
యట్టియశ్వత్థవృక్షంబు నందఁజేర్చి
యందుఁ గొందఱు మాలికల్, గొందఱంజ
నంబుఁ, జూర్ణంబు కొందఱునా నౌమైన
వస్త్రములను గొందఱునుమఱి పణము గొంద
ఱేట్టు లేనూఱు లచ్చర వెలమిమీఱ
వందవందగ గుమిగూడి వచ్చి యెదురు
ఆముముక్షువుఁ గైసేయ నవలఁ దరలి
తిల్యానామకవృక్షప్రదేశ మొంది
అందు వైకుంఠనాథునియమలదివ్య
విదితగంధంబులోనఁ బ్రవేశపెట్టి
తరలి సాలజ్జపేరిటిస్థాన మొంది
అందువైకుంఠనాథు దివ్యరసమునను
జొనిపి యపరాజితాఖ్యాయతనముఁ జేర్చి
అచట వైకుంఠనాథుదివ్యంబునైన
తేజమునఁ జొన్పి యావల దివ్యనిత్య

సూరు లెదురుగ రాఁగను సొంపుమీఱ
నామహాగోపురద్వారసీమఁ జేర్చి
అచట నింద్రప్రజాపతు లనెడిద్వార
పాలకులు ద్వార దివ్యకవాటములను
దాఁటఁ జేయ ముముక్షుని దయదలిర్ప.

భవ్యవైకుంఠ మనుపేరిపట్టనమున
విమలుఁ డగునీశ్వరుండు ప్రవేశపెట్ట
పురమునను రాజవీథిని నరుగువేళ
నచ్చటచ్చటినూరులు నాత్మగేహ
ములకు ముక్తుని గొనిపోయి మోదమునను.
నర్హరీతిని గడుగుదు రంఘ్రియుగము.

ఆత్మపుత్రుని దేశాంతరా గతునిని
జాలకాలంబునకుఁగని సంతసించు
తల్లులో యన శ్రీదేవి ధరణిదేవి
నీళ దేవియు వానిని నెమ్మిఁ జూచి
సమ్మదాతిశయంబున శారదపరి
పూర్ణహిమకాంశుబింబంబుపురుఁడు చూపు
వదనకమలంబు లొప్పార స్వపరిచారి
కాగణంబులు తమతమకరములందు
స్వపరమథనభూతభగవత్పాదుకలను
బూర్ణకుంభంబు మఱి దివ్యచూర్ణసమితి
దివ్యమంగళదీపముల్ దేఁగ నెదురు

వచ్చి లాలింత్రు మచ్చిక పలుకులొప్ప.
అఖిలలోకేశ్వరుండు శ్రియఃపతియును
మఱియు భగవంతుఁడైనను మాధవుండు
తరమటే యమ్మ యీతనికరుణఁ బొగడ.
నెదురుగా వచ్చి ముక్తుని హేమమయము
నవ్యమైనవిమానమంటపముఁ జేర
సరగఁ దెచ్చినబ్రహ్మయశస్సులందుఁ
జొరఁగఁ జేయుదు రావల నిరవధికము
నిరుపమము పరమానంద భరితనిత్య
ముక్తసేవితమును సర్వభువననాయ
కసమధిష్ఠితమగుచును గమ్రమైన
భవ్య మానందమయమంటపంబుఁ జేరి.
సరగఁ గుముదాదిదివ్యపార్షదులు మఱియు
ద్వారపాలురు తన్ను సగౌరవంబు
సబహుమానంబుగాఁ జూడ సైన్యనాథు
నాజ్ఞ నాస్థాననిర్వాహకాళి పిలువ
నడుగడుగునకు మ్రొక్కుచు నరిగి మండ
పముఖభాగంబుపై నెక్కి స్వర్ణశైల
సదృశరూపుఁ ద్రయీమయు సర్వలోక
ప్రథమజాయాపతులకు దర్పణమువంటి
వాని శౌరికి నభిముఖుఁడైనవాని
వైనతేయునిఁ గని వ్రాలి పదములందు
హరికథాలాపసక్తాత్ము లయి తదీయ

దివ్యగుణగణవర్ణనాధీనవదను
లై నయోనిత్యసూరులయందుఁ జేరి
వారిగోష్ఠిఁ బ్రవేశించి పరమభక్తి
దీర్ఘకాలాభిలషితంబు దివ్యభగవ
దంతరంగజనావాస మబ్బ దానఁ
బూర్ణచరితార్థుఁ డగుచును బోయి యవల
పరిజనములు పరిచ్ఛదాభరణములును
నాయుధంబులు తమలక్షణాళులొప్పఁ
బరిచరించుచు సేవింపఁ బద్మనయను
శేషపర్యంకనికటంబుఁ జేరి యచట
భగవదాజ్ఞను దలఁదాల్చి పనులు దీర్చి
సఫలకృషులయి పూర్ణసుస్వాంతు లగుచు
నంతరంగంబు సంతుష్టి నంద నున్న
యట్టి స్వాచార్యులనుగాంచి హర్షయుక్తి
తనకృతజ్ఞతఁ బ్రకటింపఁ దవిలి మ్రొక్కి.
దివ్యపర్యంకమును జేరి దివ్యసింహ
పీఠమున నష్టదళముల వెలయుచున్న
పద్మమున నష్టదళములఁ బ్రాక్క్రమంబు
గాఁగ విమలాదులైనమంత్రుఁ గాంచి మ్రొక్కి.
దివ్యపద్మంబు నడిమిప్రదేశమందుఁ
గలుగుకర్ణికమీఁదిభాగంబునందు
యోగపర్యంకతలమున నొప్పుమీఱు
నాగరాజేంద్రు వేయిఫణంబులందు

నున్నమణిరత్నకాంతుల నుల్లసించు
వానిశేషుని సేవించి భక్తితోడ న
నంతభోగంబునందు నాయాయవస్థ
కర్హపరిచరణముల శేషాశిశేషు
లాదిగాఁగల పరిచారకాళి కాజ్ఞ
సేయుచును గుణసౌందర్యశీలభావ
హావములఁ దనకనురూపయై రహించు
శ్రీరామాదేవితోడ నాసీనుఁ డయిన
హరిసంఫుల్లపుండరీకాయతాక్షు
దివ్యశస్త్రాస్త్రసాధనదివ్యభూష
ణావళీభూషితుని దక్షిణాంఘ్రి ముడిచి
వామపాదంబునుం జాఁచి వామపాణి
తలము శేషాహిభోగంబు, దక్షిణంపుఁ
బాణిదక్షిణజానువుపై గదించి
భూమినీళాసుసేవ్యుఁడై పూర్ణనిరతి
శయనిరవధిక భోగ్యుఁడై సర్వదశల
వాసుదేవాఖ్యుఁ డౌపరబ్రహ్మమూర్తి
నల్లవైకుంఠనాథుని నర్థిమ్రొక్కి
దివ్యశస్త్రాస్త్రసాధనదివ్యభూష
ణావళీభూషితంబు లౌనవయవముల
వేఱువేఱుగఁ దిలకించి విలపుభక్తి
పాదపీఠంబుదరిఁ జేరి భయవినయము
లార నవనతుఁడగుచు సాష్టాంగ మెరఁగి

మరల మరల నమస్కృతుల్ పరిచరించి
లేచి నిలుచుండి హరిమోము జూచి దేవ
కరుణ నైకాంతికాత్యంతికపరిచర్య
సలుప నీభృత్యుఁ గైకొమ్ము వలదు విడువ
ననుచు యాచింప స్వయముగ నాత్మజీవ
నావలోకనముల వాని నమృతవార్ధి
మునిఁగినట్టుల నానందమున మునింగి
అఖిలదుఃఖాపహములు నిరతిశయసుసు
ఖావహంబులు నైనపాదారవింద
ములను దలఁదాల్చి యవలంబములుగ వాని
స్వీకరించుచుఁ బర్యంకసీమ నెక్కి
చంక కెగఁబ్రాఁకు పుత్రునిచంద మొంది
యున్నముక్తునిఁ గనుఁగొని యుల్ల మలర
నెవ్వఁడవు నీవటన్నను నెల్లఁ దలఁచి
నిత్యసంసారిదశనుండి నిత్యసూరి
దశకుఁ దెచ్చిన భగవంతుదయఁ దలంచి
యతులమును నప్రతీకార మామహోప
కారము స్మరించి ముక్తుఁ డీకరణిఁబలుకు.

ఆది తెలియనికాలంబునందు నుండి
ఘోరసంసారవార్ధిలోఁ దీర మునిఁగి
తల్లడిల్లుచు నున్నత్వద్దాసజనుఁడ.
త్వత్కృపాలోకనంబునఁదావకాత్మ
సుస్వరూపానుభవరూపశుభమహాబ్ధి

నిపుడు మగ్నుండనైతి నోయిందిరేశ
సర్వజగదాత్మభూత యస్మత్స్వరూప
మెపుడు త్వత్స్వరూపాధీనమే మదీయ
మా ప్రవృత్తినివృత్తులు నభవ తావ
కీనసంకల్పములకు నధీనము లగు
నాదు భోగ మదీనంబునీదుభోగ

మునకు సర్వజగత్స్వామి విను మకార
వివరణప్రతిపాదిత విపులదాస్య
మందు నిత్యంబు నిలఁబడి యాత్మరూప
మునకు ననురూప మగుచును ననవరతము
నిత్యసూరులపోలిక నీదుదాస్య
మునకు నప్రతిహతమును బూర్ణతమము
నైనస్వాతంత్ర్యమును నేను బూనఁగంటి

వాక్కునకు మానసమునకు వశముగాదు
నీగుణంబు లటంచను నిగమచయము
అట్టివాని స్తుతింప సమగ్రముగను
చక్కఁగా ననుసంధింప శక్తి గలిగ
రామ! యిఁకఁ బునరావృత్తి రహిత మగుచుఁ
గొంచెమేనియు విశ్రాంతిఁ గూడనట్టి
నీదుకైంకర్యమున నన్ను నిలుపవయ్య
ఇదియ నాకోర్కి గోర నే నితరమేది
అనుచు విన్నపమును జేయునావిముక్తు

పలుకు లాలించి యా శ్రీయఃపతియుఁ జన్ను
పాలువిడువని లేఁగూన ప్రథమ భాషి
తంబు వినినట్టిజననినా నింబుమీఁఱు
శ్రీసతీవదనంబు వీక్షించి సాశ
యముగ నట్టియభిప్రాయ మందియున్న
యామెతోఁడఁ గటాక్షించు నతనిఁ దల్లి!

పరమ శేషులదివ్యదంపతులకృపకుఁ
బాత్రుఁడై సర్వదశలందు భవ్యనిత్య
నిరతిశయకింకర క్రియానిపుణుఁ డగుచు.
సర్వవిధ దేహముల వాని సలుపుచుండి
అనతిశయ మనవధికంబు నతులితంబు
నైన యానందరసవార్ధి నతఁడు మునుఁగు
సకలవిధముల భగవంతుసముఁడై యగును
భోగములయందు ; లోకముల్ పుట్టగిట్టఁ
జేయునాశక్తిమాత్రంబుఁ జెందఁబోఁడు
ముక్తయానంబు నీరీతి ను క్తమయ్యె
నుపనిషత్తులదానిలో నొక్క కొంత
సంగ్రహంబుగఁ జెప్పితి జనని! నీకు.
విష్ణుభక్తులు తరియించువిధము నీకుఁ
జెప్పఁదగినది యంతయుఁ జెప్పినాఁడ
ఎట్టిబుద్ధిని భగవంతుఁ డిచ్చునీకు
నట్టిత్రోవను బొమ్ము మేలగుత నీకు.

శ్రద్ధ యెట్టిదో యిందున్నసమయమందు
నట్టిదే ఫలమబ్బు దేహాంతమందు.

కాన నుత్తమశ్రద్ధయే పూనవమ్మ
యుత్తమఫలంబుపై వాంఛయున్న దేని.
తల్లి! యంగడికై నీవు తరలువేళ
వస్తువుల వేనిఁగొనఁగను వాంఛపడెదొ
యట్టియంగడికే గద యరిగెదీవు
నీదుకోరిక నెఱవేర్చు నిపుణుఁ డతఁడు
నీవుకోరినయాదశ నీకుఁ గూర్చు
డాయికావలె ననియున్న డాయివగుదు.
శూన్యమైపోవ వలెనన్న శూన్య మగుదు.
కాన నిట్టిసుఖంబునఁ గాంక్షయున్నఁ
దలఁచుచుండుము యిఁటువంటిదశ నె నీవు.

భక్తి లేకున్న సర్వము వ్యర్థమమ్మ
భక్తి కలిగిన సర్వంబు వ్యర్థమమ్మ
శ్రీతలోదరిపతి మోక్షదాత గాన
విపులహరిభక్తి గలిగి జీవింపవమ్మ.

పరమ భక్తియు దుష్కరతరము గాన
భక్తియంగంబుగాఁగఁ బ్రపత్తి సలుప
సర్వశుభములు చేకూరు జనని నీకు.

## తత్త్వముల యుపసంహారము.

తత్త్వములయుపసంహృతి తద్విధంబు
కొంతవినిచితి వివరింతు నంత నిపుడు,
సృష్టి దెలిసినపిదప సంహృతియుఁ దెలియు
దానఁ దొలుదొల్త సృష్టివిధంబు ననెద.

ఈశ్వరుఁడు జీవుఁడజులౌట సృష్టిలేదు.

మాతః! పరమాత్మనుండి తమంబు గలిగ
అదియె ప్రకృతికిఁ గారణమై తనర్చె
ప్రకృతివలన మహత్తు సంభవముఁ గాంచె
అమ్మహత్తున కొదవె నహంకృతియును
దానివలనను జిహ్వయుఁ ద్వక్కు మఱియు
ఘ్రాణమును వీను లక్షులు కలిగెనవల
అట్టిజ్ఞానేంద్రియములకు హస్తపాద
వాక్కు పాయువుపస్థము ప్రభవమొందె
శబ్దతన్మాత్రమునకును సంభవించె
నమ్మ యాకాశతన్మాత్ర మట్టిదాని
కొదవె నాకాశ మనునది; యుద్భవించె
దానికిని స్పర్శతన్మాత్ర దానికొదవె
వాయు వావాయువునకును బ్రభవమొందె
రూపతన్మాత్ర మియ్యది రూఢిఁ గాంచె
తేజమును రసతన్మాత్ర తేజుకొదవె
అట్టిదా రసతన్మాత్రకప్పుకలిగె

అప్పునకు గంధతన్మాత్ర ముప్పతిల్లె
గంధతన్మాత్రమునఁబృథ్వి కలిగె నమ్మ
భూతసృష్టివిధం బిది పూతచరిత.

మరల లయవేళఁ దలఁపు మీసరణినీవు
దేని కెదికారణం బది దానిలోన
లీనమైనట్లు భావింప నౌను జుమ్ము.
గంధతన్మాత్రమునఁ బథ్వికలిసిపోవు
అదియు లయమందు నప్పుల నప్పులయము
నొందుఁ జుమి రసతన్మాత్రమందు నదియు
తేజమందు లయించును దేజు కలియు
రూపతన్మాత్రమం దది రూపు మాయు
వాయువున, స్పర్శతన్మాత్ర వాయు లయము
గాంచు నదియు లయంబు నాకాశమందు
ఆకసము శబ్దతన్మాత్రమందుఁ గలయు.
అదియుఁ బదియును నొక్కటై యమనునింద్రి
యములు లయమొందుఁ జుమ్ము యహమ్మునందు
ఆయహంకృతి కలియు మహాత్తునందు.
అదియుఁ బ్రకృతిని లీనమై యణఁగుఁ బ్రకృతి
తమమునఁ లీనమయిపోవు తమము జీవు
నందుఁ గలియును జీవుండు నైక్యమొందు
జుమ్మి పరమాత్మతోడఁ గ్రమమ్ము గాను.
నిద్రలో జీవుఁ డీరీతిని లయము గొను

శనయథాస్థానమున దీనిఁ దలఁపవలయు
నైక్యమైరూపనాశంబటంచుఁ దలఁప
వలదు వేఱుగఁ జెప్పంగ వలనుపడని

యంతసూక్ష్మంపుస్థితియని యర్థమమ్మ.
ఇదియు నీకు నసాధ్యం బదేల యనిన
శ్రీపనిషదంపుమంత్రంబు లనుచు యోగ
మునను శ్వాసంబు బంధించి యవలనిట్టి
భావనారూఢి సాధింపవలయుఁ జుమ్ము.
దీని సాధింపరాదేని దీనిఫలము
నొసఁగుమార్గంబు వేఱొండు నున్నయదియు
బ్రాఁతచే నది చెప్పంగ వలనుపడదు.

## ముముక్షునిత్యచర్య.

అమ్మ! యిఁకమీఁదఁ జెప్పెద నాలకింపు
ముక్తికాముని దినచర్య పూనికతోడ
శుభవమునంద మోక్షంబు నిచ్ఛగించు
వాఁడు కఠినవ్రతంబుల వఱలవలయు
ఒక్కత్రుటి యైన రిత్తగాకుండఁ జేయ
వలయుఁ బ్రాప్యంబుచింత నెబ్భంగి నైన.

లక్ష్యమును నిశ్చయించి తల్లక్షణంబు
పూర్ణముగ నిల్ప వలయును బుధుఁడు తొలుత
నవల లక్ష్యంబు భేదింప నర్హమైన
సాధనము సేకరింపఁగఁ జనును నరుఁడు

సాధనము కేలఁగొనుచు లక్ష్యంబుమీఁద
దృష్టియును మానసము చలియింపకుండ
నిలుపవలయును స్థిరుఁ డయి నిలిచి ధరణి
ఎంత నరుఁ డభ్యసించునో యంత వేగ
గుఱిని సూటిగఁ దప్పక కొట్టఁగలఁడు
ఉపమ దీనిని నిల్పుమీ యుల్లమందు
నించుకయు నేని నిటునటు సంచలింప
దృష్టి యేనియు మనసేని దేహమైన
గుఱినిగొట్టంగఁ జాలఁడు కొమ్మ వింటె.
శిష్యులను ద్రోణుఁ డెటుపక్షిశిరముఁ ద్రుంపఁ
బనిచి వారిఁ బరీక్షించెఁ బార్థుఁ డెట్లు
దానిభేదింపఁ గలిగెనో తద్విధంబు
మనసునను గట్టిగా నిల్పఁ జనును నీవు
భిన్నలక్ష్యంబులను వీడి భిన్నమార్గ
గమనమును వీడి భక్తి యంగంబుగాఁగ
నల ప్రపత్తియు నంగిగఁ దలఁచువాఁడు
చనఁగఁ దగు తెరువొక్కటే యనెడి వాఁడఁ
దక్కువారలు వేర్వేఱు దారులఁబడి
పోవుదుర యేని సుఖముగాఁ బోవనిమ్ము
నీదుమార్గంబు గనుచును నీవు పొమ్ము
గమ్యపదమును దప్పక గానఁ గలవు.

వార లెటు పోవుచున్నారొ వీర లెట్లు
చనెడివారలో యనుచింత చనదు చనదు.

భ్రష్టవర్త్యేద వటువంటిభావ మున్న
నొమ్మ సౌఖ్యానుభూతియే కోరదేని
నొందుమార్గంబులేదిది యొకఁడుదప్ప

తెలివిమాలినవారలు పలుకుచుందు
రేవియో ప్రొద్దుపోనివి యెల్ల వానిఁ
జెక్కుఁ గొనకిటి పెడచెవిలోనఁ జంతమాని

నమ్ముమీ నాదుపల్కు నోయెన్నోలాఁడి
అమ్మ పలుకొక్కటైన నిరాకరముగఁ
బలుకువాఁడను గానని నిలుపు మదిని.

అజ్ఞు లేవేవో యనినంత నదిరిపడకు
ప్రాజ్ఞుఁ లగువారు మెత్తు రీపద్ధతులను
ఎవగు మెచ్చిన మెచ్చర యేని నెవరు
దాన నేమగు లేఁడొకో దైవ మొకఁడు.

ఒక్కదేవుని నమ్ముమీ యొక్కమార్గ
మందె యరుగుమి జంకు లేకాత్మయందు
పేఁడయును బెల్లమును రెండు పిసుకవలదు

ఇట్టిత్రోవను జనవచ్చు నెవ్వరేని
పురుషులైనను స్త్రీలైనఁ దరుణులైన
వృద్ధులైనను బాలురేఁ విప్రులైనఁ
జరణభవులైనఁ దమతమశక్తికొలఁది

కర్మకాండంబె భేదించుఁ గాని యంగ

భక్తికిని యోగమునకుఁ బ్రపత్తికెల్ల
వారు నధికారులే కాన వలదు చింత

కర్మకాండంబు ద్విజులను గట్టిపెట్టు
పరుల కెవ్వారికైన నాబాధ లేదు.

బ్రాహ్మణుఁడు చేయకుండిన భ్రష్టుఁ డగును
భ్రష్టుఁడు నికృష్టుఁడే జాతిపంచమునకుఁ
గాన వానికిఁ దప్పదు కర్మచయము

వారిఁ గనుఁగొని తామును వారివలెనె
సలుపవలె ననువారలు జాల్ములమ్మ.

నేను బోధించు పద్ధతి నీవు వినుము.
ప్రాప్యుఁ డొక్కండె శ్రీకాంతుఁ డనుచుఁ దలఁపు
వాఁడు శ్రీశుండు విష్ణువు వాసుదేవుఁ
డార్తరక్షాపరుండు నారాయణుండు
సచ్చిదానంద రూపుఁడు సద్గుణుండు
హరి ముకుందుండు గోవిందుఁ డాప్తకాముఁ
డతఁడె రాముండు కృష్ణుండు నతఁడె నార
సింహుఁడును వత్సలుండును జిన్మయుండు
సర్వశక్తుండు పూర్ణుండు సర్వవేత్త
స్వామియుఁ గృతజ్ఞుఁడును దయాశాలి సాధు
శీలియు నుదారుఁ డనుచును దలఁపవలయు
దేవతామూర్తు లని యెంచి దేనిమీఁద
మనసు నిలుపుదు ? నని శంకగొనఁగ వలదు.

ఒక్కమూర్తినె నమ్ముమీ తక్కుపేర్ల
యర్థ మెఱుఁగుచు నట్టిగుణాళి గలుగు
వాఁడె నీదైవ మనుచు భావంబు నిలుపు.
వాని వాసస్థలంబును వలయుఁ దెలియ
బోటన న్నేలంతమూర్తియై పొలుచుచుండు
హృదయసీమను వసియించు నెల్లవేళ
నీకుఁ దోడుగ నీలోన నే వసించు
అట్టి రూపంబు కనఁబడు నంతవఱకు
నావలనుగూడ నెందెందుఁ దావకీన
దృష్టి మనములు నిలుచునో యెల్ల నదియు
నల్ల భగవంతు నాకృతు లనుచుఁ దలఁపు
ఇట్టివానిని నీవు కన్నారఁ గనఁగ
జతన మొనరింపు మోతల్లి సత్త్వరముగ
జాము గాకున్న మఱి యఱజాము గాని
యెక్కువగ నిద్దురంగొంట హేయ మమ్మ.
జాము రేయుండ మేల్కాని శయన మంద
హృదయమునఁ గుడికే ల్గదియించి భక్తి
"బ్రహ్మణస్పతి లె మ్మను భావముండు
మంత్రమును "వసురణ్వా"ను మంత్రమణిని
నుచ్చరింపఁగ వలయును నుర్విసురుఁడు
తక్కువారల కియ్యది తగదు వీరు
వారునుం గూడ మేల్కొని వరుసతోడ

హరి హరీ హరి హరి హరి హరి యటంచు
నేడుమాఱులు హరినామ మెన్నికొనుచు.
లేచి కూర్చుండవలయును లేమ వింటె
యోగ మెఱిగిన వారలు యోగమంది
రమున కరుగంగఁ దగును దత్క్రమము వేఱ
గాఁగఁ జెప్పంగఁ దగియుండుఁ గాన నిపుడు
తద్విధుల నెల్ల వచియింపఁ దగవుగాదు.
హరిని స్మరియించి కేల్మోడ్చి ధరణి నుద్ధ
రించినట్టి వరాహమూర్తికిని క్షితిధ
రాయనమ యంచు వామచరణము నేల
మోపి యోప్రియదత్తయో భూమిదేవి
యోవసుంధర తల్లివి నీవకావె
యెల్లలోకంబులకు క్షమియించునన్ను
పాదములు మోపువాఁడ నీపై నటంచు
వామపాదంబు మున్నుగా వసుధ నిడుముఁ

(పలుక నే నిప్పు డాచారపద్ధతులను
గ్రంథ విస్తరభీతి నోకలికిమిన్న)

వెలుపలికి నేగి మూత్రంబు విడిచి శుచిత
నరుగుదెంచియుఁ గూర్చుండి యాసనమున
వెనుకఁ జెప్పినరీతి నిర్వేదపడుము
చిలుకపలుకులవలెఁ గాదు చిత్త మిచ్చి.
సాత్త్వికత్యాగమొనరింపఁ జనును దొలుత.
గురువులను ధ్యాన మొనరించుకొనుము పిదప

సరవి గజరాజమోక్షణచరిత మెల్ల
పఠన మొనరింపఁ దగు నెట్టి వారలైన
పద్యములనైన శ్లోకాలు పాటలైన
అవల నవతారమూర్తుల స్తవము నను ము.

వసుదేవాదిమూర్తులవలయుఁ దలఁప
నామపంజరమున నిల్చి నయముతోడ
నవలఁ గేశవనామంబు లనఁగ వలయు
అవల శ్రీ భూమినీళలకగును మ్రొక్క
అవల వైకుంఠగతిచింతనంబు మఱి ము
కుందమాలయుఁ జింతింపు డెందమందు.
కృష్ణమంజరి పఠియింప నెసఁగుశుభము.
రామనుతి కృష్ణనుతి శుభప్రదములమ్మ
మేలుకొలుపులు పాడిన మేలుగలదు.
ఇంతయేటికి స్తోత్రంబు లెవ్వియైన
నుదయ మగుదాఁకఁ జెప్పుట యుత్తమంబు.

కేశవా కేశవా యని కేశవునిని
సంస్మరించుచు వెలికేగి సవిధి శుద్ధుఁ
డగుచు రదధావనము చేసి యర్హరీతి
భాగవత ధర్మశాస్త్రోక్త పద్ధతులను.
స్నాన మాడఁగఁ దగు నమ్మ స్నానురుండు.

స్నాన మొనరించి వారిచి సంధ్య యర్ఘ్యశ్రీ
మీయవలయును భాస్కరుం డేగుదేర

ఖుండు పూర్వమె యుండాఁక నుర్విసురుఁడు
నిలిచి గాయత్రి జపియింపవలయుఁ జుమ్ము
నియతసంఖ్యయుఁ దీరెనా నెమ్మనమున
దలఁపవలె నిష్టదైవమంత్రంబు సలుప
పాడుమొగమున నేదియుఁ బాడిగాదు.
ఏదిచేసిన విడిచిన నెట్టి దశను
సంధ్య మానంగరాదమ్మ శాస్త్రసురుండు.

అశుచియైనను శుచియైన నవనిసురుఁడు
సంధ్యవార్వంగవలయును సమయమందు.

మనసు దేహంబు భగవంతు పనులయందు.
నున్న వార్వక యుండిన నొదవ దఘము
పనులు ముగిసిన వెంటనే వార్వవలయుఁ
గాని మొదలంట విడువంగఁ గాదు తల్లి.

పయనమును జేయుచున్నట్టి పట్టునందు
మనసుతో నైనఁ దీర్పంగఁ జనునుదానిని
తోయములు లేక యున్నను దుమ్ముతోడ
నర్ఘ్య మిచ్చుట దోషావహంబు గాదు.

నిత్యకర్మంబులను దీర్చి నియతితోడ
స్వామి మందిరమున కేగి శరణు చొచ్చి
జపము చేయుము జామైన శ్రద్ధతోడ.
కర్మకాండంబు పనిలేదు కాంతలకును
శూద్రులకుఁ దక్కినవివెల్ల భద్రరీతి

సలుపఁగావలె వారలు శ్రద్ధతోడ
జపము ముగియించి లేచి యాసక్తితోడ
విష్ణునిసహస్రనామముల్ విదితగీత
మహిత మగు నాకుజాతరామాయణంబు
రాగమునఁ జల్పవలెను బారాయణంబు

ఆంధ్రకృతులొప్పు స్త్రీలకు నంఘ్రిజులకు
అన్న యొక్కటి చెప్పెద నాలకింపు.
కోపగింపకు నాపయి గురుమనీష
సంప్రదాయంబు చెలుపంగ సమ్మతింప
శాస్త్రబద్ధుండ స్వేచ్ఛమై చనఁగనేర
భాషగాదు ప్రధానంబు భావ మొండె
ద్రావిడామ్నాయ మనుచును ద్రావిడులును
ఔత్తరాహికుల్ హిందీని నధికభక్తి
మాతృభాషయటంచును మహితరక్తి
సంస్కృతంబు సమంబుగఁ జనుపుచుండ
ఆంధ్రు లేటికిఁ బెఱకు నల్లాడుచుండ.

శాస్త్రముల్లంఘనము సేయుసరణి గాన
దానదోషంబు మీకును దనరుననుచు
భయముపడియెద వేల్లొండు భయము లేదు.
వేదసంబంధమంత్రముల్ విడిచి తక్కు
వాని నేవేని చదువుము వలసియున్న
అమరభాషనా వేల్లొండు నందొనీవు;

అర్థమెఱుఁగక వదరినయంత మేలె
అర్థమెఱుఁగమి భావంబు ననువుపడునె
శూన్యభావంబునను జెప్పఁసుద్దు లేల
యుక్తికష్టంబుగాక యోయువిదమిన్న!
సంస్కృతము రానివా రెట్టిజాతులైన
నాంధ్రమునఁ బఠియించుటే యర్హ మగును.
ద్రావిడామ్నాయ మనునట్లు తత్త్వ మెల్ల
ననితి నేనియు మనయంధ్రమందు నాంధ్ర
వేద మనుచును నాగొంతుపిసుకు నోకో-
దండధరుఁ డాగ్రహమునఁ గోదండధరులు
ముందు వెనుకను బ్రక్కలఁ బూని కావ
నవనిసుత నన్నుఁ గాఁగిట నాదరింప
దాయునా నన్ను నాదండధరుఁడు గిరుఁడు
అయినఁ గాలంబు లేదమ్మ యంతపనికి
ఎన్నినాళ్లుగనో యిది హృదయమందు
గాఁడియున్నది విశ్వేశుకరుణ లేదు
ఆంధ్రులకు నంతయోగ్యతయమర లేదొ
పుట్టనున్నాఁడో యెవఁడైన నట్టిపనికి
తమస్వభావను సర్వంబు నమరియుంటఁ
గాదె ద్రావిడు లందెంతకర్కశులకుఁ
గొంచెమో నంచమో భక్తి కుదురుపడుట.
ఆంధ్రమునఁజేయవమ్మ పారాయణంబు.

ననుచుఁ జెప్పితి నని నన్నుఁ గినియవలదు
స్వీయ మనునభిమానానఁ జెప్పినాఁడ
అట్టితలఁపున మంత్రంబు లాంధ్రమున నె
చెప్పుచున్నాఁడ మీకెల్లఁ జేయుటకును
ఉన్నది వచింగినాఁడ నేమన్న సరియె
మంచియో చెడ్డయో మీకు మంచిదనుచుఁ
జిత్తమునఁ దోఁచినట్టులు చెప్పినాఁడ
పిదప మీయిష్ట మేనేల పెనుఁగులాఁడ
అడిగితివి కానఁ జెప్పితి నంతెకాని
యభినివేశంబు లవము నాయందు లేదు.

జపము పారాయణంబును జలిపి పిదప
స్వామిపూజ యొనర్పఁగఁ జనును దల్లి
పిదప భుజియింపవలయు నివేదితాన్న
మువల మాధ్యాహ్నికమును దీర్చి యవనిసురులు
దీరుపకయు యొండెఁ దక్కినవారుమరల
వాల్మీకముురామచరితంబు భారతంబు
వైష్ణవపురాణ హరివంశ భక్తచరిత
లాదిగాఁగల హరిచరిత్రాంశములను
వ్యాసశుకశౌనకోక్త ప్రబంధములను
చదువువినిపింపు వినవమ్మ శక్తికొలఁది
జపము చేయుము వ్యాఖ్యలు సలువులేక
స్తోత్రవానిని శ్రీహరిఁ గూర్చివ్రాయు

బియ్యమేనియు శ్రీరాముపేర నెంచు.
ప్రొద్దుపోవనిముచ్చట్లు పొంతబోకు
అవల సూర్యుండు గ్రుంకెడు నదను చేర
బ్రాహ్మణులు సంధ్యవార్వంగవలయు విధగ
విష్ణునామసహస్రముల్ విహితరీతి
పఠన మొనరించి భుజియింప వలయు(?)సహ
అవల కృష్ణచరిత్రంబు నగును జనుప
అన్నియును సాత్త్వికత్యాగ మగును జేయ
అవల భగవంతుఁ గూర్చిన స్తవము చదివి
యోగ మభ్యాసమొనరింప యుక్త మగును
ఇట్టు సలుపంగనేరని యట్టివారు
సలుప నేర్చిన వారును శ్రద్ధతోడ
వలయు వైకుంఠగతి చింత సలుప నిట్లు.
సలిపి నిద్రగ పైపడుసమయ మైన
నామపంజరమున నుండి సదయముతోడ
సాత్త్వికత్యాగ మొనరించి తమయు మొదలు
ప్రకృతి పర్యంతతత్త్వముల్ స్వస్వకారణముల సంస్మృతిగావించి క్రమము గాఁగ
ప్రకృతిఁ దమమున దమమును ప్రశ్రమమున
జీవుతోడను జీవుని దేవుతోడ
వగుస నుపసంహరించియు భక్తితోడ
పరము చరణాబ్జములయందు శిరముఁ జేర్చు
శ్రీరమానాథు విడువని చింతతోడ

సుఖముగా నిద్ర పోఁ దగు శుభచరిత్ర!
నడుమ నడుమను మెలఁకువ దొడరెనేని
వలయు భగవంతు నామముల్ పలుకుచుండ
ఇట్లు త్రుటియైన వ్యర్థమై యేగకుండ
హరికిఁ గైంకర్య మొనరించు నట్టివారు
అమ్మరో పరమైకాంతుల నఁగఁ బడిరి
అట్టివారి కనాదిమాయానిశావ
సానమందు ననంత మోక్షప్రకృష్ట
వాసరారంభమునఁ దోఁచు ప్రత్యుషస్సు
నట్టిదై యుండు మిగిలినయాయు వెల్ల
మీఁదఁ జెప్పిన క్రియలందు నేది యేని
సలుప సాధ్యంబు గాకున్న సలుప కున్న
నట్టివేళల స్మరియింపు మమ్మ హరిని.
జపమె సేయుము భజియింపు స్తవ మొనర్చు
మేదిచేసిన భక్తితో నెగ్గు లేదు.
అన్నియును వీడి గడియల నఱువదింట
రామనామంబు స్మరియింపు కామ మెడలి
యదియె నీదొడ్డిపెట్టినయమరతరువు
సర్వవిధములఁ గాచును శంక వలదు
ప్రకృతిమీఁదవిరక్తియుఁ బరముమీఁద
గాటమౌరక్తి ముక్తి తంగేటి జున్ను
చెప్పవలసిన వేవియో చెప్పినాఁడ
సందియంబున కెడమీని సరణి నీకుఁ

చేత కష్టంబు సుకరంబు చెప్పవెల్ల
సలుప నీవంతు ఫలమీయ శౌరి వంతు,
అనుచుఁ గస్తూరిసుబ్బరాయాఖ్యధరక
బత్ని వేంకటసుబ్బమ్మ భక్తితోడ
భక్తిఁగూరిచి యడిగినప్రశ్నములకు
శ్రీరఘూత్తమపాదాబ్జసేవకుండు
జానకీదేవికౌఁగిటి చంటిబిడ్డ
నియమనిరతుండు సన్మార్గసిద్ధుఁడును
వాసుదాసుండు హరిదాసదాసకుండు
భక్తియోగులకును పూర్వవర్తకముగ
దిక్ప్రదర్శనముగ నిట్టు తెలిపెఁ బ్రీతి
అల్లదంపతులేదీని నంధ్రదేశ
మందుఁ బ్రకటించిరర్థిరామార్పణముగ.

గద్యము.

శ్రీరామచంద్ర చరణారవింద మిళింద నాయమాన
మానసత్వ మహామహిమభవ శ్రావిక గోలను
రామచంద్రరాయ తనూభవ సుజన
విధేయ సుబ్బరాయ ప్రణీతంబైన
ముముక్షుహితచర్యయందు
ద్వితీయాశ్వాసము సంపూర్ణముఁ
శ్రీరామార్పణమస్తు.
స్వస్తి రస్తు.

Kesari Printing Works, Madras.



శ్రీ రామాయనమః.

# ముముక్షు హితచర్య తప్పొప్పుల పట్టిక.

ప్ర థ మా శ్వా స ము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | | పీఠిక. | |
| iii | ౭ | కుంటుంబము | కుటుంబము |
| | ౧౫ | జజ్ఞాసువు | జిజ్ఞాసువు |
| v | | | |
| | ౧౯ | కర్త్వాను. ష్ఠానము | కర్త్వానుష్ఠానము |
| vi | ౪ | (దనవియనుకొను | (దనవియనుకొను |
| | ౧౩ | ముఖ్యములో | ముఖ్యములు |
| VIII | ౧౯ | పకృతితత్త్వము | ప్రకృతితత్త్వము |
| ౯ | ౮ | అఱువురు | ఆఱువురు |
| ౩౨ | ౧౨ | అంబ! రో! | అంబరో! |
| ౩౬. | ౮ | బాకతవిధమ | బాళ్క విధమ |
| ౩౮ | ౧౧ | నిటియావిరి | నీటియావిరి |
| ౩౯ | ౨౧ | కవితుం | కలితుం |
| ౪౧ | ౧౬. | యోప్పు | యొప్పు |

| పొరట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | ౧౬ | సాహిత్యిమందు | సాహిత్యమందు |
| | ౧౮ | మూర్చనలు | మూర్ఛనలు |
| ౧౩౨ | ౧౭ | గ్రంథు వెడలిన | గ్రంథులెడలిన |
| ౧౩౩ | ౪ | నన్నమునుశ్వాన | నన్నమునుదినుశ్వాన |
| ౧౩౪ | ౧ | ప్రాకృపర | ప్రాకృతపర |
| ౧౩౭ | ౯ | ముచ్చిక | మచ్ఛిక |
| ౧౪౦ | ౫ | సద్ధిస | నద్దిన |
| ౧౪౩ | ౧౮ | సపరిచ్చదంబు | సపరిచ్ఛదంబు |
| ౧౪౫ | ౧౨ | వం దేహ | సం దేహ |
| ౧౫౦ | ౪ | మఁది | మది |
| ౧౫౧ | ౧౩ | యోగవిధ్యను | యోగవిద్యను |
| ౧౫౫ | ౧౭ | గులటగ | గుబటఁగ |
| ౧౫౮ | ౧౪ | యుప్పుడప్పుడే | యప్పుడప్పుడె |
| ౧౬౧ | ౧౮ | యూంధిగాసుతుఁడు | యాగాధిసుతుఁడు |
| | ౨౦ | వాసుదేవుండే | వాసుదేవుండె |
| ౧౬౪ | ౪ | యుండె | యొండె |
| ౧౬౭ | ౧౫ | విసింగి | విసిఁగి |
| | ౧౭ | పాధ | బాధ |
| ౧౬౮ | ౫ | జీవచ్చవంబ | జీవచ్ఛవంబ |
| | ౧౮ | యింటి | యింట |
| ౧౭౦ | ౬ | బూరత్వమునను | జారత్వమునను |
| ౧౭౪ | ౫ | లెలిసి | తెలిసి |

| పొరట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౭౬ | ౧౩ | నట్టిదాకా | నట్టిదాకా |
| ౧౭౯ | ౧౦ | బంపు | ఒంపు |
| ౧౮౧ | ౧ | దానిపట్ల | వానిపట్ల |
| ౧౮౮ | ౧౯ | యున్నదాకా | యున్నదాకా |
| ౧౮౯ | ౯ | నెంచసలయు | నెంచనలయు |
| ౧౯౧ | ౪ | నబ్యాసమునను | నభ్యాసమునను |

శ్రీ రామాయ నమః.

# ముముక్షు హితచర్య తప్పొప్పుల పట్టిక.



## ద్వితీయాశ్వాసము.

| పొరట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | ౧౪ | యెకాగ్రవృత్తి | యేకాగ్రవృత్తి |
| 2 | ౧౧ | దిృష్టి | దృష్టి |
| 4 | ౨౧ | మనల | మవల |
| 8 | ౬ | శ్రద్ధయసు | శ్రద్ధయును |
| 11 | ౭ | లేదే | లే.దే |
| 16 | ౨౧ | కీవెటింగి | కీలెటింగి |
| 17 | ౨ | ఆది | అది |
| | ౩ | అభ్యాప | అభ్యాస |
| 18 | ౬ | శిశుమ | శిశును |
| 32 | ౧౯ | జానులై | జ్ఞానులై |
| 50 | ౯ | భగవత్ప్రాద | భగవత్ప్రసాద |
| | ౧౦ | ఏట్టి | ఎట్టి |
| 52 | ౧౬ | VI | IV |
| 58 | ౪ | IV | VI |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 57 | ౨౦ | మమ రేనేని | మమ రనేని |
| 59 | ౧౭ | నానూక్తి | నాస్సూక్తి |
| 63 | ౧౦ | సార్వభౌ | సార్వభౌ |
| 75 | 3 | దవివా | దనివా |
| | ౧౬ | శరణన్న | శరణాస |
| 76 | ౧ | యిందు | యంధు |
| | ౧౦ | వంయు | వలయు |
| 78 | ౨౨ | దార్ఢ్య | దార్ఢ్య |
| 80 | ౭ | శేష్యుఁడనో | శేషుఁడనో |
| 82 | ౧3 | కరీతి | కీరీతి |
| | | యొకఁటి | యొకఁడు |
| 83 | ౯ | న్వామివే | స్వామివే |
| 89 | ౨ | సుఖా | సుఖ |
| 92 | 3 | సీశఘించి | పసఘించి |
| | ౧౪ | దలంపసటి | దలఁపసట్టి |
| 93 | ౧౦ | లలితుఁదత్తఁడై | లలితుఁడత్తఁడై |
| 95 | ౧౮ | జిక్కుఁడో | జిక్కుఁడో |
| 109 | ౧౦ | సిపె | నిపె |
| | ౧౬ | వెత్రి | వెత్తి |
| 112 | ౨౨ | బాటసారివై | బాటసారిదై |
| 115 | 3 | నీదుబలమువు | నీదుబలమును |
| 116 | ౧౯ | జనుతో | జనులలో |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 118 | ౧ | మనుమావ | మనుమాన |
| | ౩ | మనగ | మనంగ |
| 121 | ౧౮ | నెమ్మ | నెమ్మి |
| 124 | ౧౬ | వలెసె | వలసె |
| 126 | ౩ | నన్యుఁదో | నన్యుఁడో |
| | ౬ | సముద | సముఁఢ |
| 127 | ౪ | వాపో యెదవు | వాపోయెదీవు |
| 128 | ౧ | వలెనే | వలెనె |
| | ౯ | నీమాత్రమైనవాత్సల్య జలధి | తల్లి! నీమాత్రమైన వాత్సల్యజలధి |
| 132 | ౨౦ | యునట్టి | యున్నట్టి |
| 133 | ౧౬ | యెంత్రో | యెంతో |
| 134 | ౧౩ | తసరు | వనరు |
| 138 | ౨౨ | సూర్యచంద్రవైన్యుతు లనుపేరులొప్పి | సూరచంద్ర వైద్యుతు లనుపేరులొప్పి |
| 139 | ౫ | ప్రదస్న | ప్రదన్న |
| | ౨౧ | నదకిని | నదికిని |
| 140 | ౫ | జెసి | జేసి |
| | ౧౩ | ంచ్చరసెలమి | లచ్చరలెంమి |
| 143 | ౧౮ | బ్రాక్కమంబు | బ్రాక్రమంబు |
| 144 | ౮ | శ్రీరామా | శ్రీరమా |
| | ౧౨ | జాఁచి | జాఁచి |

| పొరట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 146 | ౬ | మదీనంబు | మధీనంబు |
| 147 | ౨ | ప్రథమబాషి | ప్రథమభాషి |
| 151 | ౯ | రాదేవి | రాదేని |
| 153 | ౬ | జంత | జింత |
| 157 | ౫ | వసు | వాసు |
| 159 | 3 | సామముల్ | నామముల్ |
| | ౧౫ | జదువుచుంష్ట | జదువు చుంప |
| 164 | ౪ | బత్తి | పత్తి |
| | ౧౯ | శ్వాశము | శ్వాసము |